# ఆంధ్రప్రదేశ్

అక్టోబరు 1977

వెల : 50 పైసలు

గాంధీ జయంతి ప్రత్యేక సంచిక



# ఆంధ్రప్రదేశ్

సంపుటి : 21 | అక్టోబరు, 1977 | సంచిక : 12

భాద్రపద–ఆశ్వీయుజ, 1899 శా. శ.

ప్రధాన సంపాదకులు

శ్రీ రాజ్యం సిన్హా

సంపాదకులు :

పుంమర్తి ఆంజనేయులు

ముఖచిత్రం స్వాతంత్ర్య దినోత్సవ దృశ్యాలు

రెండు, మూడు కవరు పేజీలు · గాంధీజీ స్మృతి

చివరి కవరు పేజీ నవ శకం

( ఫోటో శ్రీ ఎస్ నందగోపాలనాయుడు)

**వెల: 50 పైసలు**

సాలుచందా · ఆరు రూపాయలు

రిజిస్టరు నెం. హెచ్. హెచ్. డి 81



## గాంధీజయంతి ప్రత్యేక సంచిక

## ఈ సంచికలో...

పేజీ









రాష్ట్రపతి డాక్టర్ నీలం సంజీవరెడ్డి
ఆగస్టు 17వ తేదీన
తిరుమల—తిరుపతి దేవస్థానం
సందర్శించిన దృశ్యాలు









# ప్రజాస్వామ్యంలో ప్రజలే పాలకులు

ముఖ్యమంత్రి శ్రీ జె. వెంగళరావు స్వాతంత్ర్య దినోత్సవ సందర్భంగా 1977 ఆగస్టు 15వ తేదీ ఉదయాన ఆకాశవాణి హైదరాబాదు కేంద్రం ద్వారా ప్రజలకు సందేశమిస్తూ దేశం ఆర్థికంగా అభివృద్ధిని సాధించనిదే రాజకీయ స్వాతంత్ర్యం సమగ్రం, సంపూర్ణం కాదనే విషయం ప్రజలందరికీ తెలుసుననీ, అందుకే మన రాజ్యాంగం మనకు ప్రజాస్వామ్య సోషలిజాన్ని లక్ష్యంగా నిర్దేశించిందనీ అన్నారు.

రేడియో ప్రసంగం పూర్తి పాఠం దిగువ ఇవ్వబడింది :—

జాతి జాగృతికీ ప్రజల నవచైతన్యానికీ ప్రతీకగా స్వాతంత్ర్య దినోత్సవం మనం జరుపుకుంటూ వుంటాము. ఉగాది, సంక్రాంతి మొదలైన పండుగల వలెకాక ఆగస్టు 15 రాజకీయంగానూ, ఆర్థికంగానూ, సాంఘికంగానూ చైతన్యవంతమైన ప్రజల పండుగ. ఈ పండుగను ఏటేటా చేసుకుంటూ దేశమాతను దాస్యశృంఖలాల నుండి విముక్తం చేయడానికి తమ సర్వస్వాన్ని అర్పించిన త్యాగమూర్తులను యీ సందర్భంగా మనం ఏటేటా సంస్మరించుకొంటూ వుంటాం. దేశస్వాతంత్ర్య సమరంలో ఎందరో మహానుభావులు కష్టాలను చిరునవ్వులతో అనుభవిస్తూ ప్రాణత్యాగానికి సైతం వెనుదీయలేదు. అష్టకష్టాలు అనుభవించి, శతాబ్దాల తరబడి నిరంతరం పోరాటంజరిపి సాధించుకున్న స్వాతంత్ర్యం విలువ వెలకట్టరానిది.

దేశం ఆర్థికంగా అభివృద్ధిని సాధించనిదే రాజకీయ స్వాతంత్ర్యం సమగ్రం, సంపూర్ణం కాదనే విషయం అందరికీ తెలుసు. అందుకే మన రాజ్యాంగం మనకు ప్రజాస్వామ్య సోషలిజాన్ని లక్ష్యంగా నిర్దేశించింది. ప్రజాస్వామ్యంలో ప్రజలే పరిపాలకులు. ప్రజల అభీష్టానికి అనుగుణంగా ప్రజా సంక్షేమానికి కృషి చేయాలని మనం కంకణం కట్టుకున్నాం.

## సాంకేతిక రంగంలో ముందడుగు

స్వాతంత్ర్యం లభించిన తర్వాత గత 30 సంవత్సరాలలో దేశం అన్ని రంగాలలో గణనీయమైన అభివృద్ధిని సాధించింది. ఆధునిక యుగంలో మారుతున్న ప్రపంచ పరిస్థితులకు అనుగుణంగా ముఖ్యంగా సాంకేతిక రంగంలో ముందడుగు వేయాల్సిన







అవసరాన్ని గుర్తించి అందుకు అవసరమైన ఎన్నో కీలక పరిశ్రమలను దేశంలో స్థాపించుకున్నాము. ఈనాడు పరిశ్రమల రంగంలో కానీ, సాంకేతిక శాస్త్రవిజ్ఞాన రంగంలో కానీ ప్రపంచంలో ఎవ్వరికీ తీసిపోని విధంగా భారతదేశంఅభివృద్ధి చెందడం నిజంగా మనకు గర్వకారణమైన విషయం. మన విధానాలవల్ల, మనం సాధించిన విజయాలవల్ల అంతర్జాతీయంగా మన దేశ ప్రతిష్ట ఇనుమడించింది. స్వాతంత్ర్యానికి పూర్వం అన్ని రంగాలలో అట్టడుగున వున్న మన దేశం యీనాడు అన్ని విధాల అగ్రగామిగా వుంది. భారతీయులు దీక్షతో కష్టించి పని చేస్తూండడమే అందుకు కారణం.

ఇక మన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో గత 30 సంవత్సరాల కాలంలో ప్రశంసనీయమైన ప్రగతిని సాధించామని చెప్పవచ్చు. భారతదేశానికి అన్నపూర్ణగాను, దక్షిణాది ధాన్యాగారంగాను పేరు ప్రతిష్టలు సముపార్జించుకున్న మన రాష్ట్రం యీ యేడు కూడా వ్యవసాయ ఉత్పత్తులలో తమ పేరు నిలుపుకుంది. దాదాపు కోటి టన్నుల ఆహారధాన్యాల ఉత్పత్తి లక్ష్యంతో మన రైతులు చెమటోడ్చి కృషి చేస్తున్నారు. ఇందుకు ప్రభుత్వ సహాయసహకారాలు కూడా సకాలంలో వారికి అందజేయడానికి చర్యలు తీసుకుంటున్నారు. స్వాతంత్ర్య సమర కాలం నుండి దున్నేవాడిదే భూమి అనే నినాదాన్ని ప్రవచిస్తున్న మనం నేడు దానికి క్రియారూపం యివ్వడంలో నిమగ్నమై వున్నాము. ఈ విషయంలో చాలా కాలం నుండి రక్షిత కౌలుదారీ పద్ధతి, రైతువారీ పద్ధతి అమలు జరుపుతున్నా, భూసంస్కరణలను అమలు జరపనిదే యిది సమగ్రం కాదని భావించి తదనుగుణంగా చరిత్రాత్మకమైన, భూసంస్కరణల చట్టాన్ని దేశంలోనూ, మన రాష్ట్రంలోను అమలు జరుపుతున్నాము. ఇటీవల కాలంలో మన రాష్ట్రంలో భూసంస్కరణ చట్టాన్ని ముమ్మరంగా అమలు జరుపుతూ వెంటవెంటనే మిగులు భూములను భూమి లేని నిరుపేదలకు పంపిణీ చేస్తున్నాము. ఈ మిగులు భూముల పంపిణీ విషయంలో షెడ్యూలు కులాలు, షెడ్యూలు తెగలు, వెనుకబడిన తరగతుల వారికి అత్యధిక ప్రాధాన్యం యివ్వబడుతున్నది.

## భాగ్యజీవుల అభ్యున్నతి

అనాదిగా అగాధ స్థితిలో ఉండి యుగయుగాలుగా సమాజానికి దూరంగా వెలివేయబడిన అభాగ్యజీవుల అభ్యున్నతికి కృషిచేయనిదే సంక్షేమ రాజ్యం నెలకొల్పడం సాధ్యం కాదని గుర్తించిన ప్రభుత్వం హరిజనులు, గిరిజనుల అభ్యున్నతికి అహరహం కృషి చేస్తున్నది. హరిజనులకు, యితర వెనుకబడిన కులాలవారికి ఇండ్ల స్థలాలు, సేద్యపు భూములు యివ్వడం, వారి పిల్లలకు ఉచితంగా విద్యా, వసతి సౌకర్యాలు కల్పించడం, ఉపవృత్తులను ఏర్పాటు చేయడం, ఆర్థిక సహాయం అందజేయడం వంటి సంక్షేమ కార్యక్రమాలను అమలు జరుపుతున్నాం.

## పరిశ్రమల ప్రగతి

మన ఆర్థిక వ్యవస్థకు వ్యవసాయమే వెన్నెముకగా వున్నప్పటికీ ఉపాధి కల్పనలోనూ, ఆర్థిక ప్రగతిలోను కీలక పాత్ర వహించే పరిశ్రమల రంగాన్నీ పెంపొందించే కృషి కుంటుపడలేదు. ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాలలో యువజనులకు ఉపాధి అవకాశాలను పెంచడానికి వీలుగా గృహపరిశ్రమలు, కుటీర పరిశ్రమలు, లఘు పరిశ్రమలు, విషయంలో ఎక్కువ శ్రద్ధ వహించాల్సి ఉంది.

దేశంలో ప్రజాస్వామ్య పద్ధతులలో శాంతియుతంగా అధికారాన్ని బదలాయింపు చేయడం యీ సంవత్సరపు ప్రత్యేకతగా పేర్కొనవచ్చు. ఈ యేడు దేశంలోనూ రాష్ట్రంలోనూ ప్రశాంతంగా ఎన్నికలు జరుపుకుని మనది పరిణతి చెందిన ప్రజాస్వామిక దేశంగా ప్రపంచ ప్రశంసలను అందుకున్నాము.

## దేశ సమైక్యతకు కృషి

మనం ఏభాష మాట్లాడినా, ఏ ప్రాంతంలో వున్నా భారతీయ సంస్కృతి అంతా ఒక్కటే. భారతీయులు అందరూ ఒకే లక్ష్యం గలవారు. కొన్ని ప్రాంతాలలో ప్రజల రాజకీయ అభిప్రాయాలలో తేడా వున్నప్పటికీ అందరూ ప్రజాస్వామ్య వాదులే. జాతి అంతా ఒక్కటే అనే విషయాన్ని మరువరాదు. దేశ సమగ్రతకూ, జాతి సమైక్యతకూ ప్రతి ఒక్కరూ చిత్తశుద్ధితో కృషి చేయాలి.

మనది ఫెడరల్ పద్ధతి కావడంవల్ల కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు పరస్పరం సదవగాహనంతోను, సహాయ సహకారాలతోను దేశాభ్యుదయానికి కృషిచేస్తూ వుండడం ముదావహం.

మరింత కష్టించి పనిచేస్తూ దేశ ఔన్నత్యానికి, జాతి అభ్యుదయానికి పాటుపడతామని ప్రతీ భారతీయుడు యీ పవిత్ర శుభ సమయంలో ప్రతిన బూనాలని నేను కోరుతున్నాను.




# మన కొత్తమంత్రులు



## శ్రీ ఆర్. నారపరెడ్డి

శ్రీ రొండా నారపరెడ్డి, 1922 ఆగస్టు 28న గుంటూరు జిల్లా బాపట్ల తాలూకాలోని పందిళ్ళపల్లిలో జన్మించారు. 1936 నుండి 1941 వరకు విద్యార్థి ఫెడరేషన్ ఆర్గనైజింగ్ కార్యదర్శిగానూ, రాష్ట్ర ఫెడరేషన్ కార్య నిర్వాహక సభ్యులుగానూ పనిచేశారు.

1942 నుండి కిసాన్ సభ సభ్యులుగానూ, బాపట్ల తాలూకా యువజన లీగ్ అధ్యక్షులుగానూ వ్యవహరించారు. 1946 నుండి గుంటూరు జిల్లా కాంగ్రెస్ సంఘం సభ్యులుగా ఉన్నారు. పి.సి.సి. ఉపాధ్యక్షులుగానూ, కార్యదర్శిగానూ వ్యవహరించారు.

శ్రీ నారపరెడ్డి, 1957 నుండి 1962 వరకు పార్లమెంటు సభ్యులుగా ఉన్నారు. 19·7 నుండి కేంద్ర పొగాకు సంఘం సభ్యులుగా పనిచేశారు. 1964 నుండి 1967 వరకు గుంటూరు జిల్లా కాంగ్రెస్ సంఘం అధ్యక్షులుగా పనిచేశారు.

గుంటూరు జిల్లా కేంద్ర సహకార బ్యాంకు డైరెక్టరుగానూ గుంటూరు జిల్లాపరిషత్ సభ్యులుగానూ వ్యవహరించారు. గుంటూరు జిల్లా పొగాకు ప్రోసెసింగ్, మార్కెటింగ్ సంఘం అధ్యక్షులుగానూ గుంటూరు సహకార మార్కెటింగ్ సంఘం డైరెక్టర్‌గానూ వ్యవహరించారు.

ఆయన ప్రదేశ్ కాంగ్రెస్ సంఘం సభ్యులుగానూ, ఆంధ్ర ప్రదేశ్ లఘు పరిశ్రమల కార్పొరేషన్ డైరెక్టరుగానూ ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర గిడ్డంగుల కార్పొరేషన్ డైరెక్టర్‌గానూ వ్యవహరించారు.

శ్రీ రెడ్డి 1960లో ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర శాసనమండలి సభ్యులుగా ఎన్నికైనారు. జాతీయ లఘు పరిశ్రమల కార్పొరేషన్ డైరెక్టరుగా కూడా వ్యవహరించారు. 1969లో బ్రహ్మానందరెడ్డి మంత్రి వర్గంలో పనిచేశారు.



## శ్రీ ఎమ్. మానిక్‌రావు

శ్రీ ఎమ్. మానిక్‌రావు, 1931 సెప్టెంబరు 6వ తేదీన గుల్బర్గా జిల్లాలోని మాల్ఖుడ్ గ్రామంలో వ్యవసాయ కుటుంబంలో జన్మించారు. యువజనోద్యమంలో ప్రత్యేక శ్రద్ధ తీసుకొని గ్రామ స్థాయిలోనూ తాలూకాస్థాయిలోనూ యువక సమితులను విజయవంతంగా నిర్వహించి యువక సామ్రాట్ బిరుదు పొందారు. హైదరాబాద్‌లోని వివేకవర్ధని ఉన్నతపాఠశాలలో విద్యనభ్యసించారు. విద్యార్థి దశ తొలిరోజులలో విద్యార్థి నాయకునిగా చురుకుగా పని చేశారు. స్వాతంత్ర్య సమరం ముమ్మరంగా జరుగుతున్న రోజుల్లో రెండుసార్లు అరెస్టు అయినారు. 1946–47లో విద్యాభ్యాసం విడిచిపెట్టారు.

1959లో తాండూరు పంచాయతీసమితి అధ్యక్షులుగా శ్రీ మానిక్‌రావు ఏకగ్రీవంగా ఎన్నికైనారు. 1962లో హైదరాబాదు







జిల్లాపరిషత్ ఉపాధ్యక్షులుగా ఉన్నారు. 1959లో హైదరాబాదు జిల్లా స్థానిక సంస్థల నియోజకవర్గం నుండి శాసనమండలికి ఏకగ్రీవంగా ఎన్నికైనారు. తాండూరు నియోజకవర్గంలో జరిగిన ఉపఎన్నికలో శాసన సభకు ఎన్నికైనారు. 1972 సాధారణ ఎన్నికలో అదే నియోజకవర్గంనుండి పోటీలేకుండా ఎన్నికైనారు.

శ్రీ మానిక్‌రావు రాష్ట్రగనుల కార్పొరేషన్ డైరెక్టరుగా వ్యవహరించారు. చేతిపనుల మండలి, యితర అనేక సహకార సంఘాలు, సంస్థలతో ఆయనకు సన్నిహిత సంబంధం ఉంది.

1971లో శ్రీ పి. వి. నరసింహారావు మంత్రివర్గంలో మునిసిపల్ పరిపాలనా శాఖను నిర్వహించారు. 1972 సాధారణ ఎన్నికల తర్వాత పునర్నిర్మించబడిన మంత్రివర్గంలో ఆయన అదే శాఖను కొనసాగించారు.



## శ్రీ కొమ్మూరి అప్పడు దొర

శ్రీ కొమ్మూరి అప్పడు దొర, 1910లో విశాఖపట్టణం జిల్లా భోగాపురంలో జన్మించారు. ఆయన స్వాతంత్ర్య ఉద్యమం ముమ్మరంగా జరుగుతున్న రోజులలో 1931లో కాంగ్రెసులో చేరారు.

ఆ సంస్థలో ఎన్నో పదవులను ఆయన నిర్వహించారు. ఆయన జిల్లా కాంగ్రెసు సంఘం అధ్యక్షులుగానూ, ప్రదేశ్ కాంగ్రెసు సంఘం సభ్యులుగానూ వ్యవహరించారు. శ్రీ దొర 1958 నుండి 1962 వరకు శాసనమండలి సభ్యులుగా ఉన్నారు. శ్రీ దొర ఆంధ్రప్రదేశ్‌లో ప్రముఖ సహకారోద్యమ వాది. ఆయన విశాఖజిల్లా భూమి తనఖా బ్యాంకు డైరెక్టరుగా వ్యవహరించారు. ముఖ్యంగా వ్యవసాయదారులకు ఉపయోగపడే అనేక సహకార సంఘాల అభివృద్ధికి ఆయన కృషి చేశారు.

శ్రీ అప్పడు దొర 1972లో జరిగిన సాధారణ ఎన్నికలలో విశాఖ పట్టణం జిల్లా, భోగాపురం నియోజకవర్గం నుండి కాంగ్రెసు టిక్కెటుపై శాసనసభకు ఎన్నికైనారు.



## శ్రీ కె. రాంరెడ్డి

శ్రీ కె. రాంరెడ్డి 1940 జూన్ 20వ తేదీన హైదరాబాదు జిల్లా పర్గి తాలూకాలోని మహమ్మదాబాదులో జన్మించారు. 1961లో న్యాయశాస్త్రపట్టా తీసుకున్నారు ఆయన కళాశాలలో చదివే రోజులలో విద్యార్థి కార్యక్రమాలలోనూ, క్రీడలలోనూ చురుకుగా పాల్గొన్నారు. యువజన కాంగ్రెసు ఉద్యమంలో ప్రముఖ పాత్ర వహించి, జిల్లా యూనిట్ ప్రధాన కార్యదర్శిగా వ్యవహరించారు. జాతీయవాది అయిన శ్రీ రెడ్డి ఈ ప్రాంతంలో కాంగ్రెసు నిర్వహించిన వివిధ ఉద్యమాలలో చురుకుగా పాల్గొన్నారు

శ్రీ రెడ్డి, 1967లో ప్రప్రథమంగా కాంగ్రెసు టిక్కెట్టుపై శాసనసభకు ఎన్నికైనారు. 1972 మార్చి వరకు చీఫ్‌విప్‌గా వ్యవహరించారు.

1972 సాధారణ ఎన్నికలలో హైదరాబాదు జిల్లా పర్గి నియోజకవర్గం నుండి కాంగ్రెసు టిక్కెట్టుపై ఎన్నికైనారు.









## శ్రీ పళ్ల వెంకటరావు

శ్రీ పి. వెంకటరావు, 1916 డిసెంబరు 16న తూర్పు గోదావరి జిల్లా ముమ్మిడివరం తాలూకాలోని తానేలంకలో జన్మించారు. ఆయన ప్రముఖ జాతీయవాది. స్వాతంత్ర్య సమరం ముమ్మరంగా జరిగిన సమయంలో 1930 ప్రాంతంలో ఆయన కాంగ్రెసుతో సన్నిహిత సంబంధం కలిగి ఉన్నారు.

శ్రీ రావు ప్రసిద్ధ సహకారవాది. రాష్ట్రంలోని అనేక సహకార సంస్థల అభివృద్ధికి కృషిచేశారు. సహకార శిక్షణ సంస్థ సభ్యునిగా, ఢిల్లీలోని జాతీయ సహకార సంఘం డైరెక్టరుగా ఈ రాష్ట్రంలో సహకార ఉద్యమ పెంపుదలకు ప్రశంసార్హమైన, ప్రతిభావంతమైన కృషి చేశారు.

ఆయన అమలాపురంలోని కేంద్రబ్యాంకుకు డైరెక్టర్‌గా వ్యవహరించారు జాతీయ కొబ్బరి అభివృద్ధి మండలితోనూ, మత్స్య పరిశ్రమ కేంద్ర మండలితోనూ సన్నిహిత సంబంధం కలిగి వున్నారు.

శ్రీరావు 1972 ఎన్నికలలో కాంగ్రెసు టిక్కెటుపై చెయ్యేరు నియోజక వర్గం నుండి అసెంబ్లీకి ఎన్నికైనారు.

## శ్రీ లక్ష్మీనారాయణ యాదవ్

37 సంవత్సరాల యువకులైన శ్రీ లక్ష్మీనారాయణ యాదవ్ పెంజర్లలో జన్మించారు, నర్సాపూర్ తాలూకా శివనగర్‌లో ప్రాథమిక విద్య అభ్యసించారు. ఆ తర్వాత సికింద్రాబాదులోని మహబూబ్ కళాశాల ఉన్నత పాఠశాలలో చదివారు. హైదరాబాదులోని నిజాం కళాశాల నుండి పట్టభద్రులైనారు.

ఆయన కళాశాలలో చదివే రోజులలో విద్యార్థి కార్యక్రమాలలో ప్రత్యేక శ్రద్ధ వహించారు. జాతీయవాది అయిన శ్రీ యాదవ్ కార్మిక సంఘాల ఉద్యమాన్ని నిర్వహించి వాటిలో ప్రముఖ పాత్ర వహించారు. హమాల్ సంఘాలకు ఆయన అధ్యక్షులుగా వ్యవహరించారు. యాల్విన్స్, ఎస్సెస్టాన్, బయోకెమికల్స్ మొదలైన వాటిలో ఐ.ఎన్.టి.యు.సి.లను నిర్వహించారు. ఆయన కృషి ఫలితంగా కార్మిక సంఘాల ఉద్యమం ఆరోగ్యప్రదమైన మార్గాలలో పయనిస్తూ ఈ ప్రాంతంలో కార్మిక సంక్షేమానికి దారితీసింది.

శ్రీ లక్ష్మీనారాయణ యాదవ్ 1972 జూలైలో శాసనసభ నుంచి శాసనమండలికి ఎన్నికైనారు.







# మద్యపాన విశేషము

-శ్రీ జోశ్యుల సూర్యనారాయణమూర్తి

సుర యొకనాఁడు సేవ్యవయి శుక్రునిచేత నిషిద్ధమైన దీ
భరతధరిత్రిలో ననుభవంబు గడించిన కారణంబుగా
గురువచనంబు తప్పదనుకొన్న జనంబున శాసనంబుగాఁ
బరిణతమైన శాస్త్రగుణపాఠము నేటికి నీతిపాఠమే।

దోసము దోసమే యనుచుఁదోచెడి బుద్ధికదేమి దోసమో
మోసమునంది దోసమున మోహముఁజూపును దుర్విదగ్ధమై
రోసముగల్గు దోషికి పరుండు హితంబువచించి యా దుర
భ్యాసముమానుమన్నఁ, బరిహాసము నందును నీతి వాక్యముల్

జాతికి నీతివాక్యములు చక్కనినానుడులై తెలుంగులోఁ
బ్రీతినిగూర్చు పద్ధతి హరించి నవీనయుగీన జీవన
స్రోతములో మునింగి యపరూపము లై గురుతింపరానివై
భీతినిగొల్పునట్లు గనిపించుచునుండెఁ గలిప్రభావతన్

త్రాగుటయనఁగా మద్యము
త్రాగుటయే యన్న రూఢి తత్త్వముఁజూడన్
సాగెడి దోసముపై, నను
రాగము వీడుటకుఁదోడు రాదనఁగలమే?

త్రాగిన నేమితప్పని పరాకున, బాడిన పాటలెల్ల స
త్యాగమసూక్తులైమన కహర్నిశముంజెవి కెక్కుచుండఁగా
రాగమొ రోగమో తెలియరాని యమాయిక లోకమందు నే
యాగడమైన సాగుటకు నడ్డముగల్గునె యెంచిచూడఁగన్?

ఇదియొకఛాందసమ్మయిన హృద్గత భావము సంప్రదాయ సం
పదహృదయంబునందుఁగనుపటని పట్టునఁబట్టుపట్ట, దా
మదిరకు గౌరవంబొసఁగు మాన్యుల మానసవీధికింపు నిం
పదు; రసహీన మార్గపదబంధముగాఁగనుపట్టుచుండెడున్

శాసనముల్ పొనర్చిగుణసంపద పెంచుటకెంచుబుద్ధి వి
శ్వాసవిహీనమై జనము శాసనబద్ధముకాక పోవుట
భ్యాసముఁజేసినందులకు హర్షవిషాదములందుచుండఁగా
నీసునుబొందనేల? గుణహీనత రాజ్యము చేయుచుండగా।

పెద్దల మాటమీద గురిపెట్టి చరించెడునట్టి సంఘమే
వద్దనుకొన్న కాలమున భావపరంపర నూత్ననూత్నమై
హద్దును పద్దులేకయె విహారమొనర్చుట సాజమయ్యెడిన్
ముద్దుగ ముచ్చటించుటది మూర్ఖతయయ్యె విచార ధోరణిన్

తన మార్గంబునఁదానుబోవుతరి సిద్ధంబైన యాపత్తులన్
గనుగొన్నట్టి విచారశీలియును, మూర్ఖంబైన సంచారమున్
దనివింజెందక వీడకుండుటయె మద్యప్రీతి నాఁజెల్లు; బో
ధనఁజేయందగినట్టి నూత్నపరమార్థంబిందుఁదానున్నదే?

ఓపికపట్టి మద్యముననున్న మహాగుణంబు లెల్లధీ
లోపమునంది నట్టితరి లొంగనివానికిఁ జెప్పవచ్చునే?
ధీపరిపూర్ణుఁడైనతరి దేవసమానుడు వాఁడు వానికిన్
నీపలుకుల్ రుచించుఁ, గరుణించును బిమ్మట మద్యమాతనిన్

ఒక వేదాంతము బోధచేయుటకు నుద్యోగించి "యుమ్మర్ఖయా"
మకటా! ప్రేయసితోడ మద్యగత హృద్యమ్మైన సారస్యమున్
సుకుమారమ్ముగ వెల్లడించె నదియే చొక్కించె సర్వావనిన్
సుకవిత్వా కృతితోడఁ, బానగృహమే శోభిల్లె బైరాగులన్

నాటక వస్తువయ్యె నధునాతన కాలమునందు మద్య బా
హాట విహారవాటిక మహానట నాట్య గుణప్రచారమై
చేటు నెఱుంగినట్టి పరిశీలకలోకము దోష జాలము
ద్ఘాటన చేసి సద్గుణము గనాన గోరు మనీష పెంపునన్

త్రాగిన వాని వేసమునఁ దానొక కొంత యశంబుగాంచె నే
భోగియొ వాని యోగమది భుక్తికి సాయపడె న్విచిత్రమై
సాగెను రోగమైయదియె సర్వనట ప్రకర ప్రలోభమై
యేగతిఁజూచినం గుణమ దింతయుఁగానఁగరాదు దీనిలో

మదిరాపాన వికార చేష్టిత సమున్మాదంబు చూపించుటే
తుది విద్యాధిక ప్రదర్శన మహా వ్యాపారమా, నిత్యమున్
మదిరాపానవిము గ్ధచిత్తు నకు? సన్మానించు సమ్మోహమే
మది? యీప్రేక్షకలోక మూకహృదయా హ్లాదముగల్పించెడిన్

ఇల్లు గడవక పేద దానేడ్చుచుండి
మద్యసేవను మానడు హృద్య మనుచు
ధనికుఁడా నంద మంది మద్యంబునాను
మద్య మీకెందు కందు రో మనల వారు?





# గాంధీజీ కలగన్న గ్రామరాజ్యం

గాంధీజీ అస్తమించి 30 సంవత్సరాలు కావస్తోంది. ఇప్పుడు మళ్లీ ఆయన మార్గానికి దేశాన్ని మళ్లించడానికి కృషి ప్రారంభమైంది.

మనం ఆయన నాయకత్వంలోనే స్వతంత్రం సంపాదించుకున్నప్పటికీ, ఆయన ఆశయాలు, విధానాలూ, సిద్ధాంతాలే మన స్వాతంత్ర్య పోరాటానికి ప్రేరణ కలిగించినప్పటికీ – స్వతంత్రం వచ్చినప్పటినుంచీ మనం ఆయన మార్గాన్ని కాదని – ప్రపంచంలోని అభివృద్ధిచెందిన ఇతర దేశాల అడుగుజాడల్లో నడవడానికి ప్రయత్నించి ప్రజాస్వామ్యపు మనుగడకే ముప్పువచ్చే స్థితివరకూ పయనించి, ఇప్పుడు చేసిన పొరపాటుకు పశ్చాత్తాపపడుతూ వదలిపెట్టిన మహాత్మాగాంధీ మార్గం వైపుకు మళ్లీచూస్తున్నాం.

అనేక రంగాలలో ఆయన మార్గానికి భిన్నంగా పయనించిన మాట నిజం. అయితే ఇక్కడ ఆయన కలలుకన్న పరిపాలనా వ్యవస్థనుగురించి మాత్రమే పరిశీలిద్దాం.

పరిపాలనా రంగంలో వికేంద్రీకరణ ఆయన ప్రధాన లక్ష్యం. గ్రామ రాజ్య వ్యవస్థను రాజ్యాంగబద్ధంగా నెలకొల్పాలన్నది ఆయన ఆశయం. దేశంలో ఇప్పుడు అమలులోఉన్న పంచాయతీరాజ్ వ్యవస్థకు గాంధీజీ సూచించిన గ్రామ రాజ్య వ్యవస్థకు పోలికలు లేవు సరికదా – ఆయన లక్ష్యాన్ని సాధించే కృషిలో వేసిన అడుగులుకూడా కావవి.

ఆయన ఊహించిన గ్రామరాజ్యంగురించి 'హరిజన్'లో రాస్తూ గాంధీజీ "సర్వస్వతంత్రమైన గ్రామ రిపబ్లిక్" గా వర్ణించారు. జీవితావసరాలకై గ్రామం ఎవరిమీదా ఆధారపడదు ; అవసరమైనప్పుడు గ్రామరిపబ్లిక్ – మరో గ్రామ రిపబ్లిక్‌పైన ఆధారపడవచ్చు ; గ్రామానికి కావలసిన తిండీ, గుడ్డా ఆ గ్రామంలోనే ఉత్పత్తి చేసుకుంటారు. నిత్యావసరాల పంటలకుపోగా భూమి మిగిలినట్లయితే ప్రయోజనకరమైన వాణిజ్య పంటలు వేరుశెనగ, నువ్వులు, పసుపు మొ॥ వి కూడా పండిస్తారు. అయితే గంజాయి, పొగాకు, నల్లమందు వంటివి పండించరు. పనులన్నిటిని సహకార పద్ధతులపైనే సాగించుకుంటారు. శాసన ధిక్కారం – సత్యాగ్రహం, అహింస గ్రామ ప్రజల స్వీయహక్కులుగా ఉంటాయి. వంతులవారి గ్రామ సేవకులు–గ్రామానికి కావలసిన అత్యవసర సేవలు చేస్తారు. ఎన్నికైన ఐదుగురు సభ్యుల గ్రామపంచాయితీ పరిపాలన సాగిస్తుంది. ఆడ, మగ భేదంలేకుండా అందరూ ఓటు చేస్తారు. ఈ పంచాయితీకి శాసన నిర్మాణం, పరిపాలన, న్యాయపాలనాధికారాలు కూడా ఉంటాయి. వ్యక్తి స్వేచ్ఛ పునాదిగా సంపూర్ణ ప్రజాస్వామ్యం వెల్లివిరుస్తుంది. తన ప్రభుత్వ నిర్మాతగా ప్రతి వ్యక్తీ భావించు





కుంటాడు. తన గ్రామ రక్షణకై ప్రాణాన్నయినా త్యజించడానికి ప్రతి వ్యక్తీ సిద్ధపడతాడు. నీటిలో రాయి వేసినప్పుడు ఏర్పడే తరంగవలయాలు - దూరం వెళ్తున్నకొద్దీ బలహీనపడినట్లు - అధికారాలు - గ్రామం కన్నా, జిల్లాకూ - జిల్లాకన్నా రాష్ట్రానికీ - రాష్ట్రానికన్నా కేంద్రానికీ వెళ్తున్నకొద్దీ తగ్గుతాయి.

ఇది గాంధీజీ కలగన్న వికేంద్రీకృత పాలనా వ్యవస్థ.

ఇప్పుడు రాష్ట్ర ప్రభుత్వాల గుప్పిటలో ఆ మాటకొస్తే జిల్లా-తాలూకా స్థాయి అధికారుల చెప్పుచేతల్లో మెలగవలసిఉన్న గ్రామ పంచాయితీలకూ గాంధీజీ ఊహించిన గ్రామ రిపబ్లిక్‌లకూ పోలిక లేదు.

గాంధీజీ కలగన్న గ్రామరాజ్యాన్ని మన దేశంలో 1938లోనే ప్రయోగాత్మకంగా నెలకొల్పిన సంగతిని ఇక్కడ గుర్తుచేసుకొనడం అవసరం. అతి ప్రధానమైన ఈ చర్య చరిత్రగర్భంలో కలిసిపోవడం విచారకరం.

---

## —శ్రీ సురమౌళి

---

అప్పటి బొంబాయి (ఇప్పటి మహారాష్ట్ర) రాష్ట్రంలోని థానా జిల్లాలో 'ఔంధు' అని ఒక స్వదేశీ సంస్థానం ఉండేది. దాన్ని 'అయోధ్య' అనికూడా అనేవారు. తన జన్మదినం కానుకగా ఆ సంస్థానాధీశుడు 1938 లో బాధ్యతాయుత ప్రభుత్వాన్ని ప్రకటించి గ్రామ రాజ్య వ్యవస్థకు అనుగుణమైన రాజ్యాంగాన్ని నెలకొల్పి అమలు జరిపాడు.

ఆ నాడు సంస్థానాధీశుడు జారీచేసిన ఫర్మానాలో ఇలా ఉంది:

"ఔంధు సంస్థాన ప్రజలు సంపూర్ణమైన పరిపాలనా బాధ్యత పొందుటకు తగిన సమయము ఆసన్నమైనదని మా నమ్మకము; పాశ్చాత్య దేశములలోని ప్రజాస్వామికమువంటి ప్రభుత్వ విధానము నేర్పరచి ప్రయోజనము లేదు. ఏ గ్రామమునకాగ్రామము స్వపరిపాలనాధికారము ననుభవించు మన పురాతన ప్రజాస్వామిక పద్ధతి ననుసరించుట మంచిదని అభిప్రాయపడి, మేము ప్రసాదించు బాధ్యతాయుత రాజ్యాంగ విధానములో గ్రామ స్వపరిపాలనమొక ముఖ్యాంశముగా చేర్చితిమి. ఇందు-గ్రామములు తమంతటతాము అభివృద్ధి పొందుటకవకాశముండును. ఈ సంవత్సరము ముగియు లోపలనే నూతన రాజ్యాంగ విధానము ప్రకటింపగలము. ప్రభుత్వ మనగా అధికారమును నెరపుట. అధికారమును నెరపుటకు ఆత్మ నిగ్రహము అవసరమని ప్రజలు విస్మరించరాదు. బలవంతులు, బల హీనులకు, ధనికులు, ధనహీనులకు, విద్యావంతులు, విద్యాహీనులకు తోడ్పడవలెను.

"ఆత్మనిగ్రహము, ఆత్మత్యాగములవలననే పూర్వకాలమున మన దేశమునందు ప్రజా ప్రభుత్వములు సాగుచుండెడివి. మన మత సూత్రములనే మన రాజకీయములలో ననుసరించితిమి, ఇప్పుడునటే చేయుదుము. సంస్థాన చరిత్రలో ఆరంభమగుచున్న ఈ నూతన శకము ప్రజలకెక్కువ సౌకర్యవంతము కావలెనని సర్వేశ్వరుని వేడుకొనుచున్నాము."

ఈ ఫర్మానారాగానే ఔంధు సంస్థానాధీశుని త్యాగ నిరతిని, సాహసాన్ని గాంధీజీ-నెహ్రూ కీర్తిస్తూ ప్రకటనలు జారీ చేశారు. గాంధీగారు తమ ప్రకటనలో ఇలా అన్నారు.

"ఔంధు సంస్థానంలో బాధ్యతా ప్రభుత్వాన్ని ప్రసాదించినందుకు ఆ సంస్థానాధీశుని, పొందగలిగినందులకు ఆ సంస్థాన ప్రజలనూ అభినందిస్తున్నాను. ఏ హక్కులు ప్రజల కిస్తామని ఫర్మానాలో పేర్కొన్నారో, రాజ్యాంగాన్ని రచించేటప్పుడు వాటికి ఎలాంటి లోపమూ రానివ్వరని విశ్వసిస్తున్నాను. సంస్థానాధీశుని స్వంత ఖర్చుకు ఇచ్చే మొత్తం ఏడాదికి 36 వేల రూపాయలకు మించరాదని నా అభిప్రాయం........ ఫర్మానాలోని చివరి భాగం చాలా హృద్యంగా ఉన్నది. సంయమనము, స్వార్థ త్యాగము లేనిదే స్వపరిపాలన సాధ్యపడదన్న వాక్యంలో సత్యం ఎంతైనా ఉన్నది.

సంస్థానానికి వారసుడైన యువరాజు ప్రజా సేవా రంగంలో త్రికరణశుద్ధిగా పాల్గొంటున్నాడని విని ఉన్నాను. పాశ్చాత్య విద్యాభ్యాసం వల్ల చెడిపోకుండా ఉన్నతంగా ఎదిగాడాయన. సత్యాహింసలలో అతనికి గాఢమైన నిష్ఠ కలదని తెలిసింది. గ్రామాభివృద్ధి కార్యక్రమాల్లో స్వయంగా పాల్గొంటాడట. పార-తట్ట పుచ్చుకొని ఇతర స్వయం సేవకులతో కలిసి వీధులను ఊడ్వడానికి సంకోచపడడు. పాకీ పని మొదలుకొని అన్ని పనులనూ అతడు ఉత్సాహ పూర్వకంగా చేస్తాడంటే-ఇంక చెప్పవలసిందేమి ?"

నెహ్రూ గారి ప్రకటనలో ఇలా వుంది :

" .... ... ఔంధు సంస్థానాధీశుడు రాజ్యాంగ విధానాన్ని మార్చడమేకాక, ఆ మార్పును అతినేర్పుగా, గౌరవప్రదంగా జరిపినందుకు ఆయన్ను అభినందించాల్సి వున్నది. వారి రాజ్యాంగ స్వరూపం నా దగ్గర లేదుకాని అందులో గ్రామ పంచాయితుల సమాఖ్య ఉన్నట్లు తెలుస్తున్నది. ఔంధు చాలా చిన్న సంస్థానమే కాని చాలా ఆదర్శనీయంగా ప్రవర్తించి పెద్దతనాన్ని ప్రదర్శించింది"

ఫర్మానాలో ప్రకటించినట్లుగానే 1939 జనవరిలో ఆ సంస్థానపు నూతన రాజ్యాంగాన్ని ప్రకటించారు. రాజ్యాంగం ప్రకారం తన స్వంత ఖర్చులకు సంస్థానాధీశుడు ఏడాదికి 36 వేల రూపాయలు మాత్రమే తీసుకోవడానికి నిర్ణయించుకొన్నాడు. ఈ కొత్త రాజ్యాంగం ప్రకారం ప్రతి గ్రామములోనూ ఐదుగురు సభ్యుల పంచాయతీ ఉంటుంది. పంచాయితీకే పరిపాలనాధికారాలన్నీ ఉంటాయి. రాష్ట్రాన్ని ఐదు తాలూకాలుగా విభజించారు. తాలూకా స్థాయిలో ఉండే తాలూకా పంచాయితీలో గ్రామ పంచాయితీల అధ్యక్షులందరూ సభ్యులుగా ఉంటారు. వీళ్ళంతా కలిసి ఒక తాలూకా పంచాయితీ అధ్యక్షుణ్ని ఎన్నుకొంటారు. సంస్థానానికి ఒక రాష్ట్ర శాసన సభ వుంటుంది. తాలూకాకు ఇద్దరు చొప్పున నేరుగా ప్రజలనుంచి ఎన్నికయ్యే ప్రతినిధులు—తాలూకా పంచా





యితీల అధ్యక్షులూ రాష్ట్ర శాసన సభ్యులుగా ఉంటారు. పన్నులు వసూలు చేసి–వచ్చే ఆదాయంలో సగం గ్రామ పంచాయితీ ఉంచుకొని మిగతా సగాన్ని రాష్ట్రానికి పంపుతుంది. తాలూకా పంచాయితీకి రాష్ట్రమే గ్రాంటు ఇస్తుంది.

1947 లో మనకు స్వతంత్రం వచ్చింది. 1948 లో సంస్థానాలను విలీనం చేసి యూనియన్ ప్రభుత్వంలో కలిపారు. అప్పుడు సంస్థానాధీశుని హృదయం ద్రవించింది. గాంధీజీ కలకన్న దానికి రూపంగా–నమూనాగా ఉన్న ఈ సంస్థానం కూడా చరిత్ర గర్భ లో కలిసి పోవాల్సిందేనా ? అని ఆరాటపడ్డాయన. గాంధీజీకి ఉత్తరం రాసి తన ఆవేదనను ప్రకటించారు. గాంధీజీ కూడా దాన్ని పరిరక్షించలేకపోయారు.

ఈ ఉత్తరం గురించి ప్రస్తావిస్తూ ఒక ప్రార్థనా సమావేశంలో గాంధీజీ అన్న వాక్యాలు పరిశీలించదగినవి.

" ఔంధు సంస్థానాధీశుడు చాలాకాలం క్రితమే తమ ప్రజలకు బాధ్యతాయుత ప్రభుత్వాన్ని సమర్పించారు. ఆయన కుమారుడు అప్పాసాహెబ్ కూడా తన జీవితాన్ని ప్రజా సేవకు అంకితం చేశారు. ఇప్పుడు సంస్థానాలను విలీనం చేస్తున్నారు. 'రాజా' గారు, ఇంకా కొంత మంది ఇతరులు కూడా 'విలీనీకరణ' పథకాన్ని ఒప్పుకోవడానికే నిశ్చయించుకున్నారు. రాజా లందరికీ పింఛను లభిస్తుందని సర్దార్ హామీ ఇస్తున్నారు. పింఛను విషయంలో ప్రజా ధనం మీద భారమై బ్రతకాలని ఔంధురాజా గారికి ఉంటుందని నేను భావించను. ఉన్నదాంతోనే తృప్తి పడి ప్రజా సేవ చేస్తూ కాలం గడపాలను కుంటున్నారాయన. అయితే విలీనీకరణం తర్వాత తమ రాజ్యంలో తాము ప్రారంభించిన పంచాయితీ రాజ్యానికి స్వస్తి చెప్పవలసిందేనా అంటూ రాజా గారు నాకు రాశారు. ఇతర రాజ్యాలన్నింటిలో ఏ విధమైన పరిపాలనా వ్యవస్థ ఉంటే అలాంటి పరిపాలనా వ్యవస్థే ఔంధులోనూ ఉంటుందికాని అందుకు భిన్నమైనది ఉండటానికి వీలుపడదని రాజాగారికి ( యూనియన్ ప్రభుత్వం ) చెప్పారట.

నిజమైన హక్కులు విధి నిర్వహణ వల్ల లభిస్తాయి. అలా లభించిన హక్కులను ఎవరూ కాదనడానికి వీలులేదు. ప్రజా సేవ చేస్తూ అక్కడ పంచాయితీలు ఉన్నాయి. మనం నిర్మాణం చేయదలచుకున్న నవభారత దేశ ప్రజా స్వామ్యంలో గ్రామమే కేంద్ర బిందువు. ఒకొక్క గ్రామం పంచాయితీ రాజ్యాన్ని –దీన్నే ఇంగ్లీషులో రిపబ్లిక్ అంటారు–కోరినట్లయితే అది దాన్ని పొందితీరాలి. దాన్ని ఎవరూ ఆపడానికి వీలు ఉండకూడదు. నిజమైన ప్రజాస్వామ్యం కేంద్రంలో కూచున్న ఏ ఇరవై మంది గుప్పిట్లలోనో ఎదగదు. క్రింది నుంచి ప్రతిగ్రామంలోని ప్రజానీకం చేతుల్లో ఎదగాలి. "

అయితే గాంధీజీ మాటలు, ఆయన కోరికలూ 1948–నాటికే " జీర్ణమంగే సుభాషితం " అయిపోయాయి. ఔంధు సంస్థానమూ–అక్కడ నెలకొన్న గ్రామ రాజ్యవ్యవస్థా నశించి పోయినది.

ఇప్పుడు మళ్ళీ గాంధీజీ ఆశయాల వైపుకు దృష్టిని సారిస్తున్న ఈ తరుణంలో గాంధీజీ కలలు కన్న సంపూర్ణ గ్రామ రాజ్యానికి పునాదులు పడతాయా?–వేచి చూడవలసి ఉంది.

---

ఈ వ్యాసం రాయడానికి ప్యారేలాల్ గారు రచించిన 'దిలాస్ట్ ఫేజ్' గ్రంథమూ, 'ఢిల్లీ డైరీ' ఉపకరించాయి.

---

## జాతిపితకు అక్షర హారతి

భరతమాత ముదు బిడ్డ !
ఓ ప్రియతమ బాపు !
మా అందరి హృదయాలలో
అమరుడిగా నిలిచేవు.

స్వాతంత్ర్యం, సౌభ్రాత్రం
సమానత్వమే నీ ధ్యేయం
సమరసభావం నీకు
దేవుడిచ్చిన దివ్యవరం
పాశ్చాత్య పరిపాలనా
శృంఖలాల విముక్తికై
అహర్నిశలుపాటుపడ్డ మా
ప్రియతమ బాపు !
మా అందరి హృదయాలలో
అమరుడిగా నిలిచేవు.

నీ మాటలే మా బాటలు
నీ చేతలే మా నీతులు
కలకాలం కావాలని
దీవించుము బాపు !

మంచితనం పెంచుటకు
మానవతను నింపుటకు
సమరస భావం మాలో
చిందించుము బాపు !

నీవులేని దేశం
కురుక్షేత్ర రణరంగం
అధికారుల హస్తగతం
అమాయకుల జీవితాలు

నీవులేని దేశం
పెకలించిన భూరుహం
నీవులేని రాజ్యం
వాడిన నందనవనం

ఓ భరత మాత ముద్దు బిడ్డ !
నవసమాజ నిర్మాతా !
స్వాతంత్ర్యం, సౌభ్రాత్రం
సమరాజ్యమే నీలక్ష్యం
వర్గరహిత స్వర్గంగా
వెలుగొందుటే నీ న్యాయం

భరతమాత ముద్దు బిడ్డవు
నీ వొక్కడివేనట !
శోకించెను భరతమాత
నీవులేని లోటు విని

ఇది నిజం ! ఇది నిజం !
నేనన్నది ఇది నిజం !
అందుకే ప్రియతమ బాపు !
అందుకో మా అక్షర హారతి.

—శ్రీ ధూర్జటి వేంకట బాలాజీ







# గాంధీజీ: నిర్మాణ కార్యక్రమం

—శ్రీ గోవిందరాజు రామకృష్ణారావు

గాంధీజీకి అత్యంత ప్రేమాస్పదమైనభావన 'పూర్ణ స్వరాజ్యం' అదే విధంగా అత్యంత ప్రేమాస్పదమైన ఆచరణ 'నిర్మాణ కార్యక్రమం'. ఈ రెండింటికి ఆయన దృష్టిలో అవినాభావ సంబంధం వుంది. ఒకటి ధ్యేయమైతే రెండోది దాని సాధనకు మార్గం. అందుచేతనే గాంధీజీ 'నిర్మాణ కార్యక్రమం' అంటే సత్యంపైన అహింసపైన ఆధారపడినట్టి సాధనాల ద్వారా సంపూర్ణ స్వరాజ్యాన్ని నిర్మించుకోవడం అని స్పష్టంగా నిర్వచించారు. కాబట్టి ఆయన చేపట్టిన 'నిర్మాణ కార్యక్రమ' స్వరూపాన్ని పూర్తిగా అర్థం చేసుకోవాలంటే ఈ 'పూర్ణ స్వరాజ్య' భావన గురించి తెలుసుకోవడం అవసరం. ఆయన మార్గానికి సత్యం, అహింస ప్రాతిపదికలు, హింస ద్వారాను, దానిలో నిహితమై వుండే అసత్యమయ సాధనాల సహాయంతోను స్వరాజ్యం సంపాదించదలచటం ఎంత బాధాకరమో మనకు తెలుసు అని ఆయన అన్నారు.

గాంధీ మహాత్ముడు ఎంతగొప్పతాత్వికుడో అంతగొప్ప కార్యశీలి కూడా. ఆయన ఆచరించిన దానినే ఆదర్శంగా చెప్పారు. ఒక ఆదర్శాన్ని ప్రతిపాదించే ముందు అది ఆచరణయోగ్యమైతేనే యితరులకు వెల్లడించేవారు.

ఆయన కోరింది కేవలం పరపాలన నుంచి విముక్తిమాత్రమే కాదు. స్వరాజ్యమంటే ఆయన దృష్టిలో విదేశీయుల పాలన పూర్తిగా అంతం కావడం, దానితో బాటు పరిపూర్ణమైన ఆర్థిక స్వాతంత్ర్యం ప్రజలకు చేకూరడం. అంటే రాజకీయ స్వాతంత్ర్యం, ఆర్థిక స్వాతంత్ర్యం ఈరెండూ సిద్ధించినప్పుడే బాపూజీ దృష్టిలో స్వరాజ్యం చేకూరినట్లవుతుంది. పూర్ణ స్వరాజ్యానికి ఆయన మరింత ఉత్కృష్టమైన అర్థం కల్పించారు. 1931 లో 'యంగిండియా' పత్రికలో ఒక వ్యాసం వ్రాస్తూ దీనిని గురించి వివరించారు. 'ముందు ప్రజాబాహుళ్యం జాగృతమవుతుంది. తమకు ఏది శ్రేయస్కరమో వారు తెలుసుకొంటారు. దాని సాధనకు ఎన్ని సమస్యలనైనా ఎదుర్కొనే ఆత్మవిశ్వాసం వారిలో ఏర్పడుతుంది,' అని విశదపరచారు. ఆయన దృష్టిలో సంపూర్ణ స్వరాజ్యసాధనకు దైనందినజీవితంతో సంబంధం వుంటుంది. 'మనం దైనందిన జీవితంలో సత్యాహింసలను ఎంతవరకు ఆచరిస్తామో అంతవరకే సంపూర్ణ స్వరాజ్యం సిద్ధిస్తుంది'. అని ఆయన అన్నారు.

మహాత్మాజీ నిర్మాణ కార్యక్రమానికి సమగ్రమైన స్వరూపమిచ్చారు. సేవాగ్రాంలో వుండే సహచరులతో సుదీర్ఘంగా చర్చించి దీనికి రూపకల్పన చేశారు. ఈ కార్యక్రమానికి ఆయన అత్యంత ప్రాముఖ్యత నిచ్చారు. స్వరాజ్య సమరానికి యిది బలం చేకూరుస్తుందని ఆయన శాసనోల్లంఘన సమరంలో నిర్మాణ కార్యక్రమాన్ని చేర్చకపోతే పక్షవాతం వచ్చిన చేతితో బరువు ఎత్తడానికి ప్రయత్నించినట్లుగా వుంటుంది, అని స్పష్టపరిచారు.

నిర్మాణకార్యక్రమంలో గాంధీజీ అనేక అంశాలు చేర్చారు. మత సామరస్యం, అస్పృశ్యతా నిర్మూలన, మద్యనిషేధం, ఖాదీ గ్రామీణపరిశ్రమలు, పారిశుద్ధ్యం, నవీన విద్య, వయోజన విద్య, స్త్రీ జనాభ్యుదయం, ఆరోగ్యసూత్రాలు, దేశభాషల అభివృద్ధి, ఆర్థిక సమానత, రైతు ఉద్యమం, కార్మికసంక్షేమం, ఆదివాసుల శ్రేయస్సు కుష్టు నివారణ, విద్యార్థుల అభ్యున్నతి—వీటన్నింటి గురించి ఆచరణాత్మకమైన కార్యక్రమం రూపొందించారు. దీనిని ప్రకటించిన తరువాత గాంధీజీకి ఒక లేఖ వ్రాస్తూ జీవన్ దేశాయి గో సేవకు కూడా దీనిలో స్థానం కల్పించడం మంచిదని సూచించారు. ఈ సూచనను అంగీకరించి 'పశుగణాభివృద్ధి' అనే పేరుతో దీనిని నిర్మాణ కార్యక్రమంలో ఒక భాగం చేశారు.

1929లో 'యంగిండియా' పత్రికలో 'గాంధీజీ భారత దేశం కర్మభూమి అంతేగాని అది భోగభూమికాదు' అని వ్రాశారు. అందుకే ఆయన కార్యవాదిగా స్వతహా నిర్మాణ కార్యక్రమం అమలు పరచి ఆదర్శపురుషుడయ్యారు.

ముఖ్యంగా దేశపరిస్థితులకు అనుగుణమైన అంశాలను స్వీకరించి పేదల కడగండ్లు తీర్చేందుకు సేవా రంగంలో ప్రవేశించారు. లక్షలాది కార్యకర్తలకు స్ఫూర్తినిచ్చారు. ఆయనసారధ్యంలో నిర్మాణ కార్యక్రమం తపోదీక్షతో జరిగింది. సేవాతత్పరత, దేశభక్తి, త్యాగనిరతి ప్రతి భారతీయుని హృదయంలో పొంగులు వారాయి. నిర్మాణ కార్యక్రమంలోని ప్రతి అంశం జాతీయ చైతన్యం సమకూర్చుకుంది. వీటిని స్థూలంగా పరిశీలిద్దాం.

వివిధ మతాలకు ఆటపట్టుగా వున్న భారతదేశంలో అన్ని మతాల వారు కలిసి మెలిసి వుండడం చాలా ప్రధానమని గాంధీజీ గట్టికోరిక. అందువల్లనే నిర్మాణ కార్యక్రమంలో మత సామరస్యానికి అగ్రతాంబూల మిచ్చారాయన. తన మతం అంటే ఎటువంటి ప్రేమ వుంటుందో అదే విధమైన ప్రేమను యితర మతాల పట్ల కూడా చూపాలని, ఆచరించి చూపారు. మత ప్రాతిపదికపై ఓటర్లను వేర్వేరుగా చూపే పద్ధతిని ఆయన అంగీకరించలేదు. ఖిలాఫత్ వుద్యమానికి ఆయన ఎంతో దోహదం చేశారు. హిందూ, ముస్లిం మత సమైక్యత కోసం కడకు ప్రాణాలు కూడా ఒడ్డి మహాత్ముడు పని చేసిన సంగతి లోకవిదితమే. హిందూ, ముస్లిములు ఏకం కానంతవరకు స్వరాజ్యం అర్థరహితమైనదని కచ్చితంగా చెప్పారు. కోట్లాది భారతీయులలో ప్రతి ఒక్కరిలోనూ ఆత్మీయతను పెంపొందించు కోవాలని ఆయన పదే పదే అనే వారు.

సమాజంలో బాగా పాతుకు పోయిన అంటరాని తనం పట్ల గాంధీజీ తన వేదనను అనేక సార్లు వ్యక్తపరిచారు. అది హిందూ





మతానికి మాయని మచ్చగా వర్ణించారు. అంతేకాదు: దయ్యాల్ పాలన సైతాను కృత్యమైనట్లే అస్పృశ్యత కూడా సైతాను దృక్పథమే అని తన భావను ప్రకటించారు. హరిజనోద్ధరణకు బాపూజీ ప్రత్యేక స్థానమిచ్చారు, అంటరాని వారికి హరిజనులని నామకరణం చేశారు. స్వరాజ్య సౌధాన్ని నిర్మించే ఏ కార్యభారాన్నయితే మనం భుజస్కంధాలపై తీసుకున్నామో అందులో అస్పృశ్యత నివారణ ఒక భాగం అని నిర్ద్వంద్వంగా చెప్పారాయన.

త్రాగుడు దురభ్యాసం మనిషిని ఎలా పతనం చేస్తుందో చెబుతూ గాంధీజీ మలేరియా వంటి జబ్బులు కేవలం శరీరానికి మాత్రమే హాని కలిగిస్తాయి. కాని మద్యపానం శరీరాన్ని, ఆత్మను నాశనంచేస్తుంది. అంటారు. ఈ సంస్కరణోద్యమంలో ముఖ్యంగా స్త్రీలు, విద్యార్థులు ఎక్కువగా పాల్గొనాలని ఆయన ఉద్బోధించారు. 'ఈ విధమైన పనులన్నీ స్వరాజ్యం వచ్చిన తరువాత చేయవలసినవని భావించి అంతవరకు వాటిని వాయిదా వేయాలి అనేవారు-ఒక విషయం విస్మరిస్తున్నారు. అదేమంటే స్థిరమైన, నిజమైన, దోషరహితమైన విముక్తి హృదయాంతరాళంనుండే ప్రారంభమవుతుంది. అంటే ఆత్మశుద్ధి వల్లనే విముక్తి లభిస్తుంది' అని ఆయన సిద్ధాంతం.

ఖాదీ ఉద్యమాన్ని గాంధీజీ విరాట్ స్వరూపంగా భావించారు. దాని వల్ల లక్షలాది ప్రజలకు ఉపాధి లభించడమే గాక విదేశీ వస్త్రబహిష్కారానికి యిది అవసరం. 'ఖాదీ' జాతీయోద్యమంలో ప్రధాన భూమిక వహించింది. భారత దేశంలోని మొత్తం ప్రజల ఐక్యతకు ఆర్థిక స్వాతంత్ర్యానికి, సమానత్వానికి ఖాదీ చిహ్నమని నా అభిప్రాయం అంటారు గాంధీజీ.

గ్రామీణ ఆర్థిక వ్యవస్థకు గ్రామ పరిశ్రమలు ముఖ్యమని బాపూజీ విశ్వాసం. 'గ్రామాల వైపు దృష్టి మళ్ళిస్తే విదేశీ అనుకరణ ఉండదు. దారిద్ర్యం ఆకలి, సోమరితనంలేనటువంటి భారతావని ఆవిర్భవిస్తుంది' అని ఆయన ఉద్ఘాటించారు. మనకవసరమయ్యే వస్తువులన్నింటిని గ్రామాలు ఉత్పత్తి చేయగలవంటారాయన. గ్రామ పరిశ్రమలలో తయారయ్యే వస్తువులను వాడటం ప్రతివారు మర్యాద లక్షణంగా భావించాలి అనేవారు. మనకవసరమైన వస్తువులన్నింటినీ గ్రామాలే తయారు చేయగలవు అని ఆయన అన్నారు. గ్రామ పారిశుధ్యం గురించి చెబుతూ ఆయన దేశంలోని బాధిత ప్రజానీకానికి అపారమైన లాభం చేకూర్చే అద్భుత సేవా కార్యక్రమంగా అభివర్ణించారు.

'నయీతాలీం' అనే పేరుతో గాంధీజీ ప్రతిపాదించిన నవీన విద్య విద్యార్థిలో శారీరక, మానసిక వికాసం కలిగిస్తుంది. పిల్లలకు ఏదో ఒక చేతి పనిలో ప్రవేశం ఉంటుంది.

వయోజన విద్య ఎంత శక్తివంతమైనదో చెపుతూ బాపూజీ ఈ విదేశ పాలన అనే రాక్షసిని పెకలగొట్టే శక్తి తమలో ఉందని నిరక్షరాస్యులకు తెలియదు. వయోజనులకు చదువు చెప్పడం అంటే వారికి సరైన రాజకీయ స్థితి తెలియపరచడం అన్నమాట అని అంటారు.

జీవిత విధానంలో పురుషునికి తన భవిష్యత్తును నిర్ణయించుకునే అధికారం స్వాతంత్ర్యం వున్నటువంటి స్త్రీకి కూడా తన భవిష్యత్తును నిర్ణయించుకునే అధికారం, స్వాతంత్ర్యం వుండాలన్నది స్త్రీ జనోద్ధరణ కార్యక్రమం లక్ష్యం. 'పురుషుల విషయంలో వర్తించని న్యాయశాస్త్రం, వివక్షణ ఏ విధానాని స్త్రీలకు వర్తించదని' గాంధీజీ నొక్కిచెప్పారు.

ఆరోగ్య నియమాల పట్ల గాంధీజీకి శ్రద్ధాసక్తులు మెండు. 'మానవ జాతిని పీడించే రోగాలలో ఎక్కువ భాగం ఆరోగ్య నియమాలు సరిగా తెలియకపోవడంచేతను, వాటిని సరిగా పాటించక పోవడం చేతను వస్తున్నాయనే సంగతి యిప్పుడు స్పష్టమయింది' అని ఆయన అన్నారు.

హిందీని రాష్ట్రభాషగా స్వీకరించాలని, ప్రాంతీయ భాషలను బాగా అభివృద్ధి పరచాలని గాంధీజీ అభిప్రాయం. 'భారతీయ భాషలు దుర్బలమైపోయాయి. అందువల్లనే క్లిష్టమైన భావాలను మాతృభాషలో వ్యక్తం చేయడానికి ప్రయత్నించి నప్పుడు మనం ఉక్కిరిబిక్కిరై పోతున్నాం. ప్రజాసామాన్యం ఆధునిక భావ ప్రపంచానికి దూరమైపోయారు. ఉత్కృష్టమైన భారతీయ భాషల పట్ల చూపిన ఈ అశ్రద్ధ వలన దేశానికి కలిగే నష్టం మన సమకాలిక దృష్టికి యింకా స్పష్టంగా గోచరం కావడం లేదు' అని హెచ్చరించారు.

గాంధీజీ ధర్మకర్తృత్వ విధానాన్ని బలపరుస్తూ ఆర్థిక సమానత్వం నెలకొల్పాలని చెబుతూ ఎప్పటికైనా మనం సమానత్వం సాధించాలనుకుంటే అందుకు పునాదులు యిప్పటి నుంచే వేయాలని, ఆయన ఆనాడే ప్రజలను కార్యోన్ముఖులను చేశారు.

రైతాంగం పట్ల గాంధీజీకి ఆదరణ ఎక్కువ. రైతుల శ్రేయోరక్షణకై తోడ్పడాలని ఉద్బోధించారు. కార్మిక శ్రేయస్సుకు సంబంధించిన కార్యక్రమంలో గాంధీజీ పెక్కు సూచనలు చేశారు. ఆదిమవాసుల గురించి, వారి అవసరాలను గురించి బాగా తెలుసుకొని, వారి సంక్షేమం కోసం కృషి చేయాలని గాంధీజీ ప్రత్యేకంగా తెలియపరచారు.

కుష్ఠరోగుల సేవ ఎంత ముఖ్యమో ఆయన వారికి స్వయంగా సేవచేసి చూపారు. 'భారతదేశంలో మనం వెళ్ళి క్షేమసమాచారాలు విచారించకుండా వదలి పెట్టిన కుష్ఠురోగిగాని, బిచ్చగాడుగాని ఒక్కరైనా వుండరాదు' అని ఆయన ఆకాంక్ష. విద్యార్థుల శ్రేయోభివృద్ధుల కోసం గాంధీజీ 11 అంశాలుగల కార్యక్రమం రూపొందించారు.

ఈ నిర్మాణ కార్యక్రమం గాంధీజీ దృష్టిలో పూర్ణ స్వరాజ్యస్థాపనకు ఒక చక్కటి సాధన. భారతదేశ పరిస్థితులను గాంధీజీ ఎంత కూలంకషంగా అవగాహన చేసుకున్నారో, భారత ప్రజల సముద్ధరణను ఆయన ఎంత గాఢంగా వాంఛించారో ఈ నిర్మాణ కార్యక్రమం నిరూపిస్తుంది. అందుకే ఆయన జాతిపితగా సార్థక జన్ములయ్యారు.







# మహాత్ముని బోధనలు మహిళలపాలిటి మణిదీపాలు

—శ్రీమతి కె. సీత

గాంధీ మహాత్ముడు కేవలం భారతదేశ స్వాతంత్ర్యోద్యమ రథసారథి మాత్రమే కాదు. అతనో చైతన్యమూర్తి. అతని బోధనలు జాతిని జాగృతం చేశాయి. అన్నియుగాలకు, తరాలకు మార్గదర్శకమైన సూత్రాలను ప్రవచించిన యుగప్రవక్త. సంకుచితాచారాల, సంప్రదాయాల యినుప సంకెళ్ళలో జీవితాన్ని కొనసాగించే స్త్రీలపట్ల మహాత్ముని బోధనలు మణిదీపాల వంటివి.

స్త్రీకి స్వాతంత్ర్యం ఎంతో ముఖ్యమని గాంధీజీ అనేకసార్లు చెప్పారు. స్త్రీని కేవలం విలాస వస్తువుగా పరిగణించక, మాతృశ్రీగా నిర్మాణవేత్తగా అహింసకు అపరావతారంగా ప్రేమమూర్తిగా భావించి గౌరవించమనేవారు. త్యాగం చెయ్యటంలోనూ, బాధలను మౌనంగా భరించడంలోనూ, వినయ వివేకాలలోనూ పురుషులకన్నా స్త్రీలదే పై చెయ్యి అని గాంధీజీగారు అభిప్రాయపడ్డారు.

మహిళల సంక్షేమానికి గాను మహాత్ముడు పెక్కు సూచనలు గావించారు. స్త్రీ జనోద్ధరణకుగాను కృషి చేసిన ఆధునికులలో మహాత్మగాంధీ ప్రథమశ్రేణికి చెందిన వారు.

వివాహం గురించి గాంధీగారు వెలుబుచ్చిన అభిప్రాయం చాలా గొప్పది.

'ఆధ్యాత్మిక సంయోగమే వివాహము. అదే వివాహము యొక్క పరమాదర్శము. దానివలన పుద్భవించే ప్రేమ దైవికమూ, విశ్వవ్యాప్తమూగల ప్రేమకు మూలాధారముగా వుండాలి. అహంకారరహితమైన పవిత్ర సేవా ధర్మమును నెలకొల్పటానికి వివాహం వొక సాధనం. భర్త మృతి చెందిన పక్షంలో అతడి మీద ప్రేమను, సేవా భావమును సంఘం పట్ల చూపగల స్త్రీ ధన్యురాలు.'

అయితే, వైధవ్యమును స్త్రీ పాటించాలని మహాత్ముడు అనలేదు. వైధవ్యమును శాపము వంటిదని, విధవా వివాహమును సమర్థించారు.

కొన్ని జాతులలో ఘోషా పద్ధతి వుంది. ఈ ఘోషాపద్ధతిని నిశితంగా ఖండించారు గాంధీగారు. స్త్రీలను గృహాలలో బంధించడ





తప్పుగా భావించారు. మహాత్ముని అభ్యుదయ ధోరణికి ఈ క్రింది వాక్యాలు ప్రతిరూపాలు.

"పురుషులు అనుభవించు స్వాతంత్ర్యమును
స్త్రీలు ఎందుకు అనుభవించ కూడదు ? స్త్రీలు
బహిరంగంగా పోయి స్వేచ్ఛా వాయువుల్ని
పీల్చతగరా ? పురుషుల కనుచూపుకే
కల్మషమయ్యే స్త్రీల పాతి వ్రత్యం ఎంతటిది ?
తనకు నమ్మకంలేని స్త్రీని తన సంతానానికి
మాతగా స్వీకరించడం పురుషునికి అవమానం"

వరకట్నం గురించి మహాత్ముడు యిచ్చిన సూచనలు స్త్రీలు ప్రత్యేకంగా గుర్తించ తగ్గవి. ఈ వరకట్నపిశాచిని తరిమి కొట్టడానికి వనితలే సమర్థులు అని అంటారు గాంధీజీ. వరకట్నాన్ని సాంఘిక దురాచారంగా పేర్కొంటూ, దానిని తొలగించటానికి పెక్కు సూచనలు గావించారు.

"....... అన్యాయపు సిరితో తులతూగే
యువకులను సమాజంనుండి బహిష్కరించాలి.
ఆడపిల్లల తల్లిదండ్రులు పున్నత విద్యాభాసం
గల వారంటే వ్యామోహం వదులు కోవాలి.
తమ కులం తమ రాష్ట్రం అనే భావాలను
విస్మరించి బుద్ధిమంతులైన యువకులకు
తమ కుమార్తెలనిచ్చి పెళ్ళిచెయ్యాలి".

మానవతాదృక్పథంతో సమస్యలను పరిష్కరించగల మహా మేధావి గాంధీజీ. అందుకే నిఖిల జగతి అతనికి నివాళుల నర్పించింది.

మహాత్ముని మానవతా దృక్పథానికి హరిజనోద్ధరణ ఉద్యమము వొక మచ్చు తునక. హరిజనులకు గాంధీజీ స్వయంగా సేవ చేశారు. వారి పున్నతి కోసం, సమసమాజ స్థాపన కోసం శక్తి వంచన లేకుండా జీవితపర్యంతమూ కృషి సల్పారు. తరతరాల జాత్యహంకారానికి గురైన హరిజనుల పుద్ధరణకుగాను స్త్రీలు ముందుకు రావాలని అంటారు గాంధీజీ. స్త్రీలది సహజంగా దాక్షిణ్య పూరితమైన హృదయం. ఎదుటివారి కష్టాలకు వారి హృదయం వెన్నలా కరిగి పోతుంది. అందుకనే, బాధా సర్పదష్టులైన హరిజనుల శ్రేయస్సు కోసం, అస్పృశ్యతా నివారణ కోసం మహిళలను పిలిచారు. సమ సమాజ స్థాపనకు మహిళలను ఆహ్వానించడంలో గాంధీజీ వితరణ, ఔన్నత్యం సువ్యక్తమవుతుంది.

"సోదరీ మణులారా ! అస్పృశ్యత అనే భావం మీ హృదయాలనుండి తొలగి పోవాలి. హరిజన బాల బాలికలను మీ పిల్లల వలె చూసుకోవాలి. వారిని మీ బంధువులవలె ప్రేమించాలి.

సేవా భావానికి, త్యాగానికి, స్త్రీ అపరావతారంగా నేను భావిస్తున్నాను. స్వార్థ రహితమైన త్యాగం చేయడంలో పురుషుడెన్నడూ మిమ్మలను వదల జాలడు. అవి మీకు ప్రకృతి యిచ్చిన అఖండ వరాలు."

స్త్రీని అబలగా యెంచి మహాత్ముడెన్నడూ చులకనగా చూడలేదు. దేశ స్వాతంత్ర్య పుద్యమ సందర్భంగా మహిళలు నిర్వహించిన అపూర్వ పాత్రకు మహాత్ముడు ఎంతగానో సంబర పడి "స్త్రీ అబల అను భావం నా మటుకు నాకు లేదు" అని చెప్పారు.

నీతులను చెప్పడం సులభం. ఆచరణ కష్టం. అయితే, కష్ట సాధ్యమైన నీతులను మొదట మహాత్ముడు ఆచరించి, అటు తర్వాతనే వాటిని యితరులకు చెప్పేవారు. అదే వారి ప్రత్యేకత. స్త్రీల స్వాతంత్ర్యం గురించి పుపన్యాసాలిచ్చి, సభలలో ప్రశంసల నందుకోవడమే కాదు, తన సహధర్మచారిణి శ్రీమతి కస్తూరిబా గాంధీకి సంపూర్ణ స్వేచ్ఛ నిచ్చి సహధర్మచారిణిగా గౌరవించారు. గాంధీజీ తన సహధర్మచారిణి పట్ల ప్రదర్శించిన ఈ సమదృష్టివలనే వారు ప్రపంచానికే అమూల్య సందేశాన్ని యివ్వగలిగారు.

'భర్తృత్వాధికారాలనే నెపంతో ఆమెకు చెందిన హక్కులను నేను నిర్వహించడం మానివేసిన తరువాతనే నేను ఆమె హృదయాన్ని ఎక్కువగా చూరగొనగలిగాను.

సమ దృష్టిని స్త్రీల యెడల పురుషులు ప్రవర్తించిన నాడే స్త్రీ స్వాతంత్ర్య సంభవం.'

రచనలలోనూ, పుపన్యాసాలలోనూ మహాత్ముడు ప్రదర్శించిన ఔన్నత్యం, సమతా భావం తన నిజ జీవితంలో కూడా ప్రదర్శించిన గాంధీజీ నేటి నవ తరానికి మార్గ దర్శకులు. వారు మహిళలకు యిచ్చిన సందేశాలు స్త్రీ స్వాతంత్ర్యానికి పునాదిరాళ్లు.

## సమానత్వం

ఇతరులు కొందరు మనకంటే తక్కువవారు అనుకోవడం తప్పు; పాపహేతువు.

వర్గరహిత సమాజం మనం కేవలం లక్షించవలసిన ఆదర్శమే కాదు; సాధించి తీర వలసిన సత్యం.

మానవులకు సంబంధించిన అసమానతలలో నాకు విశ్వాసం లేదు. మనమందరం సమానులం, ఇది ఆత్మ సంబంధమైన సమానత్వం—శారీరకం కాదు. అంటే యిది ఒక మానసిక స్థితి.

—గాంధీజీ







# జాతిపిత గాంధీమహాత్ముడు

—శ్రీ రెండుచింతల లక్ష్మీనరసింహ శాస్త్రి



అవి నా చిన్నతనపు రోజులు. కేవలం [illegible] ప్రాయములు. మా నాయనగారు సర్కారు ఉద్యోగము చేయుచున్నను వారిలో జాతీయ భావము ముమ్మరముగా నుండెడిది. జాతీయోద్యమ శంఖారావము విని ఒడలు గగుర్పొడిచిన వారిలో ఆయనయు నొకరు. 1923 సం॥న కాకినాడలో భారత జాతీయ కాంగ్రెసు మహాసభలు జరుగనున్నవని తెలిసి దానికి వెళ్లుటకు వారు సముత్సాహులైరి. అప్పటికి నేను ఏలూరున గాంధీ విద్యాలయమున చేరి చదువుచుంటిని. నాయందలి ప్రేమయే వారిని ప్రేరేపించెనో లేక వేరే కారణము కలవో గాని నేనడిగినదే తడవున నన్నుగూడ తమతో దీసికొని పోయిరి.

అప్పుడు మహాత్ముడు ఎరవాడ జైలులో నిర్బంధమున నుండెను. ఇంకను మరికొందరు నాయకులుగూడ నిర్బంధింపబడిరి. అయినను అప్పుడు జరిగిన కాంగ్రెసు సమావేశమునకు ఇసుక వేసిన రాలనంత జనము వచ్చిరి. అక్కడ ఆగంతకులకు చేసిన ఏర్పాట్లు సైతము జాతీయ భావమును పుణికి పుచ్చుకొన్నవి. విశాలమైన తాటాకు పందిరిక్రింద వేదిక యేర్పాటు చేసిరి. అలంకరణమంతయు ఖాదీ వస్త్రములతోనే విదేశీ వస్తువులను దరికి రానీయనంత జాతీయ భావము వెల్లివిరిసినది.

ఇక సభకు వచ్చిన అశేష జనావళిలో జాతి, మత, వర్ణ వైషమ్యము అనునదే కానరాలేదు. సిక్కులు, ముస్లిములు, హిందువులు, క్రైస్తవులు అందరు నొక్క చదరుమీద భుజింతురా యనునంత ఏకీభావము వెల్లివిరిసినది. మహాసభ వేదిక మీదికి దేశనాయకులొక్కొక్కరే రాసాగిరి. అలీ సోదరుల రాకకై సభాసదుల తలెత్తి చూచిరి. అధ్యక్షుడు మహమ్మదాలీ ప్రళయ పర్జన్య ఘోషనుబోలు మహోపన్యాసము వినవలెనని యెల్లరు ఉత్కంఠతో నుండిరి. ఆ సమయమున మంగళ తూర్యరావంతో పుష్పమాలాలంకృతుడైన మహమ్మదాలీ అన్నయగు షౌకతాలీతో గలసి సభాంగణములోనికి వచ్చెను. ప్రేక్షకుల కరతాళ ధ్వనులు మిన్నుముట్టినవి.

అనంతరము సభా కార్యక్రమముల గొంతవరకు పరికించితిని గాని యవి నా స్మృతిపథమున లేవు. వాలంటీర్లుగా సిక్కు సోదరులు చేసిన సేవ అత్యద్భుతము. ఎక్కడ ఏ పసిగుడ్డు తప్పిపోయినను, ఎవ్వరే వస్తువును పోగొట్టుకొనినను వారి అధీనములోకి రావలసినదే. ఆగంతకుల పాదరక్షలను సైతము వారు భద్రపరచి యుంచెడువారన్న వారి సేవానిరతికి వేరే తార్కాణము కావలెనా?

ఆ సభకు గాంధీమహాత్ముడు రాలేదన్న యొక్క వెలితి తక్క వేరొకందులేదు. ఆ సభా కార్యక్రమములు తిలకించుటకు వేలాదిగా జనులు వచ్చిరి. రైళ్లు క్రిక్కిరిసిపోయెను. రైల్వే శాఖవారు ఒక స్టేషను ప్రత్యేకముగా నిర్మించిరి. జనులు తండోప తండముగా వచ్చుటచే వారిని తనిఖీ చేయుట అసంభవమని వారికి తోచెను. వచ్చిన డబ్బుచే చాలు నన్నట్లుగా రైల్వేవారు కొనని వారి నెమియు బాధింపరైరి. అదియుగాక వారిలో మాత్రము జాతీయ భావము లేదా? టిక్కెట్టు లేనివారిని యాతన పెట్టుటకు వారికి మాత్రము మనసెట్లు ఒప్పును?

ఇక భోజనముల విషయము వచ్చిన వారిలో జాతీయ భావమెంత యున్నతముగా నున్నను భోజనముల విషయములో కొందరికి పట్టింపు తెక్కలేదు. వర్ణాంతరులతో సహపంక్తి భోజనము కిచ్చగింపక పెక్కురు బంధుగుల యిండ్ల చేరిరి. బంధుగులు లేనివారికి నిరతాన్న దాత్రి యగు పూటకూళ్ళమ్మయే యుండెనుగదా.

మొత్తముమీద సభ ముగిసినది. ఆ మహాజన సందోహమును జూచినవారికి భారతదేశపు విశ్వరూపము కనులకు గోచరమయ్యెను. ఆ జాతీయ భావమునకు విదేశీయులు గూడ ముగ్ధులైరన్న నందతిశయోక్తి లేదు. సభలో చిన్నలు, పెద్దలు ఎందరో యుండిరి. గాంధీ టోపీ ధరింపని వారలు, గాంధీని స్మరింపని వారును అచ్చట





నెవ్వరును లేరు. అట్టి మన జాతిపిత గాంధీజీ యొక్క 109వ జన్మదిన సందర్భమున వారిని స్మరించుట మన విధ్యుక్త ధర్మము.

దక్షిణాఫ్రికయందు ధైర్య సంపద మీర
సత్యాగ్రహము దీక్ష జరిపి : యచట
కాంగ్రెసు సంస్థకై కలయంతయును ధార
పోసి పేదల యార్తి పోశమించి
నిన్ను నమ్మినట్టి యెవ్వనికేని కీడు రా
కుండ సమత వెల్గ గోరి మరియు
హరిజ నాభ్యున్నతికై దేశ మెల్లెడ
సంచరించి వివాద సమయజేసి
ఖండ ఖండాంతర ఖ్యాతిగాంచి తుదకు
మత దురభిమాన పూరిత మత్తతకును

నీ దునసుపుల గోల్పోతివి నిక్కమరయ
నీకు నీ జోదుసాటి పునీత చరిత.

గాంధీగారే ఇప్పుడున్న యెడల దేశమిట్లుండెడిదా యని యిటీవల నొకరు ప్రశ్నించిరి. ఏమో ఎవరు చెప్పగలరు ? కాని యొక్క మాట మాత్రము నిజము. వారి యడుగు జాడలలో నడచెడు మహనీయు లిప్పటికిని ఎందరో కలరు.

ఆహార విషయములలోనేమి, నిత్యకృత్యములలో నేమి, రాజకీయ ఆశయములలోనేమి గాంధీజీని వరవడిగా పెట్టుకొని జీవితము చక్కదిద్దుకొను మహాపురుషులలో మేటి మన ప్రధాని మొరార్జీదేశాయియే కనబడుచున్నారుగదా. నిరాడంబరతకు, నిష్కల్మష జీవనమునకు మొరార్జీ పెట్టినది పేరు. జాతి మనుగడకే వారి సారథ్యమవసరమని యిటీవలి చరిత్ర రుజువొనర్చినది.

---

# అంటరాని పాట

—డా. తంగిరాల

అన్ని ఖండాల్లోనూ తెలుపు
లేదా ఎరుపు, పసుపు
ఆఫ్రికాలో మాత్రం కారునలుపు
నా దేశంలో ప్రతిగ్రామం
వెలుగు వెల్లువతో నిండి పొర్లి పోతోంది
ఊరి బయట మాత్రం చిమ్మ చీకటి
ఎలుగు బంటిలా కూర్చుని
ఎన్నేళ్ళగానో మూలుగుతోంది

ఆకలి అజ్ఞానం నీ ఆకారం
అంతులేని పేదరికం నీపూరి గుడిసెకు ప్రాకారం

అన్నా

నీ ఘర్మ జలామృతం త్రాగి మేం నిగనిగ లాడుతున్నాం
మా పొలాల్లో నీ రక్తం పారించి పంటలు పిండుతున్నాం
నీ కన్నారి పాపలు
పసిపూపలు
నిరంతరం మా పశువులు మేపాలి.......
ఎండుటాకుల ప్రోవు
ఎముకల గూడు
ప్రాణమున్న అస్థిపంజరం

నీతల్లి
మూడు కాళ్ళముసలి
తన గాజు కళ్ళు పొడు చుకుంటూ
మా చేలో కలుపు తియాలి.......
అడవి మల్లెల ఘుమ ఘుమలు
అల్ల నేరేళ్ళ నిగ నిగలు
నంది వర్ధనాల చిరునవ్వులు
నీ అర్ధాంగి రూపయౌవ్వనాలు
మా నాడాల బూట్ల క్రింద పడి నలిగి పోవాలి........

నాతాత నుంచి నా మనవడి వరకూ కాస్తున్న
పట్ట పగ్గాల్లేని దురహంకారపు దోపిడి యెండ
నీ ముత్తాత నుంచి నీ మునిమనవడి వరకూ మాడ్చి
మీ బ్రతుకుల సెలయేళ్ళలోని స్వచ్ఛమైన నీళ్ళు పీల్చి
యిసుక మేటలు వేయించి బీటలు తీయిస్తుంది....
పురాణాల్లో విన్న రౌరవాది నరకాల యమయాతనలు
నీ మీద ప్రయోగాలుచేసి ప్రత్యక్షంగా తెలుసుకుంటున్నాం...

నువ్వెంత గింజుకున్నా
మా బారినుంచి తప్పించు కోవడం నీతరంకాదు
నీకు అభయ మివ్వలేరు బుద్ధుడూ క్రీస్తు యిద్దరూ కలసినా
తారస్థాయిలో సాగుతున్న మా
అంట రాని పాటను ఆపలేరు
కోటి మంది మహాత్ములు పుట్టినా
నీ గోడు ఎవడూ పట్టించు కోడు.......

అన్నా ?
ఎందు కింకా ఆలస్యం ?





# గ్రామోద్ధరణ

# గాంధేయ మార్గం

—డాక్టర్ ఆర్. వి. రావు



భారత ప్రధాని శ్రీ మొరార్జీ దేశాయి, భారత ప్రణాళికల గురించి జరిగిన సదస్సులో మాట్లాడుచు, ప్రణాళికల దృష్టిలో చాలా మార్పులు అవసరమని, ఉత్పత్తి పెంచేవి, ఉపాధి సౌకర్యాలు యిచ్చే, గ్రామీణాభివృద్ధి పథకాలకు ఎక్కువ విలువ యివ్వమని, ఆదేశించారు. ఒక ఉదహరణ యిస్తూ పెద్ద వైశాల్యంగల వ్యవసాయ క్షేత్రాలకు, భారీ పరిశ్రమలకు గత 30 సంవత్సరాలలో చాల ప్రాధాన్యత యివ్వబడెనని, ప్రణాళికలు అమలులో ఉన్న, యీ 30 సంవత్సరాలలో అనుకున్న ఫలితాలు రాకుండుట చాల శోచనీయమన్నారు. లోటువారీ ఆర్థిక విధానం(Deficit financing) తో, ఉత్పత్తి పెరగలేదని, దానితో ద్రవ్యోల్బణం (inflation) వచ్చిందని, దానితో డబ్బు విలువ పడిపోవటమేకాక, సామాన్య ప్రజలకు చాలా నష్టం కలిగిందన్నారు.

## కొంత ప్రగతి సాధించాం

ఒక్కమాట మాత్రం మొరార్జీదేశాయి చెప్పారు. గత 30 సంవత్సరాలలో, దేశం ఏ ప్రగతీ సాధించలేదని ఆయన అనటం లేదని పారిశ్రామిక రంగంలో దేశం మంచి ప్రగతి సాధించిన మాట నిజమే అన్నారు. కాని పారిశ్రామికాభివృద్ధి కొంత మందికి మాత్రమే యిచ్చిందని, జనబాహుళ్యానికి లాభాలు తేలేక పోయిందని, దానితో ప్రజలలో అసంతృప్తి వచ్చిందన్నారు. నిజంగా చూస్తే 11-12-1963 లో జవహర్లాల్ నెహ్రూ లోకసభలో మాట్లాడుతూ, ప్రణాళికల వలన కొంత మందికి లాభం కలిగినా, చాలమంది పేదరిక బాధలో ఉండటం ఆయనకు ఎంతో బాధాకరంగా ఉందని, యీ పరిస్థితిలో చాల మార్పు రావాలని, చెపూ, ఆయన గాంధేయ మార్గం గురించి ఆలోచిస్తున్నానన్నాడు. జవహర్లాల్ నెహ్రూ, ప్రణాళిక సిద్ధాంతాలను, భారతదేశంలో ప్రవేశపెట్టిన యుగపురుషుడని ఆయన కొంత కాలం బ్రతికి ఉంటే, ప్రణాళికలలో వచ్చిన అనర్థకాలను సరిదిద్దేవాడని చెప్పారు, మొరార్జీదేశాయి.

ఏది ఎట్లున్నా 4 ప్రణాళికలు పూర్తి అయినా, భారతదేశంలో సరాసరి సాలీనా వచ్చే ఆదాయం 1 రూపాయకు మించటం లేదని ప్రభుత్వ రిపోర్టులే చెప్పాయి. ఈ ఒక్కరూపాయి ఆదాయం కూడ అందరికి రావటం లేదు. దానితో గ్రామాలలోని ప్రజల ఆర్థిక స్థితి, ఎంత క్లిష్ట పరిస్థితులలో ఉందో మనం తెలిసికోవచ్చు. గ్రామాలు అభివృద్ధి కావాలంటే, సమగ్ర గ్రామసేవ రావాలి. గ్రామాలలో గృహసౌకర్యాలు లేవు. ఆరోగ్య పరిస్థితులు ఏమీ బాగాలేవు. ఆహారం ఆరోగ్యకరమైనదిగా లేదు. గ్రామీణ వనరులు వారు ఉపయోగించ లేక పోతున్నారు. మన ప్రణాళికలతో, గ్రామాలలో ఉత్పత్తి అయే పాలు, చేపలు, కూరలు పండ్లు అన్నీ పట్టణాలకు వస్తూన్నాయి. దానితో గ్రామసీమలు వాస యోగ్యంగా లేవు. గ్రామీణ ప్రజలు పొట్టపట్టుకొని పట్టణాలకు వస్తున్నారు. దానితో పట్టణాలలో ఎన్నో కొత్త ఆర్థిక సాంఘిక పరిస్థితులు (విపత్తులు) ఏర్పడ్డాయి. మురికివాడలు, యివన్నీ ఎక్కువయాయి. ప్రభుత్వం పట్టణాలలో, గ్రామాల నుండి తరలి వచ్చిన వారికి, ఉపాధి సౌకర్యాలు కలుగ చేయటానికి, లక్షలాది రూపాయలు ఖర్చు పెట్టుచున్నారు. ఈ డబ్బు గ్రామసీమల అభివృద్ధికి ఖర్చు పెట్టిన ఎంతో బాగుంటుంది. భారత ప్రధాని యిక నుండి, పట్టణాల నుండి, ప్రజలు గ్రామసీమలకు తరిలేటట్లు చేయాలని చెప్పారు. ఇది జరగాలంటే, గ్రామ సీమలు వాసయోగ్యం కావాలి.

## గ్రామాలు వాస యోగ్యం కావాలంటే ?

అనగా గ్రామీణ వనరులు వికేంద్రీకరణ పద్ధతులలో వినియోగించాలి. కుటీర పరిశ్రమలు అభివృద్ధి చేయాలి. ఇవి ప్రజలకు అనేక ఉపాధి సౌకర్యాలు కలుగచేస్తాయి. నీటి పారుదల సౌకర్యాలు కూడ కలుగచేయాలి. పట్టణాలు, గ్రామాల పై పడి దోచుకో కూడదని, గ్రామాలలో తయారయిన సరకులు అక్కడ వాడుకొని, మిగిలినవి పట్టణాలకు సరఫరా అవాలన్నారు. పట్టణాల సరకుల మీద మోజు, గ్రామ సీమలలో ప్రవేశ పెట్టకూడదన్నారు గాంధీ. గ్రామీణ కర్షకులలో ఎంతో విజ్ఞానం, తెలివి ఉందని, పాశ్చాత్య దేశాలలో యిది లేదని, యీ విజ్ఞానం భారత గ్రామ సీమలలో అనాది నుండి వస్తుందని, వారి నుండి వారిని బాధిస్తున్న పేదరిక బాధ తీసివేస్తే, వారు స్వతంత్ర పౌరులై, ఎంతో విజ్ఞానంతో ప్రవర్తిస్తారని గాంధీ అన్నారు గ్రామాలలో 75 శాతం పైగా, వ్యవసాయదారులే అని, వారి అభివృద్ధికి మనం సర్వదా తోడ్పడితేకాని, మనకు స్వపరిపాలన వలన అంతలాభం లేదన్నారు గాంధీ. గ్రామ సీమల ప్రజలకు, వారి కష్టానికి సరిపడ ఫలం వచ్చే లాగ పట్టణాలవారు చూడాలని, వారిని పీడించుకు తినకూడదని





ఆ నాడే గ్రామాల పట్టణాల మధ్య సరియగు ఆరోగ్యకరమైన, నైతిక బాంధవ్యం పెరగగలదని గాంధీజీ చెప్పాడు. సాంఘిక పునఃనిర్మాణంలో, విద్యకు చాలవిలువ వుందని, మనం యిచ్చే విద్య గ్రామాల అవసరాలను తీర్చేది అయిఉండాలని ఆయన వాదన. ఆయన బ్రతికి ఉన్నప్పుడు బేసిక్ విద్యా విధానం, కొన్నిరాష్ట్రాలు అమలు జరిపాయి. అనతికాలంలో వీటికి స్వస్తి కూడ చెప్పాయి. దానితో మన విద్యా విధానానికి గ్రామీణ ప్రజల జీవితానికి ఏమీ సంబంధం లేకుండా పోయింది. భారతదేశం, గ్రామ సీమలకు కూడలి స్థానం. గ్రామీణ జీవితం, పట్టణాల జీవితం తాపీగా ఉండాలి. పట్టణాలు గ్రామాలకై ఉన్నాయని గుర్తించి, గ్రామీణ అభివృద్ధికి సర్వదా పాటుపడాలి. మన కర్తవ్యాన్ని గురించి చెప్తూ వారు త్రాగే చెరువులోనే అందరూ స్నానం చేస్తారని, బట్టలు ఉతుకుతున్నారని, పోనీ వారికి ఉపాధి సౌకర్యాలు బాగా ఉన్నాయా అంటే అవీలేవు గ్రామాలలోని కుమ్మరి, వడ్రంగి, కమ్మరి, చర్మం, చేనేత మొదలగు పారిశ్రామికులు ఎందరో ఉన్నారు. వారికి తగు సాంకేతిక విజ్ఞానం యివ్వాలన్నారు. పట్టణాల లోని పరిశ్రమలు యిచ్చట స్థాపించటం చాల తప్పన్నారు. సమగ్ర గ్రామ సేవ చాల వుసరం. గ్రామీణ ఆర్థిక సర్వేలు చాలా అవసరమని వనరులు పట్టు, నూనె గానుగలు, దంపుడు బియ్యం, తాటి బెల్లం, తేనె, కాగితాలు, గ్రామీణ నబ్బు, స్థానికంగా లభ్యం అయే తోలునుండి చెప్పులు ఎన్నోఎన్నో గ్రామీణ పరిశ్రమలు నెలకొల్పి గ్రామీణ పజలకు ఉపాధి సౌకర్యాలు కలుగచేయవచ్చని గాంధీజీ వాదన. దానితో గ్రామాలకు స్వయం సంపూర్ణత రావటమేకాక, మిగిలిన వస్తువులు యితర ప్రాంతాలకు పంపగలరన్నారు. గాయకులు, శాస్త్రజ్ఞులు అందరూ కలసి గ్రామ పునర్నిర్మాణ సమస్య తీసికొని శాశ్వతంగా పరిష్కారం చేయాలన్నారు. ఒక ఉదాహరణ యిస్తు దంపుడు బియ్యం, వికేంద్రీకరణ గ్రామీణ పరిశ్రమ అని, దానితో ప్రజలకు ఆరోగ్యకరమైనఆహారం దొరకటమేకాక, ఉపాధిసౌకర్యం యిస్తుందని, ఎందుకు ఆధునిక బియ్యం మరలు పెట్టుచున్నామో ఆయనకు అర్థం అవటం లేదన్నాడు. ప్రజాభిప్రాయం బాగా ఉండాలని వారు దంపుడు బియ్యాన్నే కొంటే, బియ్యం మరలు మూయాలన్నాడు. పెద్దఎత్తున పారిశ్రామికీకరణ, దోచుకొనే సిద్ధాంతంమీద ఉంది. అది పోటీ మార్కెట్ల, మీద ఆధారపడింది. కనుక, గ్రామీణ అభివృద్ధి కార్యక్రమాలకు పనికిరాదని చెప్పారు. ఇదంతా, వారు ప్రసాదించిన అహింసా సిద్ధాంతం మీద ఆధారపడి ఉంది. హింస యొక్క ముఖ్య లక్ష్యం దోచుకోవటమే. గ్రామాలలో విద్యుచ్ఛక్తి ఉంటే గ్రామాలలోని ప్రజలు, కుటీర పారిశ్రామికులు, వీటివలన లాభాలు పొందవచ్చన్నాడు. కాని అనవసరంగా లాభదృష్టి పెట్టుకొని గ్రామసీమంలో యంత్రాలు పెట్టకూడదని ప్రజలలో ఉపాధి సౌకర్యాలు పోటీ తాను సహించనని గాంధీ పదేపదే చెప్పాడు.

## నూతన దృష్టి అవసరం

మన దేశంలో అభివృద్ధి 3.5 శాతం చూపినా, సరాసరి వ్యక్తిగత ఆదాయం యింత మాత్రం పెరగటం లేదని, ప్రజలలో ఉపాధి సౌకర్యాలు కాని ప్రజల జీవిత ప్రమాణం గాని పెరగలేదని, యీ ప్రణాళికలగూర్చి ముఖ్య లక్ష్యాల భారత ఆర్థిక మంత్రి శ్రీ హెచ్.ఎం. పటేల్ యీ మధ్యనే హైదరాబాదులో చెప్పారు. నూటికి 80 మంది వరకు గ్రామ సీమలలో ఉన్నారు. వారు ఆర్థికంగా అభివృద్ధి చెందిన గాని, దేశం ఆర్థికంగా అభివృద్ధి అయిందని చెప్పలేం. అవి కూడ దేశంలోని ఆర్థిక ఉత్పత్తికి సుమారు 50 శాతం తోడ్పడుతున్నాయి. ఈనాడు నిరుద్యోగుల సంఖ్య 40 మిలియనులు దాటింది. అనగా పనిచేసేవారలలో 6 గురిలో ఒకరికి పని అవకాశాలు లేవన్నమాట. 30 సంవత్సరాలలో మనం సాధించిన అభివృద్ధి యింతేనా? అనిపిస్తుంది. పెద్ద పరిశ్రమలమీద మోజుపడి, అవి ఉపాధి సౌకర్యాలు యిస్తాయి అనుకొన్నాం. దేశంలో జనసంఖ్య విపరీతంగా పెరగటం, వ్యవసాయం, అందరికీ ఉపాధి సౌకర్యాలు కలుగచేయ లేకపోవటం, పెద్ద పరిశ్రమలమీద మోజు, యివన్నీ యీ దుర్భర పరిస్థితికి దారితీశాయి. చిన్న పరిశ్రమలు అందులోను గ్రామ పరిశ్రమలు మరిచాం. వాటికి యివ్వవలసిన స్థానం యివ్వలేకపోయాం. గ్రామీణ పారిశ్రామికీకరణతో, మనకు కావలసిన అన్ని సరుకులు లభ్యం కావు. కొన్ని పెద్ద పరిశ్రమలు అవసరమే. అంతేకాక పాశ్చాత్య సాంకేతిక విజ్ఞానం ఎంతవరకు ఉపయోగపడుతుందో తెలియకుండా, చాలా డబ్బు ఖర్చు పెట్టి, యంత్రాలు ప్రవేశపెట్టాం. మన దేశంలో ప్రజలకు ఉపాధి కలిగించే మార్గాలు చూడాలి కాని, ఉద్యోగ అవకాశాలు పోయేవి చూడకూడదు. మనకు పెట్టుబడి అంతగా లేదు. పోనీ వ్యవసాయ ఉత్పత్తి పెంచామా అంటే అదీ వేయలేదు. వ్యవసాయోత్పత్తిలో చాలా దెబ్బతిన్నాం.

ప్రజలు గ్రామసీమలలో ఉన్నారు గనుక, గ్రామీణ ప్రాంతాలలో రాబడి, ఉపాధి సౌకర్యాలు హెచ్చు చేసే పథకాలు చేబట్టాలి. ఇది గాంధీ చెప్పాడని మనం చేయనక్కరలేదు. ఈ మార్గమే మనకు శరణ్యం. నీటిపారుదల సౌకర్యాలు అవసరం. భూగర్భ వనరులు తెలిసికొని బావులు తవ్వాలి. తక్కువ నీటి సౌకర్యంతో, పప్పుగింజలు, నూనెగింజలు పండించటానికి వీలుంది. వీటిలో మనకు చాలా కొఱత ఉంది. దానితోపాటు, మనం మల్బరీ పంట పండించి, ఆ ఆకులతో, పట్టుగుడ్లు చేయవచ్చు ఇది గ్రామీణ పరిశ్రమ. సన్నకారు, చిన్న వ్యవసాయదారులకు కళ్యాణ కల్పతరువు. వర్షాధారం లేని భూములలో కూడ మల్బరీచెట్లు పెరుగుతాయి. దేశంలో సిల్కు ఉత్పత్తి చాల అవసరం. ఒక సంవత్సరం నుండి వ్యవసాయదారునకు 6000 రూపాయల నికరాదాయం, ఒక యకరం భూమిమీద వస్తుంది. యింత రాబడి ఏ యితర పంటనుండి రాదు. మన రాష్ట్రంలో యీ విషయంలో మంచి ప్రగతిని సాధించాం. కాని పట్టుకాయలు బయట అమ్మక, దానినుండి తీసే దారం మన రాష్ట్రంలోనే ఉపయోగించుకోవాలి. చేనేత పనివారలు శిల్కుదారం ఉపయోగిస్తే హెచ్చు వేతనాలు వస్తాయి.

ఏదిఎట్లున్నా ఒక్క వ్యవసాయమే గ్రామీణ పేదరిక బాధ నిర్మూలింపలేదు. ఉపవృత్తులు పాడి పరిశ్రమ, కోళ్ళ పెంపకం, చేపలు, పందులను పెంచటం తీసికోవాలి. అట్లాగే కుటీర పరిశ్రమల అభివృద్ధికి మనం తోడ్పడాలి. వాటికి పెట్టుబడి చాలా తక్కువ. ఫలితాలు తొందరగా వస్తాయి. సాంకేతిక విజ్ఞానం







అంతగా అక్కరలేదు. గ్రామీణ పారిశ్రామికాభివృద్ధి పథకాలలో నల్గొండ జిల్లా భారతదేశంలో ప్రథమం అనిపించుకొంది. గాంధీజీ కూడ మన రాష్ట్రంలో పొందూరులో చేత్తో తీసే సన్నదారం యితర ప్రాంతాలలో తీయలేరని ఆంధ్రులను ప్రశంసించారు.

## విదేశ సాంకేతిక విజ్ఞానం మీద మోజు తగ్గాలి

ఏదిఏట్లున్నా మనం, యీనాడు గాంధేయమార్గం అనుసరించ వలసిన అవుసరం వచ్చింది. మన ఆర్థికవేత్తలలో చాలామంది పెద్దపరిశ్రమలలో అనవుసరంగా మోజుచూపుతున్నారు. రోప్కే అనే ఆర్థిక శాస్త్రవేత్త, అభివృద్ధి చెందుతోన్న దేశమైనా భారతదేశం, అనవసరంగా పాశ్చాత్య ఉత్పత్తి చూసి మోజుపడక గాంధేయ మార్గాన్ని అనుసరించాలన్నాడు. జి డి. హెచ్. కోలె కూడ అనవుసరంగా, ఉన్న పెట్టుబడి పెద్ద పరిశ్రమలలో పెట్టి, పెరుగుతోన్న జనాభాను కష్టపెట్టడం సాధ్యమైన పని కాదని, యితర దేశాల నుండి అప్పులు తీసుకోవడం మంచిదికాదని యంత్రాల మీద వ్యామోహం విడనాడి, ప్రజలకు ఉపాధి సౌకర్యాలు కలుగ చేసే గ్రామీణ పరిశ్రమలే, చాలాకాలం వరకు భారత పేదరిక సమస్య పరిష్కారం చేయగలవన్నాడు. ఇప్పటికైనా మన ఆర్థిక దృష్టి మార్చుకొందాం. గ్రామసీమల ఆర్థికాభివృద్ధికి తోడ్పడదాం. విదేశ సాంకేతిక విజ్ఞానం, యంత్రాలు యందు మనం మోజు తగ్గించుకోవాలి. అవి మన పరిస్థితులలో ఎంతవరకు పని చేయగలవో ఆలోచించాలి. 'గుడ్డెద్దు చేలో పడట్లు' ఆలోచించకుండా వాటిని ఉపయోగించవద్దు. ఇప్పటికైనా మన ఆర్థిక శాస్త్రవేత్తల దృష్టిలో మార్పు రావాలి. పెద్ద పరిశ్రమల మీద వ్యామోహం విడనాడాలి. వీరు యిచ్చే వ్యూహ కల్పనలు యిప్పటికే దేశానికి కూడని నష్టాలు తెచ్చాయి. చిన్న పరిశ్రమల అభివృద్ధి, గ్రామీణ సర్వతోముఖాభివృద్ధికి, మన కర్తవ్యాన్ని గుర్తించి, సమగ్ర గ్రామ సేవచేయాలి. మన ఆంధ్రప్రదేశంలో, గ్రామీణ పారిశ్రామికాభివృద్ధి పథకాలలోను చిన్న, సన్నకారు వ్యవసాయదారుల అభివృద్ధి పథకాలలోను, యింకా ఎన్నో రంగాలలో మంచి ప్రగతి సాధించాం. గ్రామాల సర్వతోముఖాభివృద్ధికి తగు చర్యలు తీసుకొంటే, నిరుద్యోగ సమస్య పరిష్కారం చేయగలుగుతాం. పట్టణాల నుండి, కొంతమంది ప్రజలను తిరిగి గ్రామ సీమలకు పంపగలుగుతాం. ఇదంతా జరగాలంటే సమగ్ర గ్రామాభివృద్ధి జరగాలి.

ఈనాడు వివిధప్రభుత్వాలుస్వతంత్రులుగావ్యవహరిస్తున్నాయి. అట్లాగాక ఏకీకృత క్షేత్రాభివృద్ధి అవాలంటే, ఒక ప్రణాళిక తయారు చేసి దానిని అమలు జరుపాలి. దేశస్థాయిలో కూడ అన్ని జిల్లాలలో ఏకీకృతగ్రామాభివృద్ధి పథకాలు అమలు జరుపబడుతున్నాయి. 111 జిల్లాలలో గ్రామీణ అభివృద్ధి పథకాలు అమలు జరుపబడుతున్నాయి. ఇతర రంగాలలో, ముఖ్యంగా సన్నకారు చిన్న రైతుల అభివృద్ధి, పాడి పరిశ్రమ, చేపల పరిశ్రమ యింకా ఎన్నో రంగాలలో వివిధ పథకాలు అమలు జరుపబడుతున్నాయి. వాటిని ఏకీకృతం (Intigration) చేయవలసివుంది. రాష్ట్ర స్థాయిలో గ్రామీణాభివృద్ధి కమీషనర్లను నియమిస్తే బాగుంటుంది. కేంద్ర స్థాయిలో, ఒక కార్యదర్శి యీ పని నిర్వహిస్తున్నాడు. వీరందరు గాంధేయ మార్గాన్ని బాగా చదివి, నిర్మాణ కార్యకర్తలతో సంభాషణలు జరిపి, ప్రజాసహకారంతో యీ కార్యక్రమాన్ని విజయాన్ని చేయగలుగుతారు. ఏకీకృత గ్రామాభివృద్ధి పథకాల విజయానికై స్వచ్ఛంద సేవాసంస్థలు ఎంతో సహకరించగలవు. వారుకూడ సేవాధర్మమే సూత్రధర్మమని పనిచేయాలి. అవుసరమైన చోట్ల వారికి కావలసిన ఖర్చులు ప్రభుత్వం యివ్వవచ్చు. భారత ప్రధాని, 30వ స్వాతంత్ర్య దినోత్సవ సందర్భంలో మాట్లాడుతూ, పాశ్చాత్య నాగరికతా వ్యామోహంలో పడకూడదని, మన సాంఘిక విలువలు కాపాడుకోవాలని, గ్రామసీమల యెడల మనకున్న బాధ్యతలు నిర్వహించాలని అన్నమాటలో చాలా సత్యముంది.

---

## పశుబలం పనికిరాదు

పశుబల సంపన్నుడైన వాడికి తానే సాధనాన్ని ఉపయోగిస్తున్నాడనే వివేకం ఉండదు.

మానవ మానసిక ప్రకృతి పాశవికం కాకుండా నిరోధించడమే నాకు ముఖ్యం, నా ప్రజల బాధలు పోగొట్టడం కన్న.

పశుబలం రాజ్యం చేస్తున్న యీ యుగంలో, ఎవడైనా తుది విజయం పశుబలానిదే అనే సిద్ధాంతాన్ని త్రోసి వేయగలుగుతాడని నమ్మడమే చాలా కష్టంగా వుంటుంది.

—గాంధీజీ

---





# మహాత్ముడు



జాతిపిత మహాత్మాగాంధీ పోరుబందరులో క్రీ.శ. 1869 అక్టోబరు 2న (శుక్ల సం॥ భాద్రపద బ॥ ౧౨ శనివారం) జన్మించారు. ఆయన తండ్రి మంచి వ్యవహారజ్ఞానం గలవారు. ఆయన పేరు కబాగాంధీ. వారి నల్గురి భార్యలలో తుది భార్యయైన పుతలీబాయి ముగ్గురు కొడుకులలో మోహన్‌దాస్ కరమ్‌చంద్ కడగొట్టువాడు. గుజరాతులో చిల్లర సరుకులమ్మేవారికి గాంధీలని పేరు. వీరి తల్లి పుతలీబాయి గొప్ప ధార్మికురాలు. చాతుర్మాస్య చాంద్రాయణాది అనేక పుణ్య వ్రతాలు చేసిన పుణ్యాత్మురాలు. ఆమె చాతుర్మాస్యల్లో సూర్యదర్శనం కానినాడు భోజనం చేయకుండెనట. చాతుర్మాస్యలు వర్షాకాలం కాబట్టి సూర్యుని తరచుగా మేఘాలు కప్పుతుంటాయి. సూర్యదర్శనంగాక ఆమె ఒక్కొక్కప్పుడు 2, 3 దినములు ఉపవాసం ఉండేదట. గాంధీ మహాత్మునికి మోహనదాస్ కరంచంద్ గాంధీయని తల్లిదండ్రులు పేరుపెట్టారు. ఆయన శైశవం పోరుబందరులోనే గడచింది. అక్కడ ఆయనకు బడిచదువు బాగా సాగలేదు. చదవకుండా అల్లరిగా తిరిగేవాడు. జ్ఞాపకశక్తి తక్కువగా ఉండేదట. అందుచేత ఆయన మందబుద్ధిగలవాడంటుండేవారట.

కొన్నాళ్ళకు పోరుబందరునుండి ఆయన తండ్రి రాజకోట నగరంలో కోర్టు ఉద్యోగిగా చేరినాడు. అప్పుడు మహాత్ముని వయస్సు దాదాపు ఏడేండ్లు. రాజకోటలో ఆయనను ప్రైమరీ స్కూలులో తండ్రి చేర్చాడు. ఆస్కూల్లోకూడా ఎక్కువ చదువబ్బక ఆయన సాధారణ విద్యార్థిగానే వుండెను. ఆ స్కూలు నుండి కరమ్‌చంద్‌గాంధీ హైస్కూల్లో చేరేనాటికి 12 సం॥ వయస్సువాడు, ఆయన ప్రాథమిక విద్యార్థి సమయంలో ఏ ఉపాధ్యాయులతో కూడ అసత్యాలు పల్కినవాడు కాడు. మరి యెవరితోను విశేష స్నేహము చేయలేదు. ఆ కాలంలో ఆయన చాలా బిడియపడుచు స్నేహంనుండి తప్పించుకొంటుండేవాడు. ప్రతిదినం సరిగా బడికి పోవడం, బడి మూయగానే యింటికి రావడం, ఇదీ ఆయన దినచర్య. ఈ రాకపోకలలో ఆయన పరుగెత్తుతూనే పోయేవాడు. దానికి కారణం ఏమిటంటే నిల్చుంటే ఇతరులతో మాట్లాడవలసి వస్తుంది. అది ఆయనకు గిట్టక పరుగెత్తేవాడు. ఇంతేకాక ఎవరైనా తనను గేలిచేస్తారనికూడ అతనికి భయం. ఆయన హైస్కూల్లో మొదటి సం॥ చదివేటప్పుడు బాల్యంలోనే తనకున్న నీతీ నిజాయతీ తెలిపే ఒక సంఘటన జరిగింది. ఆయన స్కూలుకు విద్యాశాఖాధికారి పరీక్షించడానికి వచ్చాడు. ఆ అధికారి తన క్లాసు పిల్లలకు 5 ఇంగ్లీషు పదాలకు స్పెల్లింగ్‌లు వ్రాయడానికి ఇచ్చాడు. అందులో Kettle అనే పదానికి గాంధీ తప్పు స్పెల్లింగ్ వ్రాశాడు. అప్పుడు ఉపాధ్యాయుడు బూటుకొనతో అతనిని హెచ్చరించి ప్రక్కవాని పలకచూచి వ్రాయమని సూచించాడు. అలా యితరుల పలకలో చూచి కాపీచేయడం ఆయనకు ఇష్టంలేదు. అప్పుడు అతని సహాధ్యాయులందరు సరిగా వ్రాసి ప్రశంసకు పాత్రులైనారు. తాను మాత్రం మొద్దబ్బాయిగా తలచబడ్డాడు. గురువుకుకూడ గాంధీపై కోపంవచ్చి అతనిని దిద్దజూచాడు. కాని ఎందరెన్ని చెప్పినా ఆయన మాత్రం పరీక్షల్లో కాపీ చేయటం నేర్చుకోలేకపోయాడు. ఈ గుణం ఆదర్శంగా పెట్టుకొని యీనాటి విద్యార్థులు మెలగడం మంచిది.

ఉపాధ్యాయులు అతన్ని పెడతోవల పట్టించదలచినారని వాళ్ళపై ఆయనకెప్పుడూ అగౌరవం తగ్గలేదు. పెద్దల తప్పుల నెప్పుడూ ఎంచేవాడు కాడు. వాళ్ళ ఆజ్ఞలను నెరవేర్చడమే తన విధిగా తలచేవాడు. పెద్దల నెప్పుడూ విమర్శించలేదు. ఇది మోహన్‌దాస్‌కు బాల్యంనుండే ఏర్పడిన మంచి స్వభావము.

—శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

ఆయన బడిలో ప్రతిదినం చదివే పాఠాలు శ్రద్ధగా చదివి మరునాడు క్లాసులో ఒప్పగించేవాడు. గురువులవల్ల మాటపడటం అతనికి ఇష్టంకాదు. అందువల్ల ఆయన క్లాసు పుస్తకములు తప్ప యితర పుస్తకాలేవీ చదివేవాడుకాదు. దానికి ఆయనను సహాధ్యాయులు వెక్కిరిస్తూ ఉండేవారు.

ఒకనాడు మాత్రం ఆయన తన తండ్రి కొని తెచ్చిన "శ్రవణుని పితృభక్తి" అనే నాటకాన్ని చూచి దాన్ని శ్రద్ధగా చదివాడు. ఆ సమయంలోనే బొమ్మలాటగాండ్లు వచ్చి





బొమ్మలాడారు. బొమ్మలాటలో కూడా శ్రవణుడు అంధులైన తలి దండ్రులను, కావడిలో తీసుకొని యాత్రకు పోయే బొమ్మను చూపారు. ఆ నాటకంలో చదివిన కథ, ఆ బొమ్మా ఒకే విధంగా ఆయన మనస్సుపై హత్తుకొని ఆ విధంగా తాను కూడ మాతాపితృ భక్తిని కలిగి వుండాలి అని నిశ్చయించాడు.

ఆ కాలంలోనే హరిశ్చంద్రనాటకాన్ని ఆయన చూచాడు. ఆ నాటకాన్ని యెన్నిసార్లు చూచినా ఆయనకు తృప్తికాలేదు. కాని అనేక పర్యాయాలు ఆ నాటకం చూడడానికి ఆయనకు తల్లిదండ్రుల అనుమతి లేకుండెను. ఐనా కలలో అతనికి ఆ నాటకం కనపడుతూ ఉండేది. అందరూ సత్య హరిశ్చంద్రులెందుకు కాకూడదు? అని ఆయన అనుకునే వాడట. సత్యపాలనకుగాను హరిశ్చంద్రునిలాగా యెన్ని ఆపదలనైనా అనుభవించవచ్చని అనుకొనేవాడట. ఆయన జీవితాంతం శ్రవణుని చరిత్ర, హరిశ్చంద్రుని చరిత్ర ముద్రవేసికొని ఉండిపోయాయి. ఆ పుస్తకాలెప్పుడు చదివినా ఆయన కంట తడి పెట్టేవాడట.

ఈ విధంగా సమాజంలో నీతిని కలిగించే పుస్తకాలు చదివి ఆ విధంగానే ఆచరిస్తూ వుండడం మన విద్యార్థులు ఆయన్ను ఆదర్శంగా పెట్టుకొని వుండడం అవసరం.

గాంధీకి 13వ యేటనే పెండ్లి ఐన తర్వాత కూడా చదువుసాగుతూనే వుంది. అతని నడతను విద్యలో శ్రద్ధను చూచి ఉపాధ్యాయులకు అతనియందు మిక్కిలి వాత్సల్యం కలిగింది. ప్రతియేటా యిచ్చే సర్టిఫికెట్టులో ఎప్పుడూ చెడ్డ రిమార్కు లేదు. ఉత్తమంగా పరీక్ష నెగ్గినందుకు మొదటి యేడు 5రూ, 2వ యేడు 6వ తరగతిలో రు. 10లు, స్కాలర్ షిప్పులు వస్తుండేవి. ఆయన చదువుకునేటప్పుడు సత్ప్రవర్తన మాత్రం ఎప్పుడూ విడువలేదు. మానవస్వభావంగా ఏదైనా తప్పు చేసినప్పుడు ఏడ్చేవాడు. తన తప్పునకు గురువులు దండించినపుడు ఆయన యెన్నడూ చింతించలేదు. ఒకప్పుడు ఆయనను గురువులు కొట్టిరి. ఐనా ఆయన అందుకు దుఃఖించలేదు. కాని, కొట్ట దగినంత నేరం చేశాడని అందరూ అనుకుంటారనే అపకీర్తికి వెఱచేవాడు. ఆ భయంచేత మాత్రం యేడ్చినాడు. నడవడం తప్ప ఆయన యితర శరీర వ్యాయామాలు ఏవీ చేసేవాడుకాడు. నడవడంతోబాటు తండ్రికిచేసే సేవకూడ ఆయన కొక వ్యాయామంగా ఉండేది. స్కూలు మైదానాల్లో జరిగే ఫుట్ బాల్ వంటి వ్యాయామక్రీడలకు ఆయన ఎప్పుడూ హాజరయ్యేవాడు కాడు. దేహపరిశ్రమకూ బుద్ధికీ సంబంధం లేదని ఆయన నమ్మకం. ఇదిగాక ప్రతిరోజు సాయం కాలం తండ్రికి చేసే సేవలకు వ్యాయామక్రీడ ఆటంకమని కూడా వాటికి హాజరుకాకుండేవాడు. ఆ స్కూలు హెడ్మాష్టరు సాయం కాలం ఆటలకు రానిపిల్లలను దండించేవాడు. ఒకనాడు గాంధీని పిల్చి అడిగితే ఆయన తన తండ్రిసేవకు భంగమౌతుందనే మాట సత్యంగానే చెప్పినాడు. అది అసత్యమని హెడ్‌మాస్టరు తలచి ఆయనకు రెండణాలు అపరాధం వేసినాడు. సత్యానికి విలువలేక పోయెనే అని గాంధీ విచారపడినాడు, విద్యతోబాటు దేహ పరిశ్రమ కూడా నేర్చుకోవడం అవసరమని రానురాను ఆయనకు తోచింది. ఆయన దస్తూరి పొంకంగా లేకుండెను. దానికీ విద్యకూ సంబంధం లేదని ఆయన అనుకునేవాడు. అదికొన్నాళ్లకు ఆయనకు పరీక్షలు బాగా నెగ్గడంలో ఆటంకమైంది. కాబట్టి మంచి దస్తూరి అభ్యాసం చెయ్యడం కూడా విద్యాభ్యాసంలో ఒక ముఖ్యాంశం అని తర్వాత విద్యార్థుల కాయన బోధించాడు. అక్షరాలు నేర్పడానికన్నా ముందు పూలూ పిట్టలూ లాంటి చిత్రాలు గీయడం నేర్పితే ఆ అభ్యాసంతో అక్షరాలుకూడా తర్వాత తీర్చిదిద్ది వ్రాయడానికి విద్యార్థులు అలవాటు పడతారని ఆయన అభిప్రాయం.

మోహన్‌దాసు కరంచందుకు వివాహకారణంగా ఒక సంవత్సరం చదువు వెనుకబడిపోయింది. అందుచేత ఆయనకు ఆయన తెలివితేటలను శ్రద్ధను చూచి ఉపాధ్యాయులు డబల్ ప్రమోషను ఇచ్చారు. అందువల్ల ఆయన యింగ్లీషు మీడియంగల 4వ తరగతిలో చేర్చబడ్డాడు. ఉపాధ్యాయులు ఎంత మంచి బోధకులైనా ఆ మీడియంలో చదవటం ఆయనకు చాలా కష్టమైంది. దీనికితోడు ఆయనకు క్షేత్ర గణితంకూడ బాగారాకుండెను. అది యింగ్లీషుమీడియంలో చదవడం మరీ కఠినమయింది. అందుచేత ఆయన తిరిగి మూడో తరగతి లోకి దిగి పోదలచాడు. కాని అలా చేయడం ఆయనకూ ఆయన పైన నమ్మకంతో పైక్లాసులో చేర్చిన ఉపాధ్యాయులకూ తలవంపులని ఆ ప్రయత్నం మానుకున్నాడు. శ్రద్ధగా వ్యాసంగం చేసి సంవత్సర పరీక్షలో 4వ తరగతి నెగ్గాడు.

ఆయన కష్టం అనుకున్న క్షేత్రగణితం కంటె సంస్కృతాభ్యాసం కష్టతరమాయెను. ఆ భాషాపాఠములన్నీ కంఠోపాఠం చేయాలని ఆయన తలంచుచుండెను. అదికూడ 4వ తరగతి నుండే ప్రారంభమైంది. ఐనా నెగ్గుతూ 6వ తరగతి చేరాడు. అప్పుడు సంస్కృతోపాధ్యాయుడు పాఠాలు పెంచాడు. సంస్కృతం చదవడం కష్టమనీ ఉపాధ్యాయుడు కఠినుడనీ తలచి గాంధీ సంస్కృతాన్ని విడిచి పార్సీక్లాసులో చేరాడు. పార్సీ ఉపాధ్యాయుడు సౌమ్యుడు, పాఠం సరళం అని ఆయన అభిప్రాయపడ్డాడు. ఒకరోజు కాగానే సంస్కృతోపాధ్యాయుడు గాంధీని పిలిచి నాయనా! నీ వంశమేది? నీ తల్లి తాతలెవరు? నీవు పార్సీ చదువవచ్చునా? అని బోధించి మళ్లీ సంస్కృతంలో చేర్చాడు. కృష్ణశంకరపాండ్యా అనే ఆ సంస్కృతోపాధ్యాయుడు తనకు బోధించి తిరిగి సంస్కృతంలో చేర్పించకుండ వుంటే తనకు ఈ కొంచెమైనా సంస్కృతం రాకపొయ్యేదే అని గాంధీ తర్వాత హిందూశాస్త్రగ్రంథాలు చదివేటప్పుడు విచారపడి సంస్కృతం ఇంకా ఎక్కువ చదువకపోతినే అని బాధ పడ్డాడు. ప్రతి హిందూ బాలుడు, బాలిక సంస్కృతం చదివితీరాలని ఆయన అందరికీ తరువాత ఉపదేశిస్తుండేవాడు.

మన దేశంలో విద్యార్థులకు మాతృభాషా, హిందీ సంస్కృతాలూ, పార్సీ, అరబ్బీ, ఇంగ్లీషుభాషలూ పాఠ్యాలుగా వుండాలి. ఇన్ని భాషలకు భయపడనవసరం లేదని ఆయన భావించాడు. ఇంగ్లీషు మీడియం అనే భారం తొలగించి మాతృభాష మీడియంలో చదివితే అనేక భాషల అభ్యాసం కష్టం కాదని ఆయన తలచాడు. ఒకభాష శాస్త్రీయంగా బాగా అభ్యసిస్తే ఇతర భాషలెన్నైనా సులభంగా నేర్వవచ్చునని ఆయన ఉద్దేశం. మన భారతీయభాషలన్నీ సంస్కృతం నేర్చిస్తే సులభతరం ఔతాయనీ పార్సీ, అరబ్బీ భాషలు నేర్చినవారికి ఉర్దూభాష సులభతరం అనీ ఆయన ఉపదేశిస్తూ సంస్కృతంవైపు మనవారిని ప్రోత్సహించాడు.





చెడు సావాసంవల్ల దురభ్యాసాలు కలుగుతాయని ఆయన స్వానుభవంతో చెప్పాడు. ఆయన అలాంటి సావాసంవల్ల మాంస భోజనం చేశాడు. ఆ విషయం తల్లిదండ్రులకు అమాకీగా తెలిసినప్పుడు వారి వద్ద బొంకవలసివచ్చింది. అప్పుడాయన మాంసం తినడం ఒక తప్పు, గురువుల వద్ద బొంకులాడడం రెండో తప్పు. ఇలా మొదటి తప్పు చేయడం వల్ల యింకా యిన్ని తప్పులు చేయవలసి వస్తుందో అని ఆత్మనిగ్రహంతో అప్పుడప్పుడూ విందులో మిత్రునితో కుదిరే మాంసాన్ని విడిచి దాన్ని ప్రోత్సహించిన వాని మైత్రిని కూడా వదలివేశాడు. వాని మైత్రి అలాగే సాగివుంటే అతడు తననుక్రమంగా వ్యభిచారానికికూడా దించేవాడని గాంధీ వాపోయాడు. దీనికి ఉదాహరణంగా—

ఒకనాడు గాంధీని ఆ మిత్రుడు వేశ్యయింటికి తీసికొనిపోయి బోధించి లోనికి పంపాడు, ఆమెకు ఇవ్వవలసిన భోగశుల్కంకూడా అతడు మొదటనే చెల్లించాడు. ఆయన ఆ పాపకూపంలోకి పోయి ఆమెప్రక్కన శయ్యపై కూర్చొని తన తప్పును విచారిస్తూ కొంచెం సేపు మాట్లాడకుండా కూర్చొన్నాడు. అప్పుడా వేశ్య అతనికి పురుషత్వం లేదని తలచి బైటికి నెట్టివేసింది. పురుషత్వం లేదని అవమానం అతనికి కలిగినా ఆ పాపంనుండి విముక్తి కలిగిన సంతోషము అధికమైంది. భగవంతుడు తన్ను రక్షించాడని దేవునికి మొక్కాడు. ఇంతైనా ఆ మిత్రుణ్ణి ఆయన విడువలేక పోయాడు. అతడు తర్వాత కొన్నాళ్లకు గాంధీ భార్యపై అపవాదులు మోపి గాంధీకి ఆమెపై ద్వేషం కలిగించాడు. ఆ ద్వేషంతో యౌవ్వనదశారంభంలో మోహన్‌దాసు భార్యను చాలా హింస పెట్టాడు. కాని ఆమె శీలాన్ని గుర్తించిన తర్వాత చాలా బాధపడి యీ అవాంతరాలన్నింటికి కారణమైన అతని మైత్రి విడిచాడు. కనుక మానవ స్వభావంతో ఒకప్పుడు కొన్ని తప్పులు చేసినా తిరిగి ఆత్మపరిశీలనం చేసుకొని బాగుపడడం అవసరమని తర్వాత యువతరానికి ఆయన గుణపాఠం నేర్పాడు.

బాల్యంలోనే ఉన్నతాదర్శాలను పాటిస్తూ వచ్చాడు కాబట్టి ఆయన మనకు ఆదర్శపురుషుడై మహాత్ముడై శ్రీరామచంద్రునిలాగా భారత జాతికి పూజనీయుడయ్యాడు. అట్టి మహాత్మునికి నా పుష్పాంజలి–

కామక్రోధ మదాదిశత్రు నివహ గ్రాహంబులన్ జిక్కకున్
భూమీశుల్ కడు క్రొవ్వి యుండుతరి బాపూజీ స్వయంసేవక
త్వాపాదంబున లోకతంత్రమునకై యాయాసముల్ సల్పని
స్సీమంబైన స్వతంత్రభావన ప్రతిష్ఠించెన్ స్వదేశంబునన్

అరయగ బోసి నవ్వు వరహాల్ గురిపించగ భారతావనిన్
పరుగులు వారగా దొరలు భవ్యమహాత్ముడు పేదలోకులం
దరిమురిసోరి వారి కడుదైన్యగతిన్ తుదముట్టనెట్టగా
పరికరముం బిగించె జనబాంధవు డాతడు త్యాగమూర్తియై

కడు బక్కచిక్కిన యొడలితో ప్రబలాంగ్ల
సామ్రాజ్యమును వేగ సాగనంపె
సత్యాగ్రహాయుధ సంపదతోడనే
దస్యుమారణహేతి తతినడంచె
ఏకు మేకుగజేసి యెవ్వాడు శత్రుల
గుండెలు బ్రద్దలై క్రుళ్ల జేసె
భిదురాయుధంబుగా కదురు బెదురుజేసి
అరికంఠనాళముల్ దరిగెనెవడు

అట్టిలోకైక వీర మహాత్మ, నతుల
శాంత్యహింసాయుధాయోద్ధ, సత్యమూర్తి,
సర్వ సర్వంసహార్చిత సార్వభౌము,
నాత్మసంయమయోగి, మహాత్మ దలతు

ఆయత దీక్షతో జగతి నంటగరాని పిశాచశక్తులం
దాయువుమాపి తా హరిజనావళి కూడిగముల్ పొనర్చుచున్
ధీయుతి విద్య నేర్పిన సుధీమణి ధీరుడు దరిద్ర నా
రాయణుడన్న పేరును యథార్థముగా వహియించె నీ భువిన్

అతనికి పుష్పాంజలి నే
నతిభక్తి శ్రద్ధలన్ సమర్పించెద నా
యతిశయ మహాత్మ పదముల
నతితతితో జన్మదినమునన్ తృప్తిమెయిన్

## మార్పు

జీవితంనిరంతర పరిణామశీలి, ఒకే మాట మీద వున్నాననిపించుకోవడానికి తన మూఢ సిద్ధాంతాలనే అంటి పెట్టుకుని వుండేవాడు చివరకు దారితప్పుతాడు.

మార్పు ప్రగతికి చిహ్నం. నిజాయితీపరుడు ఫలానిది తప్పని మనసు ఎదురుతిరుగుతున్నా సరే, యాంత్రికంగా దానికే కట్టుబడి వుండడు.

—గాంధీజీ







# గాంధీజీ సిద్ధాంతాల ప్రచారానికి అంకితమైన సంస్థ

బాపూజీ స్వాతంత్ర్య సంగ్రామంలో ప్రవేశించే నాటికి స్వాతంత్ర్యం సాధించటం కోసం వివిధ వర్గాలకు చెందిన వారు వివిధ రకాలైన విధానాలతో కృషి చేస్తుండేవారు. వారి అంతిమాదర్శం ఒక్కటే అయినా విధానాలు వేరుకావడంతో స్వాతంత్ర్య ఉద్యమం తీవ్రత అంతగా లేదు. కేవలం సమాజంలో ఉన్నత వర్గాలు, మేధావుల వరకే స్వాతంత్ర్య ఉద్యమం పరిమితమయి పోయింది. బాపూజీ రాజకీయ రంగం ప్రవేశాన్ని గూర్చి పండిట్ జవహర్ లాల్ నెహ్రూ ఇలా అన్నారు—ఆయన (గాంధీజీ) కారు చీకట్లను చీల్చి, మనకళ్ళలో అలుముకున్న అంధకారాన్ని పటాపంచలు చేసిన కాంతి పుంజంలా, ఎన్నిటినో తల క్రిందులు చేసిన ఝంఝామారుతంలా, ముఖ్యంగా ప్రజలు పనిచేసే విధానాలను పూర్తిగా మార్చివేశారు.

గాంధీజీ రాజకీయాల్లో ప్రవేశించటంతో స్వాతంత్ర్య సంగ్రామం ఒక క్రొత్తమలుపు తిరిగింది. దానికొక కొత్త ఊపు నిచ్చారు గాంధీజీ. భారతీయతను పుణికి పుచ్చుకున్న బాపూజీ మూర్తీభవించిన భారతీయుడుగానే రాజకీయాల్లో పాల్గొన్నారు. వేష భాషలకు చోటివ్వక నిరాడంబర జీవితాన్ని గడుపుతూ అప్పటివరకు మేధావులకే పరిమితమైన రాజకీయాల వైశిష్ట్యాన్ని పేద ప్రజలకు తెలియ చెప్పారు. నిరుపేదలు, భాగ్యవంతులు, విద్యార్థులు, రైతులు, మేధావులు, ఉద్యోగులు, వ్యాపారులు, అధ్యాపకులు. ఒకరేమిటి సమాజంలో ప్రతీవారు ఆయనవైపు ఆకర్షితులయ్యారు. ఆబాలగోపాలం ఆయన వెంట నడిచింది. ఆయన మాట శిరోధార్యం అన్నారు.

బాపూజీ వ్యక్తిత్వ ప్రభావం ఆనాడు భారతీయ ప్రజలపై ఉంది. దానికి కారణం లేకపోలేదు. బాపూజీ ప్రజలకు సన్నిహితులు. ప్రజల వేష భాషలకు దగ్గరగా ఉన్నారు. ఆయనలో ఉన్న నైతిక శక్తి ప్రభావం అటువంటిది. ప్రజలమధ్య తిరిగారు. నిస్వార్థం ఆయన జీవన విధానం. ఆదర్శానికి మరొక రూపమే గాంధీజీ, సత్యస్వరూపి అయిన బాపూజీ విశిష్ట వ్యక్తిత్వం వల్లనే అశేష ప్రజానీకం ఆకర్షితులయ్యారు.

సమాజంలో ఉన్న వాస్తవ పరిస్థితులను అర్థంచేసుకొని సమాజాన్ని ముందుకు నడిపించిన మహాశక్తి ఆయన. ఆయన మాటతో విద్యార్థులు విద్యాలయాలను వదిలారు. న్యాయవాదులు న్యాయస్థానాలను బహిష్కరించారు. అధ్యాపకులు జాతీయ భావాలను ప్రబోధించారు. గ్రామాధికారులు ఉద్యోగాలకు తిలోదకాలిచ్చారు. ఉద్యోగుల ఉద్యోగాలకు రాజీనామా లిచ్చారు. నాయకులు విదేశీ వస్తువులను బహిష్కరించారు. ప్రజలు పన్నులు కట్టడం నిరాకరించారు. ఆయన బాటను అనుసరించి ప్రభుత్వంతో ప్రజలు సహాయ నిరాకరణ చేయడంతో బ్రిటిష్ ప్రభుత్వం పునాదులు కదిలి పోయాయి. బ్రిటిష్ సింహాసనం కదిలించి ప్రజాశక్తి బ్రిటిష్ అధికారాన్ని పెకలించి వేసింది.

స్వాతంత్ర్యం లభించింది. గాంధీజీ ఆదర్శాలకు అనుగుణంగా మనం రాజ్యాంగాన్ని రూపొందించుకొన్నాం. బాపూజీ తత్త్వ ప్రభావం మన రాజ్యాంగంపై ఉంది. బాపూజీ ఆశించిన గ్రామరాజ్యం సాధనకోసం మన సమాజ వికాస కార్యక్రమాలను బాపూజీ జయంతి రోజున ప్రారంభించుకున్నాం. దేశప్రగతిని సాధించు కుంటున్నాం ఇన్ని కార్యక్రమాలను సాధించుకుంటున్నా సమాజంలో అసంతృప్తి ప్రబలి ఉంది. విద్యార్థులలో ప్రబలిన క్రమశిక్షణా రాహిత్యానికి కారణం మనలో నైతిక విలువలు కోల్పోవడమే. కొంతమందికి రాజకీయ వాదులు నైతిక సూత్రాలను ప్రక్కనబెట్టి అవకాశవాదాన్ని చేపట్టడమే. స్వార్థం కోసం అవకాశవాద విధానాలను ప్రోత్సహించడమే. వారువేదికపై ఉపన్యాసాలకు, వారి జీవితంలో ఆచరణకుమధ్య అగాధమే. దానివల్ల ప్రజల్లో నాయకులపై విశ్వాసంసన్నగిల్లి పోతున్నది. విలువలు తగ్గిపోతున్నాయి. సమాజాన్ని ప్రభావితం చేయవలసిన నాయకుల్లో ఉన్న నీతిబాహ్య రాజకీయం వల్ల సమాజంలో క్రమశిక్షణా రాహిత్యం ఏర్పడింది. గాంధీజీ లాంటి మహా పురుషులు ప్రజల మధ్య లేక కేవలం చరిత్ర పురుషులుగా మిగలటమే ఈ క్రమశిక్షణా రాహిత్యానికి ప్రధాన కారణం. అయితే గాంధీజీ ఆశయాలు, ఆదర్శాలు, సిద్ధాంతాలు ప్రచారం అయిన రోజున వాటివల్ల ప్రజల ఆలోచన ధోరణుల్లో మార్పు రావటానికి అవకాశం ఉంది. గాంధీజీ సిద్ధాంతాలకు విశేషంగా ప్రచారం యిచ్చే ఉద్దేశ్యంతోనే గాంధీజీ స్మారకనిధి ఏర్పాటు చేశారు.

—శ్రీ సిద్ధాని నాగభూషణం

గాంధీజీ కీర్తిశేషులయిన తర్వాత డాక్టర్ రాజేంద్ర ప్రసాద్ అధ్యక్షతన గాంధీజీ స్మారకనిధి ఏర్పాటు చేయబడింది. అప్పట్లో ఈ స్మారక నిధికి యిచ్చిన పిలుపు వల్ల 11కోట్ల రూపాయల నిధి ప్రోగయింది. ఈ నిధికి తరతమ భేదాలు లేకుండా పేదలు, ధనికులు కూడా ఇచ్చారు. ఈ నిధిని ఖర్చు చేసి కార్యక్రమాలు నిర్వహించటానికి జాతీయస్థాయిలో ఒక ట్రస్ట్‌బోర్డు ఏర్పాటు అయింది.






అవనిగడ్డ గాంధీ క్షేత్రంలో శిక్షణ శిబిరం

ఈ నిధిని గాంధీజీ నిర్మాణ కార్యక్రమాలను నిర్వహించటానికి, ప్రోత్సహించటానికి ఖర్చు చేయటానికి నిశ్చయించింది.

రాష్ట్రాలలో కూడా ఏరాష్ట్రానికి-ఆరాష్ట్రం, కార్యకలాపాలు చూపటానికి గాను ఒక సంచాలకుడిని, వానితోపాటు ఒక సలహా సంఘాన్ని నియమించింది. ఆంధ్రప్రదేశ్ అప్పట్లో రెండు రాష్ట్రాలుగా ఉన్న కారణంగా ఇద్దరు సంచాలకులు నియమించ బడ్డారు. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తర్వాత ఒక సంచాలక్ నియమించ బడ్డారు. 1958 తర్వాత సలహా సంఘాలకు బదులు రాష్ట్ర సంఘాలు వచ్చాయి. అప్పట్లో సంచాలకులుగా పనిజేసిన వారిని ఆ రాష్ట్ర సంఘ కార్యదర్శిగా నియమించారు మొదట్లో ఈ గాంధీస్మారక నిధికి ఆంధ్రప్రాంతానికి సంచాలక్‌గా అమరజీవి పొట్టి శ్రీరాములు గారు పనిచేశారు. హైదరాబాద్ విభాగానికి ప్రప్రథమ అధ్యక్షులుగా శ్రీరూత్ పని జేశారు తర్వాత శ్రీ కె శ్రీనివాసరావు, శ్రీ ఎస్ రామారావు పని జేశారు సమైక్య ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర గాంధీ స్మారక నిధికి సలహా మండలి ఏర్పాటు అయింది. ఆ సలహా మండలికి ప్రముఖ గాంధేయవాది శ్రీ కోదాటి నారాయణరావుగారు కార్యదర్శి ఈ స్మారక నిధికి సలహా మండలి అధ్యక్షులుగా శ్రీ కె. కోదండ రామరెడ్డిగారూ, అధ్యక్షులుగా డాక్టర్ కె. ఎల్ రావు, డాక్టర్ వెంపటిసూర్యనారాయణ, శ్రీయుతులు సి వి. చారి, సి. హెచ్. చంద్రమౌళీశ్వరరావు, టోకర్సీలాల్‌జీ కపాడియా, ఆర్. కె. రామ్. రాధాకృష్ణయ్య, మహమ్మద్ జయునుద్దీన్ బీన్, శ్రీమతి విద్యాదేవిగార్లు సభ్యులుగా నియమించ బడ్డారు ప్రస్తుతం రాష్ట్ర సంఘాలు స్వయంప్రతిపత్తి కలిగినవి. కేంద్ర గాంధీ స్మారకనిధి కేవలం సమన్వయసంస్థగా పని జేస్తున్నది. రాష్ట్ర సంఘాలకు సలహాలు ఇవ్వడం దాని ప్రధాన బాధ్యత.

రాష్ట్రం మొత్తం మీద 13,45,972 రూపాయలు ఈ నిధికి వసూలు అయ్యాయి. హైదరాబాద్‌కు ఇచ్చిన నిధులు 5,28,797 రూపాయలు దానిలో 3,49,062 రూపాయలు కేంద్రనిధికి బదిలీ చేయగా, మిగతా 15,25,706 రూపాయలు రాష్ట్ర నిధి ఉంది.

గాంధీ స్మారక నిధి కార్యక్రమాల గురించి సుప్రసిద్ధ గాంధేయ వాది శ్రీ కోదాటి నారాయణరావుగారిని అడిగినపుడు గాంధీ స్మారక కార్యక్రమాల గురించి వివరిస్తూ "ప్రారంభంలో గాంధీ స్మారకనిధి నిర్మాణ కార్యక్రమాలు నిర్వహించే సంస్థలకు ఆర్థిక సహాయం సాంకేతిక సలహాలు యిచ్చింది. తర్వాత కొన్ని ఎన్నిక చేసిన గ్రామాలలో గ్రామీణాభివృద్ధి కేంద్రాలను ఏర్పాటుచేసి గ్రామ సేవకులను నియమించింది. ఈ కార్యకర్తలు గ్రామీణాభివృద్ధి కార్యక్రమాల్లో సుశిక్షితులైనవారు కొన్నాళ్లు అనుభవం సంపాదించిన తర్వాత ఒక్కొక్క కేంద్రంలో ముగ్గురు చొప్పున గ్రామసేవకులను నియమించి కేంద్రీకృత ప్రాతిపదికపై కార్యక్రమాలను నిర్వహించింది తెలంగాణా ప్రాంతంలో శివరాంపల్లి, నార్కట్నాలు, రాయలసీమ ప్రాంతంలో చాగలమర్రు, వెంకటపతిరాజు ఖండ్రిక, ఆంధ్రప్రాంతంలోని పెనుమలూరు. తాడువాయి గ్రామాలలో గ్రామ సేవా కేంద్రాలు పనిచేస్తుండేవి. తర్వాత పొన్నాల, నరాపురం అగ్రహార- గ్రామాలలో సేవా కేంద్రాలను నెలకొల్పి









గాంధీ సాహిత్య ప్రచురణాలయం

పోలవరం, చాగళ్ళ గ్రామాలలోఉన్న గాంధీజీ ఆశ్రమాల్ని గాంధీజీ స్మారక నిధి తీసుకొన్నది" అన్నారు

శ్రీ నారాయణరావుగారు కార్యక్రమాలను వివరిస్తూ ఇలా అన్నారు :

నాగర్‌కర్నూలు కేంద్రం జపాను వరిసాగు వ్యవసాయ పద్ధతుల ప్రచారాన్ని చేపట్టింది తర్వాత ఖాదీ పనిని కూడా నిర్వహించింది శివరాంపల్లి కేంద్రంలో పారిశుధ్య కార్యక్రమాన్ని, నీళ్ళు ఇంకిపోయే గొయ్యిలు తవ్వటం మొదలయిన కార్యక్రమాలను, పంటఎరువు తయారీని కూడా ఈ కేంద్రం చేపట్టింది నాగిలమర్రిలో కూడా ఖాదీపనిని నిర్వహించింది. "గాంధీఘర్" అనే భవనాన్ని నిర్మించింది. వెంకటపతిరాజు ఇంద్రిక కూడా వ్యవసాయాన్ని ఆధునిక పద్ధతులకై చేపట్టేటట్లు కృషి చేసింది పెనుమలూరులో కూడా ఖాదీపనిని నిర్వహించింది. హిందీ తరగతులుకూడా నిర్వహించింది ఈ కేంద్రంలో ఒక భవనాన్ని కూడా నిర్మించింది

"తాడువాయి" కేంద్రం భూదాన ఉద్యమంవల్ల మిగిలిన 80 ఎకరాలను హరిజనులకు పంపిణీ చేసింది తర్వాత దంపుడుమిల్లు ఏర్పాటు చేసింది పొన్నాలగ్రామంలో కేంద్రం పారిశుధ్య విషయాల్లో కార్యకర్తలకు ప్రాంతీయ పారిశుద్ధ్య విద్యాలయం ఇచ్చింది. 1965 సంవత్సరం తర్వాత గాంధీ స్మారక నిధి కార్యకర్తలు 13 గ్రామాలలో గ్రామసర్వే కార్యక్రమాన్ని నిర్వహించారు 1966 సంవత్సరంలో మహబూబ్‌నగర్‌లో జరిగిన నిర్మాణ కార్యకర్తల మహా సభలో 300 మంది పాల్గొనేటట్లు ప్రోత్సహించారు. ప్రాథమికోన్నత పాఠశాలను ఖమ్మంజిల్లాలో కరకగూడెంలో ఏర్పాటు చేయడానికి దోహదం చేసింది గాంధీ స్మారక నిధి

నల్లగొండజిల్లాలో 0 రోజులపాటు పాదయాత్రను సర్వోదయ ఆశ్రమం సహకారంతో ఈ నిధి నిర్వహించింది 1969వ సంవత్సరంలోకూడా కొంతమంది కార్యకర్తలు ఆంధ్రప్రదేశ్ అంతటా పర్యటించారు ఈ పర్యటనల సందర్భంగా జాతీయ సమైక్యత గురించి ప్రజలకు ఉద్బోధించారు

గాంధీజీ శతజయంతి ఉత్సవాల సందర్భంగా బాపూజీ నిర్మాణ కార్యక్రమాన్ని గౌరవ ప్రాతిపదికపై నిర్వహిస్తూ గ్రామీణ కేంద్రాలను నిర్వహించగలిగేవారికి ఈ కేంద్రాలను దత్తంచేసింది. నర్సాపురం అగ్రహారంలో కేంద్రం పొందూరు సాజ్యం ఖాదీ కార్మిక సంఘానికి వప్పచెప్పింది చాగల్లు, నాగలమర్రి కేంద్రాలలో పాఠశాలలను నిర్వహించే బాధ్యత వప్పజెప్పబడింది పెనుమలూరు, కార్వేటినగరం, పొన్నాల కేంద్రాలు వరుసగా శ్రీ ఐ.ఎస్ ఆర్. మూర్తిగారికి, శ్రీ సుబ్రహ్మణ్యంరెడ్డిగారికి, శ్రీ అరిగే రమానందం గారికి వప్పజెప్పబడ్డాయి వారు ఈ కేంద్రాలను చూస్తూ గాంధీజీ



గాంధీ జ్ఞాన మందిరం







గాంధీ బుక్ హౌస్ విక్రయ కేంద్రం

నిర్మాణకార్యక్రమాలను అమలుజేస్తున్నారు పెనుమలూర్‌లో శ్రీ ఐ ఎస్ ఆర్. మూర్తి ప్రకృతి ఆశ్రమాన్నికూడా నిర్వహిస్తున్నారు.

ఈ గాంధీ స్మారక నిధి కార్యాలయంలో పని జేస్తున్న శ్రీ రంగారావుగారు గాంధీజీ సిద్ధాంతాలను ఏ విధంగా ప్రచారం చేస్తున్నదో వివరిస్తూ ఇలా అన్నారు. "గాంధీజీ సిద్ధాంతాల ప్రచారం కోసం పుస్తకాల ప్రచురణకు నిశ్చయించి, ప్రఖ్యాత రచయితలతో కూడిన ఒక సంపాదకవర్గాన్ని ఏర్పాటు చేసింది గాంధీజీ సాహిత్యాన్ని లాభనష్టాలులేని ప్రాతిపదికపై ప్రచురించడానికి లక్ష రూపాయల నిధిని ఏర్పాటు చేసింది 1959 సంవత్సరంలో కాకినాడ కేంద్రంగా ఈ ప్రచురణాలయం ప్రారంభమయింది. మొదట్లో శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు ఈ ప్రచురణలకు ఆధ్వర్యం వహించారు తర్వాత శ్రీ ఎమ్ వి. కృష్ణారావుగారు ఈ ప్రచురణల సంఘానికి అధ్యక్షత వహించారు. 20 పుస్తకాల ప్రచురణ తర్వాత ఈ ప్రచురణల కేంద్రాన్ని హైదరాబాద్‌కు తరలించారు. ఇప్పటివరకు 111 పుస్తకాలను ప్రచురించింది. సుమారు రెండు లక్షల రూపాయల విలువగల గాంధీ సాహిత్యాన్ని ఇప్పటి వరకు అమ్మింది "

శ్రీ కోదాటి నారాయణరావుగారు గాంధీ సిద్ధాంతాల ప్రచారం కోసం జరిగిన కృషిని తెలుపుతూ "గాంధీ సాహిత్యాన్ని కలిగిన ఒక గ్రంథాలయాన్ని ఏర్పాటు చేసింది ఈనాడు 2979 పుస్తకాలు ఉన్నాయి. ఈ గ్రంథాలయాన్ని ప్రతీరోజు 70 మంది సందర్శిస్తున్నారు. 20 మందైనా కనీసం పుస్తకాలు చదివే విషయంలో సంప్రతిస్తూ ఉంటారు. గాంధీ దర్శనం అనే ఒక ప్రత్యేక ఫోటోల ప్రదర్శన కూడా ఏర్పాటుచేశాం. ఆ ఫోటోల ప్రదర్శనను ప్రతిరోజు 50 మందైనా సందర్శిస్తూఉంటారు. పుస్తకాల విక్రయశాలను కూడా ఏర్పాటు చేశాం".

ఆంధ్రప్రదేశ్ నడి బొడ్డున విజయవాడలో జాతిపిత గాంధీజీ స్మారక చిహ్నాన్ని నెలకొల్పాలని నిర్ణయించి గాంధీ పర్వతంపై 18 ఎకరాల స్థలాన్ని సేకరించి గాంధీజీ జీవితానికి సంబంధించిన పుస్తకాలను వివరించే పుస్తకాలను సేకరించి ఆ ప్రదేశంలో ఒక గ్రంథాలయాన్ని నెలకొల్పింది గ్రంథాలయ భవనాన్ని నిర్మించింది గాంధీ స్థూపాన్ని నిర్మించింది గాంధీ పర్వతంపై స్థూపం చుట్టూరా తిరగటానికి గాను ఒక పిల్లల రైలును ఏర్పాటు చేయడమయింది ఈ గాంధీ పర్వతం విశేషంగా జనాన్ని ఆకర్షిస్తున్నది. ఈ గాంధీ స్థూపాన్ని నిర్మించడానికి గాంధీ స్మారక నిధి లక్ష రూపాయల విరాళం యిచ్చింది. విద్యాశాఖ సహకారంతో గాంధీ స్మారక నిధి స్వాధ్యాయ సమితిని స్థాపించి హిందీ విద్యావ్యాప్తికి దోహదం చేస్తున్నది ప్రారంభిక, ప్రాథమిక పరీక్షలకు 500 మందిని పంపించింది ఆంధ్ర ప్రదేశ్ గాంధీ స్మారక నిధి తీసుకున్న చొరవవల్ల హైదరాబాద్‌లో హరిజన మహాసభలను ప్రభుత్వం నిర్వహించి "హరిజన సమాచార్" అనే మాసపత్రికను నెలకొల్పిరి. ఈ విధంగా బలహీన వర్గాల ప్రజలకు సేవ చేస్తున్నది. మద్యనిషేధ కార్యక్రమం విస్తృత ప్రభావం కోసం తీవ్రంగా ఈ సంస్థ కృషి చేసున్నది

గాంధీజీ తత్త్వ ప్రచారం కోసం విశాఖపట్టణం, హైదరాబాద్, తిరుపతి నగరాల్లో, వరంగల్, కాకినాడ పట్టణాల్లో కేంద్రాలు ఏర్పాటు చేసి, నిర్వహించింది. ఈ కేంద్రాలలో విద్యార్థుల, యువకుల సమావేశాలు గోష్ఠులు నిర్వహించి గాంధీజీ సందేశాలను, సిద్ధాంతాలను విశేషంగా ప్రచారం చేసింది. గాంధీజీ శతజయంతి ఉత్సవము గాంధీ స్మారక నిధి ఆధ్వర్యాన ఆంధ్రప్రదేశ్‌లో విజయవంతంగా నిర్వహించ బడింది.



గాంధీ స్మారక నిధి గ్రంథాలయం







ప్రస్తుతం గాంధీ స్మారక నిధి కార్యకలాపాల గురించి శ్రీ కోదాటి నారాయణరావుగారు వివరిస్తూ నాగరి లిపి ప్రచార సంఘాన్ని నెలకొల్పి నాగరి లిపి ప్రచారం కోసం కృషి చేస్తున్నది. దక్షిణ హిందీ ప్రచారసభ సహకారంతో అవనిగడ్డ గాంధీ క్షేత్రంలో రెండు రోజులపాటు గాంధీ సిద్ధాంతాలపై శిక్షణ ఇచ్చింది అన్నారు

సర్వోదయ విచార ప్రచార ట్రస్టు ఆధ్వర్యంలో నిర్మించిన గాంధీ జ్ఞాన మందిరంలో కార్యాలయం కలిగిన ఈ గాంధీస్మారకనిధి రాష్ట్ర స్థాయిలో నిర్మాణ కార్యక్రమాలలో పాల్గొనే స్వచ్ఛంద సంస్థల సమన్వయ సంస్థగా పని చేస్తుంది ఆంధ్ర ప్రదేశ్ సర్వోదయ మండలి, గాంధీ జ్ఞానమ దిర్ సహయోగి సంఘం, ఆంధ్ర ప్రదేశ్ భూదాన బోర్డు, ఖాదీ కమిషన్, హైదరాబాదు జిల్లా గ్రంథాలయ సంస్థ, ఆంధ్ర ప్రదేశ్ నిర్మాణ కర్యాకర్తల సంఘం, గాంధీ కస్తూరిబా సేవా సఘం మొదలైన సంస్థల కార్యకలాపాల నిర్వహణకు సహకారాన్ని అందజేస్తున్నది.

హైదరాబాద్‌లో గాంధీజీ సిద్ధాంతాలకు విశేష ప్రచారమిచ్చే మరొక గాంధీ శాంతి సంఘం. ఈ సంఘానికి గౌరవ కార్యదర్శిగా శ్రీ ఎమ్ ఎల్. నరసింహారావుగారు. గాంధీ సిద్ధాంతాలకు ప్రచార మిచ్చి అశాంతి, అల్లకల్లోలం లేకుండా సమాజాన్ని శాంతి యుత పంథాలో నడిపించటం, గాంధీ జీవన విధానాన్ని ప్రోత్సహించటం గాంధీ శాంతి యుత పంథాని అన్ని వేళలా సంఘంలో ఏర్పడిన అనుమానాలను, అపోహలను వైషమ్యాలను అనర్థాలను తొలగించటానికి ఉపయోగపడతాయనే విషయాన్ని నిరూపించటం ఈ సంఘ ఆదర్శాలని వివరించారు శ్రీ ఎమ్. ఎల్. నరసింహారావుగారు.

విద్యార్థులలో గాంధీ సిద్ధాంతాల అవగాహనకు గాంధీ పరిశీలన కేంద్రాలను ఏర్పాటుచేసి నిర్వహించింది. ఒక పఠనాలయాన్ని కూడా నిర్వహిస్తున్నది. ప్రజలలో రాజకీయ విజ్ఞానాన్ని కలిగించటం 'వోటు' అనే విషయంపై ఒక కరపత్రాన్ని ప్రచురించింది. ఈ గాంధీ శాంతి సంఘం కేంద్రాలు హైదరాబాద్, విజయవాడ, తిరుపతిలలో ఉన్నాయి అవి సెమినార్లను నిర్వహిస్తూ ఉంటాయి. విద్యార్థులలో శ్రమ శక్తి పట్ల సేవాభావాన్ని కలిగించటానికిగాను విద్యార్థి శిబిరాలను తిరుపతి కేంద్రం నిర్వహించింది. హైదరాబాద్ కేంద్రముగా హైదరాబాద్‌కు 20మైళ్ళదూరంలో ఉన్న కొహెడా గ్రామంలో 1972 మే ఏడవ తేదీ నుంచి 13వ తేదీవరకు ఒకయువజన కార్యక్రమ శాంతి శిబిరాన్ని నిర్వహించింది. ఈ శిబిరంలో కొహెడా గ్రామం వరకు హరిజనులు విద్యార్థులు పాల్గొనిరి ఒకరహదారిని కూడా వేశారు.

కరపత్రాలతో పాటు రెండు సావనీర్లను కూడా ప్రచురించిరి ఎంతో సమాచారం ఉంది

గాంధీస్మారకనిధి గాంధీ శాంతి సంఘం ప్రెస్ ఫౌండేషన్ కార్యక్రమాల గురించి తెలుసుకొని ఆంధ్రప్రదేశ్‌లో కనీసం సమితి స్థాయిలో బ్రాంచీలు ఏర్పాటు చేసి క్రమశిక్షణతో శ్రమించి పని చేసే అలవాటును విద్యార్థులలో కలిగించవలసిన అవసరం ఉంది.



గాంధీ మ్యూజియం

గాంధీస్మారకనిధి కార్యదర్శి శ్రీ నారాయణరావుగారికి అడిగినపుడు ఒక్కొక్క పుస్తకం ఇదివరలో రెండు వేల ప్రతులు వేసేవారని ఇప్పుడు వెయ్యి ప్రతులు వేస్తున్నారని అన్నారు.

ఈ నాడు సమాజంలో అలుముకున్న స్వార్థం సంకుచితత్వం, అసహనం, అశాంతి భావాల బెడద తొలగాలంటే గ్రామ స్థాయిన గాంధీజీ ఆదర్శాల విస్తృత ప్రచారంజరగాలి. అందుకు కార్యకర్తలను తయారుచేసి కార్యక్రమానికి గాంధీజీ స్మారక సంఘం దీక్ష వహించాలి. ఆనాడే గాంధీజీ ఆశించిన ప్రియమైన సమాజం వస్తుంది.

---

## సచ్ఛీలం

మన విజ్ఞానం, వేద పఠన శక్తి, సంస్కృత భాషా పాండిత్యం, లాటిన్, గ్రీకు భాషల పరిజ్ఞానం.. ఒకటేమిటి, యిటువంటి వన్నీ వృథా, మన హృదయంలోని కల్మష నిర్మూలనకు దోహదం చేయకపోతే విజ్ఞానార్జన పరమలక్ష్యం సచ్ఛీల సంపాదనమే.

శీలవంతుడు ఏ స్థానంలోనైనా రాణిస్తాడు.

—గాంధీజీ





# విప్లవ వీరుడు అల్లూరి సీతారామరాజు - మల్లిక్

బొమ్మల సీరియల్

రామరాజు పశ్చిమ గోదావరి జిల్లా, భీమవరం తాలూకా మోగల్లు అనే గ్రామంలో 1897 జూలై 4 న. వెంకటరామరాజు, నారాయణమ్మగార్లకు జన్మించాడు. వెంకట రామరాజుగారు స్వతంత్ర భావాలుగల వ్యక్తి.

చదువుకుని బ్రిటిష్ ప్రభుత్వం క్రింద ఉద్యోగం చేస్తే బానిసత్వం అలవడుతుంది

ఆ కారణంగా ఆయన చదువుకు స్వస్తి చెప్పి రాజమండ్రికి మకాం మార్చి అక్కడ పెద్ద ఫొటోగ్రాఫరుగా పేరు సంపాదించాడు

నెమ్మదిగా వెంకటరామరాజు గారిలో స్వాతంత్ర్య పిపాస పెరిగింది. బ్రిటిష్ ప్రభుత్వం మీద అసహ్యం కలిగింది

నేను ఒక్కడినే ఏమి చెయ్యగలను? దేశాన్ని ఒక్క త్రాటిమీద నడిపించగల నాయకుడు కావాలి!!

ఆయన తన స్వాతంత్ర్యభావాలూ, విప్లవ బీజాలూ పసి బాలుడైన రామరాజు హృదయంలో నాటి, రామరాజు 8 వ. ఏట కలరావ్యాధితో స్వర్గస్థులైనారు.

తండ్రి మరణానంతరం రామరాజు ఎప్పుడూ సాయంత్రం బడి విడిచిపెట్టిన వెంటనే సముద్ర తీరానికో లేదా ఏ ఏకాంత ప్రదేశానికో వెళ్లి ఆకాశం వైపు చూస్తూ ఆలోచిస్తూ కూర్చునేవాడు

ఆంగ్ల విద్యను అభ్యసించడం అంటే ఎంతటి అయిష్టత ఉన్నా ఆ నాటి రాజకీయ సాంఘిక పరిస్థితులను అర్థం చేసుకోవడంకోసం కొంత వరకూ ఆ చదువు కావాలన్న సత్యం గ్రహించిన రామరాజు కాకినాడ పిఠాపురం రాజావారి కాలేజిలో మూడవ ఫారంలో చేరాడు.

పిఠాపురంరాజా కాలేజి

Mallik.

# బాల్యం - విద్యాభ్యాసం



కాకినాడలో రామరాజు చదువు సరిగ్గా సాగలేదు. 1912 వ. సంవత్సరంలో రామరాజు విశాఖపట్నం ఎ.వి.యన్. కాలేజీలో నాలుగవ ఫారంలో ప్రవేశించాడు. అక్కడ కూడా అతని చదువు సరిగ్గా సాగలేదు. అనుకున్నట్లే విశాఖపట్నంలో రామరాజు పరీక్ష తప్పాడు. దీనితో రామరాజును తన దగ్గరే పెట్టుకుని చదివించాలని నిర్ణయించుకున్నారు అతని పినతండ్రి రామకృష్ణరాజు గారు.

రామకృష్ణరాజు గారు రామరాజును విశాఖపట్నం నుండి తీసుకెళ్ళి నర్సాపురం టైలరు హైస్కూలులో చేర్పించారు




అక్కడ రామరాజు ప్రతీరోజు స్కూలుకు వెళ్ళేవాడు. కాని అతని మనసు మాత్రం చదువు మీద లేదు. బడిలో చెప్పే పాఠాలు వినడు.



ఇంటికి వచ్చిన తరువాత కూడా గదిలో ఏకాంతంగా కూర్చుని ఏదో ఆలోచిస్తుంటాడు.



రామరాజు ఒకటి రెండుసార్లు బడి ఎగ్గొట్టి సమీపంలో ఉన్న గ్రామాలకు పోయాడు. ఈ విషయంలో రామకృష్ణరాజు గారు రామరాజును మందలించారు




ఆత్మాభిమానంగల రామరాజు ఒకనాడు ఎవరికీ చెప్పకుండా ఇల్లు విడిచి వెళ్ళిపోయాడు. మళ్ళీ తన పినతండ్రికి అతను కనుపించలేదు



# యవ్వనం



కొన్నాళ్ల తరువాత రామరాజు తుని హైస్కూలులో ఐదవ ఫారంలో ప్రవేశించాడు. ఈ సంగతి తెలిసిన రామకృష్ణ రాజు గారు రామరాజు చదువుకోసం ఆ పాఠశాల ప్రధానోపాధ్యాయుడి పేర డబ్బు పంపుతుండేవారు. ఇక్కడా కూడా రామరాజు చదువు సరిగా సాగలేదు. స్కూలు ఎగ్గొట్టి తునికి సమీపంలో ఉన్న అరణ్యాల లోకి వెళ్లేవాడు.

ఎప్పుడూ ఏదో ఆలోచన! ఒకసారి కోపం వచ్చి హెడ్మాస్టరుగారు కొట్టారు.



అంతే... ఆ ది మొదలు రామరాజు చదువుకు స్వస్తి చెప్పి తుని నుండి ఎక్కడికో వెళ్లిపోయాడు. కొంతకాలం అతను ఎవ్వరికీ కనిపించలేదు. 1919-1920 సంవత్సరాల మధ్య కాలినడకన హిమాలయాల వరకు సంచారం చేశాడు.



ఆ కాలంలో రామరాజు కొన్ని విప్లవ రహస్య సమావేశాల్లో కూడా పాల్గొన్నాడు.



చివరకు రామరాజు విశాఖపట్నం చేరి అక్కడ తన స్నేహితుని యింట్లో కొన్నాళ్లు నివసించాడు. అతని స్నేహితునికి సీత అనబడే అందమైన చెల్లెలు ఉంది. అప్పుడప్పుడే యవ్వనంలో అడుగు పెడుతున్న రామరాజు ఆమె అందాన్ని ఆరాధించడం మొదలుపెట్టాడు.



వారిద్దరూ ఒకరినొకరు ప్రేమించుకున్నారు.




సీత కూడా రామరాజును ఏదో మహోత్తర కార్యాన్ని సాధించడానికి పుట్టిన కారణ జన్ముడిగా భావించింది.



# సీత మరణం

ఒకనాటి రాత్రి రామరాజు సీతమందిరంలో ప్రవేశించి తనప్రేమను వ్యక్తపరచాలని అనుకున్నాడు. తనను ఏకాంతంగా చూడగానే సీత పరుగెత్తుకవచ్చి కౌగలించుకుంటుందని అతను ఊహించాడు కాని అతను ఊహించిన విధంగా జరుగలేదు.
సీత రామరాజు కళ్లలోకి గుచ్చి గుచ్చి చూసింది

నువ్వు ఒక మహత్తర కార్యాన్ని సాధించాలని అనుకుంటున్నావు!.... నీకు ఇంద్రియ నిగ్రహం చాల అవసరం... దయచేసి నా గదిలోంచి బయటకు వెళ్లు రాజూ!...

రామరాజు ఆమె ప్రవర్తనను అపార్థం చేసుకున్నాడు

సీత ధనవంతుల బిడ్డ! నేను పేదవాడిని!! నేనంటే ఆమెకు ఇష్టం లేదు...

రామరాజు ఆత్మాభిమానం దెబ్బతిన్నది. అతను ఆ ఇల్లు విడిచి దేశాంతరం వెళ్లిపోయాడు! అతనినే ఆరాధిస్తున్న సీతకు మతిపోయింది

దీని కంతటికీ కారకురాల్ని నేనే... ఎంత పని చేశావే రాజూ!..

సీత దిగులుతో మంచం పట్టింది.. రోజురోజుకూ రామరాజుమీది బెంగతో ఆమె క్షీణించిపోసాగింది.

రాజూ... నన్ను క్షమించవూ?...

ఇంతలో రామరాజు దేశాటన ముగించి స్వగ్రామంలో ఉన్నట్లు తెలిసి సీత అన్నగారు రామరాజును వెంటనే రమ్మని కబురుపంపించాడు. రామరాజు తక్షణం విశాఖపట్నం వెళ్లాడుగాని అప్పటికే సీత ఆరోగ్యం పూర్తిగా క్షీణించిపోయింది. రామరాజును కళ్లారా చూసుకుంటూ సీత కన్ను మూసింది.

సీతమరణం రామరాజును చాల క్రుంగదీసింది. ఆమె జ్ఞాపకార్థం ఆమె పేరును తనపేరు ముందు కలుపుకున్నాడు రామరాజు

ఈ రోజు నుండి నేను ఒట్టి రామరాజును కాను!... సీతారామరాజును!!

Mallik.



# అస్పృశ్యత నివారణ

—శ్రీ రావినూతల శ్రీరాములు

"విద్యా వినయ సంపన్నే బ్రాహ్మణేగవిహస్తిని
శునిచైవశ్వపాకేచ పండితాస్సమదర్శినః"

పండితులైనవారి దృష్టిలో విద్యా వినయ సంపన్నుడైన బ్రాహ్మణునికిని చండాలునికిని భేదముండరాదని గీతా వాక్యము.

ఒకనాటి సమాజంలో కేవలం వృత్తిని బట్టి ఏర్పడిన కుల వ్యవస్థ, మూఢత్వం వలన కొన్ని శతాబ్దాలు అనర్థాలకు దారి తీసినవి.

ప్రారంభంలో ఏర్పడిన నాలుగు వర్ణములుగాక పంచము అనేదిది మరొకటి ఏర్పడి సంఘాన్ని క్రుంగదీయసాగింది. అస్పృశ్యులుగా నిర్ణయించబడిన పంచమకులస్థులు లోనైన అసమానత్వములు, అవమానములు అసంఖ్యాకములు.

విశ్వ విఖ్యాత పండితుడు డాక్టర్ అంబేద్కరు సైతమూ అస్పృశ్యుల కులానికి చెందినవాడై పడరానిపాట్లు పడవలసివచ్చినది.

ఆంగ్లపాలన ఆరంభము నుండి అస్పృశ్యులనబడిన వారి పరిస్థితి కొంత మెరుగైనను, సాంఘికమైన ఈ దురాచార నిర్మూలనకు ఎందరో మహనీయులు కృషిచేసియున్నారు.

అస్పృశ్యత శాస్త్రవిరుద్ధమని మొదటిసారిగా లోకానికి చాటిచెప్పిన మహనీయుడు కావ్యకంఠ గణపతిముని. 1920 సం॥లో జరిగిన నాగపూర్ కాంగ్రెసు వేదికనుండి ఏడు గంటలపై సంస్కృతమున ఈ సమస్యపై ఉపన్యసించి మాలవ్యా ప్రభృతుల ప్రశంసల నందు కున్నారు.

ఒకవైపు స్వాతంత్ర్య సమరంలో మునిగితేలుతూ కూడా సాంఘిక దురాచార నిర్మూలనకు నడుంకట్టిన మహనీయుడు మహాత్మాగాంధీ. ఆయన చేపట్టిన కార్యక్రమములలో అస్పృశ్యతా నివారణ ముఖ్యమైనది.

పంచములకు "హరిజన్" అని నామకరణము చేసినది యనయే, తాము నిర్వహించిన పత్రికకు "హరిజన్" అని పేరు పెట్టారు.

రాజ్యాంగ పరిషత్తులో ఈ అంశంపై డాక్టర్ అంబేద్కరు చేసినది చిరస్మరణీయమైనది. వీరికృషి ఫలితంగానే దేశమెల్లడనూ అస్పృశ్యత ఏ రూపములోనున్నప్పటికీ నిషిద్ధము అని భారత రాజ్యాంగం 19 వ నిబంధనలో రూపు దాల్చినది.

దీనికి అనుగుణముగానే అస్పృశ్యతా (నేరములు) చట్టం 1955 లో రూపొందింపబడినది. ఇటీవల ఆ చట్టాన్ని పౌర హక్కుల రక్షణ చట్టంగా మారుస్తూ సవరించారు. మరికొన్ని నిర్దిష్టమైన మార్పులు కూడా ప్రవేశపెట్టబడినవి.

అస్పృశ్యతానేరము, పోలీసువారంటులేకనే అరెస్టుచేయబడిన నేరంగా కొనసాగింపబడింది. ఈ నూతన చట్ట ప్రకారం అస్పృశ్యతా నేరములు రాజీచేసుకొనుటకు (Compoundable) వీలులేని నేరములుగా నిర్ణయింపబడినవి. ఈ నేరములకై నిర్దేశింపబడిన శిక్షలు సైతం హెచ్చించ బడినవి. జైలు శిక్ష, జరిమానా రెండు కూడా విధించుటకు వీలున్నది.

అస్పృశ్యతా నెపంతో ఏ వ్యక్తి చేతనూ ఊడ్పించుట, చెత్త తీసివేయమనుట మున్నగునవి అపరాధములుగా పరిగణింపబడును.

ఏ ప్రాంతము వారు అస్పృశ్యతను పాటించినా సామూహిక జరిమానా విధించుటకు ప్రభుత్వానికి ఈ చట్టంద్వారా అధికారం లభ్యమౌతున్నది.

అస్పృశ్యతా నేరముల క్రింద శిక్షించబడిన వారు రాష్ట్ర కేంద్ర శాసన సభ్యులు పోటీచేయుటకు అనర్హులుగా నిర్ణయింపబడినారు.

తాము అస్పృశ్యులుగా చూడబడుతున్నామని బాధచెందు వారికి తమ హక్కులు ఉద్ధరించుకొనుటకు ఉచిత న్యాయ సహాయంతో పాటు అన్ని సౌకర్యాలు రాష్ట్ర ప్రభుత్వం కల్పించవలసి యున్నది. ఇందు నిమిత్తం ప్రత్యేక కోర్టులు కూడా ఏర్పాటు చేయవచ్చు.

స్వాతంత్ర్య రజితోత్సవాల సందర్భంగా భారతప్రభుత్వం చేపట్టిన వివిధ కార్యక్రమాలలో హరిజనాభ్యుదయం ప్రధానమైనది.

బలహీనవర్గాల సర్వతో ముఖాభివృద్ధికి ప్రతి పంచాయతీ సమితిలోనూ ఒక గ్రామం ఎంపికచేయబడింది. వీటికి జయంతి గ్రామాలుగా నామకరణం చేశారు.

మన రాష్ట్రానికి సంబంధించి ఇలాంటి జయంతి గ్రామాలు 324 వున్నవి. పాకీ, ఊడ్పు మున్నగు అపరిశుభ్ర వృత్తుల వారికి







గృహాలు నిర్మించడం ఈ అభివృద్ధి కార్యక్రమంలో ప్రాముఖ్యం వహించింది.

ప్రభుత్వ పథకం ప్రకారం ఒక్కొక్క యింటికి 220 చ. అడుగుల స్థలం కేటాయిస్తారు. రూ. 2000 లు ఖర్చు అవుతుందని అంచనా. ఇలాంటి 1800 ఇండ్లు నిర్మించేందుకు కేంద్రం 36 లక్షల రూపాయలు మంజూరుచేసింది.

ఇంతవరకు 1[illegible]76 ఇండ్ల నిర్మాణం పూర్తి అయినది.

ఇటీవల కళాశాల విద్యార్థులు గ్రామాలలో హరిజన కాలనీలు దర్శించి జాతీయసేవా పథకం క్రింద పారిశుధ్య కార్యక్రమాలు నిర్వహించడం మంచి పరిణామం.

మన రాష్ట్రంలో 1976 ఏప్రిల్‌లో రాష్ట్రస్థాయి హరిజన మహా సభలు భారీ ఎత్తున నిర్వహింపబడి అస్పృశ్యతతో సహా హరిజనాభ్యున్నతికి గైకొనవలసిన చర్యలను గూర్చి తీర్మానాలు చేయబడినవి. వీటిలో 8 నుండి 10 తరగతి వరకు నిర్ణయింపబడే పాఠ్యగ్రంథాలలో అస్పృశ్యతను గూర్చి విధిగా ఉండాలనేది ఒకటి. ప్రభుత్వం ఈ సూచన మేరకు ఉత్తర్వులు కూడా చేసింది.

అస్పృశ్యత ఒక పాపం. అస్పృశ్యత ఒక నేరం. అస్పృశ్యత రాజ్యాంగ విరుద్ధం, అనే భావాలు భావి పౌరులలో దృఢంగా నాటుకొనాలి.

ప్రభుత్వం చట్టాలుచేసినప్పటికినీ న్యాయమూర్తులు అపరాధులకు శిక్షలు విధిస్తున్నప్పటికినీ, అస్పృశ్యత పూర్తిగా నిర్మూలింపబడటానికి ప్రజల హృదయాలలో మార్పురావలసి యున్నది.

హరిజనులకు నివేశనస్థలాలు వేరుగా కేటాయించి ప్రత్యేక కాలనీలు నిర్మించటంవల్ల ఈ సమస్య పరిష్కారంకాదని కొందరు భావిస్తున్నారు.

ఊరి మధ్యలో గల నివేశనస్థలాలు హరిజనులకు కేటాయించటం జరగాలని చాలా మంది కోరుతున్నారు.

ఇతర వర్ణాలవారు సహృదయంతో వారిని తమ మధ్యకు తీసుకోవాలనే భావం కలిగినపుడు ఇది సుసాధ్యమౌతుంది.

హరిజన తదితర వెనుకబడిన వారిలో కూడా ఆత్మ విశ్వాసం పెంపొంది తామెవ్వరికీ తీసిపోమనే భావం ప్రబలిన నాడు జాతి జీవనంలో వారు కలసిపోవటానికి అవకాశం కలుగుతుంది.

---

# గాంధీస్మృతి

భారతాంబ శృంఖలాలువిప్పి
భారతదేశ చరిత్రనుత్రిప్పి
ఆంగ్ల పాలకుల పారజేసి
స్వతంత్ర ధ్వజమెగురవేసి
నావు; నేడు॥

నీధ్యేయం మానవసేవ
మానవ సేవయే మాధవసే
నీ లక్ష్యం, స్వేచ్ఛనిల్పుటయె
నీకదియే దేవుని గొల్చుట॥
నీవు నడచిన శాంతిబాట
అదియే కోటిసూర్యుల కాంతిబాట
నీమ్రుడుమపు భాధలు
దారుణ దాస్యమునకు శోషణములు॥

నేడు

దీపం వెలిగించి
నీ నామం స్మరించితిమి
ఆరని దీపంబిది
ఆరరాని దీపంబిది
భారతీయుల ఆశాదీపంబిది,
కాశ్మీర్ మొదలు కన్యాకుమారి వరకు
వెలుగునిచ్చే ఐక్యతా దీపంబిది
నీ పవిత్ర భావస్వరూపంబిది॥

—శ్రీకూరెళ్ల రామనరసింగరావు





**సీరియల్ :**



# హరిజన వాడ

**— శ్రీ ఉన్నవ మదన మోహనరావు**

—22—

చివరకు కోటయ్యచేత బావికిగాను అయిదు వందలు ఇవ్వటానికి ఒప్పించారు పెద్దలు !

'ఊళ్లో పెద్దలంతా తలాఒక చెయ్యి వేస్తే బావి పని వెంటనే ప్రారంభించుకుంటాం !' అన్నాడు ప్రకాశం.

రమేశ్ నూటపదహార్లు వాగ్దానం చేశాడు.

చౌదరికూడ అంతే వాగ్దానం చేశాడు.

చివరకు పదిహేను వందలవరకు వాగ్దానాలు అయ్యాయి ! 'మంగ' పేరుమీద బావి ప్రతిష్టానికి నిర్ణయం జరిగింది.

ఈ వ్యవహారంనుంచి పూర్తిగా బయటపడేసరికి కోటయ్యకు నాలుగువేలదాకా అయ్యింది.

మంగి శవాన్ని ఊరేగింపుగా తీసుకెళ్ళారు.

గంగులుకిచ్చిన అయిదువందలూ మేనానికి, త్రాగుడుకి ఖర్చు అయిపోయింది !

త్రాగుడుకు ఖర్చుపెడుతున్న ప్రకాశం ఎంత చెప్పినా వినిపించుకోలేదు మంగి చనిపోయిన దుఃఖాన్ని త్రాగుడుద్వారా మర్చిపోయారు హరిజనులు !

ఊరంతా తిరిగి చందాలు వసూలుచేశాడు ప్రకాశం. దాదాపు రెండువేలు దాక వసూలయ్యాయి

వారం రోజులు తిరగకుండానే బావి త్రవ్వకం పని మొదలయింది.

వైశాఖమాసపు ఎండలు అవడంచేత ఉదయం పదిగంటలు తరువాత పని సాగటంలేదు వడగాడ్పులూ—సుడిగాలులూ కలిసి విలయతాండవం చేస్తున్నాయి ! పగలు గుడిసెలలోంచి బయటకి రావటానికి కూడా భయంగా వుంటున్నది.

రాత్రి పన్నెండు గంటలు దాటినా గాలి చల్లబడటం లేదు. గాలిలో మంటలు రేగుతున్నాయి !

అయినా బావిపని మాత్రం కుంటుపడకుండ సాగుతున్నది ! లక్ష్మి కూడ ప్రతిరోజు బావిదగ్గరకు వచ్చి పని చూస్తున్నది.

హరిజన కార్మికులు చొక్కాలు లేకుండా గోచీలు పెట్టుకొని త్రవ్వుతున్నారు. చెమట కాలువలు కడుతున్నారు. గడ్డపలుగు ఎత్తి ఎత్తి వేస్తున్నారు. ఆ దెబ్బలకు మట్టి దద్దరిల్లి పోతున్నది! పెళ్లలు విరిగి విరిగి పడి పోతున్నాయి! త్రవ్విన మట్టిని స్త్రీలు తట్టలలో పెట్టుకొని ఒడ్డుకు చేరవేస్తున్నారు. అందరూ హుషారుగా పాటలు పాడుతూ, కేరింతలు కొడుతూ పనిచేస్తున్నారు! ఆ సంతోషంలో శ్రమను మర్చిపోగలుగుతున్నారు,

ప్రకాశం బావి బాగా విశాలం గాను, లోతుగాను త్రవ్వించాలని నిశ్చయించుకున్నాడు. ఏ హరిజన వాడకు నీటి కరువు వుండ కూడదు!

వేసవి కాలం అవటం చేత బావిలోతుగా త్రవ్వవలసి వస్తున్నది.

వారం, పదిరోజులు గడిచే సరికి త్రవ్విన మట్టి చిన్న పర్వతంలా పెరిగింది







పది హేను రోజులకు గంగ దర్శనం ఇచ్చింది. పెద్ద జల పడది; జల చూసిన కూలీలు ఆనందంతో నాట్యం చేశారు!

ఆరోజుకు పని మాని వేశారు. హరిజన వాడంతా పండుగ జరుపు కొన్నది! వేటను బలి ఇవ్వాలిసిందే నన్నారు కూలీలు. ప్రకాశం ఇష్టం లేక పోయినా వాళ్ల ఆనందానికి తలవంచక తప్పలేదు.

పదిహేను రోజుల శ్రమను జనం మర్చిపోయారు. ఆరాత్రి తాగినమైకంలో లోకం మర్చిపోయారు!

ప్రకాశానికి బాధగానే వున్నది! వీళ్లు నిజంగా ఎంత అమాయకులు! అల్పసంతుష్కులు! పదిహేనురోజుల నుంచితక్కువ కూలి తీసికొన్నారు! కాని ఏం లాభం! ఈ రోజు మొత్తం ఖర్చుపెట్టు కున్నారు; ఎంత సంపాదించినా తాగుడుకు ఖర్చు అయిపోతున్నది!

మద్యపానం అనే వ్యాధి వీళ్లను పీడిస్తున్నది! అది వీళ్లను క్రమక్రమంగా క్షీణింప చేసే 'క్షయ' లాపట్టుకొన్నది!

నిజంగా మద్యం హరిజనుల పాలిట 'క్షయ' అనుకున్నాడు ప్రకాశం. ఊళ్లో రైతులెవరూ తాగరు! మరీ ధనవంతులు తాగినా విదేశీ మద్యం తాగుతారు! కాని కార్మికులు, ఇతర పేద ప్రజలను ఈ మద్యం ఆర్థికంగానూ, ఆరోగ్య విషయంగానూ నాశనం చేస్తున్నది!

ఈ మద్యపాన రాక్షసి నుండి పేదవాళ్లను రక్షిస్తే గాని మోక్షం లేదు.

ఆలోచనలతో ఎంతో రాత్రి గడిచినా నిద్ర పట్టలేదు ప్రకాశానికి!

ఎండాకాలం అవటం చేత అంతాఆరు బయటనే నిద్ర పోతున్నారు. చీకటిలో ఎవరో తన ఇంటి వెనుకకు వెళ్లినట్టు అనిపించింది.

'ఎవరది'? ప్రశ్నించాడు ప్రకాశం మంచం మీద పండుకొనే.

'నేనే, వెంకుల్ని' సమాధానం వచ్చింది.

మరోప్రశ్న వేయకముందే కనుమరుగై పోయాడు వెంకులు!

ఇంత రాత్రప్పుడు ఎక్కడికి వెళ్లుతున్నాడో! అనుకున్నాడు ప్రకాశం.

అర గంట గడిచింది!

ప్రకాశానికి అప్పుడే నిద్ర పట్టబోతున్నది!

ఇంతలో మంటలు లేచాయి! మంటలు! మంటలు....! జనం గగ్గోలు పెట్ట సాగారు!

కేకలు పెడబొబ్బలు వినబడ సాగాయి. క్షణంలో ప్రకాశం లేచాడు! తన ఇంటికే అంటుకున్నది నిప్పు!

అసలే ఎండాకాలం! తాటాకులు ఎండీ ఎండీ వున్నాయి! తేలికగా అంటుకున్నాయి! దానికి తోడు గాలి దేవుడు సహాయం చేస్తున్నాడు!



అందరూ తాగిన మైకం వదుల్చుకొని లేచేసరికే మంటలు హరిజన వాడను చుట్టుముట్టాయి!

పిల్లలు స్త్రీలు ఒకటే గోల! ఏడుపులు! ఆ ఏడుపుల మధ్య ఎవరి మనుష్యులు వాళ్ల వాళ్లు వున్నారో లేరో చూసుకోవటం తోటి పోయింది!

మంటలు ఆర్పటానికి నీళ్లు లేవు! కొత్తగా తవ్విన 'మంగ బావి' లో జల కన్పించిందేగాని లోతు తప్వలేదు! చేటలతో మట్టి ఎత్తి పోశారు! కాని లాభం లేకపోయింది! బొంగులు కాలి దీపావళి టపాకాయలలా 'ఠావ్! ఠావ్!!' అంటున్నాయి! ఒక్కొకసారి బొంగులు ఎగురుతూ వెళ్లి కొత్తచోట నిప్పు అంటిస్తున్నాయి!

అసలు నిప్పు ఎలా అంటుకున్నదీ ఎవరికీ అర్థం కాలేదు! వెంకాయమ్మ, లక్ష్మి కూడ సాయంకాలమే వంట ఇంట్లో నిప్పు ఆర్పి వేశామని గట్టిగా చెప్పుతున్నారు.

రెండు గంటలలో హరిజన వాడ యావత్తూ కాలి బూడిద అయిపోయింది.

ప్రాణనష్టం జరగలేదు, కాని కట్టు గుడ్డలు తప్ప ఎవరికీ ఏమీ మిగలలేదు!

హరిజనవాడలో రామదాసుకే వ్యవసాయం వున్నది. మిగిలిన వాళ్లంతా కూలి మీద బ్రతికేవాళ్లే! ముందుగా మంటలు రామదాసు ఇంటిలో లేవటంచేత ఒక్క వస్తువు కూడ కాపాడలేకపోయారు

మధ్య గదిలో గాదె నిండా ధాన్యం వున్నది. అంతా కాలి బూడిద అయింది.

అన్నిటికంటె బాధాకరమైనది బావి కోసం చందాలు పట్టి తెచ్చిన సొమ్ము పదిహేనువందల దాకా రూపాయలు కాలి మసి అయిపోయాయి!.

రామదాసు వేదాంతిలా శూన్యంలోకి చూశాడు! వెంకామయమ్మ స్పృహలేదు. సంవత్సరమంతా పొలంలో పని చేస్తే పండిన ధాన్యం మాడిపోయింది. ఇకనేం తినాలి?

ప్రకాశాన్ని పలకరిస్తే ఏడుపు ముంచుకొనివస్తున్నది. 'తన ఇంటితోపాటు బావి సొమ్ము కాలిపోయిందే' అనే బాధ ఎక్కువగా పీడించసాగింది ప్రకాశాన్ని!.

అసలు మంటలు ఎలా రేగాయో అర్థంకావటంలేదు లక్ష్మికి!

చివరకు కాలి పొగచూరిన మొండి గోడలు మిగిలినాయి. ఒకటిరెండు దూరంగా వున్న గుడిసెలు తప్ప మిగిలిన గుడిసెలన్నీ పరుశురామ ప్రీతి ఐనాయి.

ప్రకాశానికి ఎందుకో వెంకులమీద అనుమానం కలిగింది!

ఇంతలో తెల్లవారింది! సూర్యభగవానుడు క్రోధంతో ముఖం ఎర్రగా చేసికొని అగ్నిబాణాలు కురిపించసాగాడు లోకం మీద.

'ఆ రోజు రత్తి ఒక్కర్తే నీళ్లు తెచ్చుకోవటానికి బావికి వెళ్లింది! మధ్యాహ్నం అవటంచేత జనంలేరు ఎక్కడా!

(సశేషం)

# నేను సైతం గాంధీ దేవుని దర్శనంతో ధన్యుడనయ్యాను

—శ్రీ తిరుమల రామచంద్ర

అప్పుడే గాంధీజీ ఆఫ్రికానుంచి భారతదేశానికి వచ్చారు. ఆయన గొప్పదనం గురించి చిలువలు పలువలుగా చెప్పుకొంటున్నది జనం. భారత దేశ పరిస్థితులను ఆకళింపుకొనడానికి ఆయన పర్యటన ప్రారంభించారు. ఆయన అడుగు పెట్టినచోటెల్లా బ్రహ్మరథం పడుతున్నది జనం. తండోపతండాలుగా వచ్చి దర్శిస్తున్నది. ఆయనలోని అతిమానుష శక్తులేమిటో తెలుసుకోవాలని ఉవ్విళ్లూరుతున్నది; ఆయన ఊరు వదిలిన తర్వాత నెలల తరబడి ఆ ధ్యానంలోనే ఉంటున్నది.

ఆ పర్యటనతోనే గాంధీజీ బళ్ళారికి విచ్చేశారు. బళ్లారి పట్టణమే కాక బళ్లారి జిల్లా అంతా పెళ్లి పందిరిగా మారింది. జిల్లా ముఖ్యంగా బళ్లారి పట్టణం కలకల లాడింది. రాట్నాల తోరణాలతో, కాంగ్రెస్ త్రివర్ణ పతాకాలతో, గెలలున్న అరటి కంబాలతోను. నాకప్పుడు తొమ్మిదేళ్లనుకుంటాను— మా ఊరు కమలాపురం (హంపీ కమలాపురం) నుంచి మా తాతగారు మొదలైనవారు గాంధీ దర్శనానికి వెళ్లుతుంటే, నేనూ మారాం చేశాను వస్తానని. మా తాతగారు తిరుమల నరసింహాచార్యులు గారు మొదటి నుంచీ కాంగ్రెసు వాదులు. ఇంట్లో రకరకాల రాట్నాలు అరడజను నిత్యము ఆడేవి. ఆయన సపరివారంగా బెల్గాం కాంగ్రెసుకు పట్టు పీతాంబరాలతో, జింక చర్మం, తోలు సంచీలతో హాజరైన నైష్ఠికులు. సరే నా ఆసక్తి చూచి నన్ను వెంట పిలుచుకొని వెళ్ళడానికి అంగీకరించారు. నేను మహోత్సాహంతో వెళ్లాను.

‘ఆంధ్ర నాటక పితామహ’ రామకృష్ణమాచార్యుల బంగ్లా కాంపౌండులో గాంధీజీకి స్వాగతమివ్వడానికి ఏర్పాట్లు జరిగాయి. వాటినంతా తన్మయతతో చూస్తున్నాను. ఆంధ్ర నాటక పితామహుని కుమారులు, ఇంజినీర్లు అనంత కృష్ణమాచార్యులు, భోగీంద్రనాథ్ తెల్లటి ఖద్దరు దుస్తులతో చకచకా అటూ ఇటూ తిరుగుతూ ఏర్పాట్లు చేస్తున్నారు. గోల వేయవద్దంటున్నారు. గాంధీజీ అల్లంత దూరాన వస్తున్నారనగా కోలాహలం బయలుదేరింది. జనం బంగ్లా కాంపౌండులో క్రిక్కిరిసిపోయింది. పిల్లలమంతా జన సమ్మర్దానికి ఉక్కిరి బిక్కిరవుతున్నాము. సేవాదళ్ సైనికులు జనాన్ని సర్దుతున్నారు.

ఇంతలో గాంధీజీ ఏతెంచినారు. ఆయన అప్పటిదుస్తులు నాకు ఇంకా గుర్తు. కొల్లాయి గుడ్డ, పైన దుప్పటి కాదు; గుజరాతీ తలపాగా, గుజరాతీలు ధరించే లాడాలు బిగించిన చొక్కా, మెడ చుట్టూ ఉత్తరీయం, అందరితోపాటు నేను గంతులు వేశాను; ను జయ నినాదాలు చేశాను.



గాంధీజీ ప్రత్యేకంగా ఏర్పరచిన వేదిక అలంకరించారు. ఎవరో జ్ఞాపకంలేదు. స్వాగత వచనాలు పలికిన మీదట గాంధీజీ లేచి చేతులు జోడించి నిలబడి ఆంగ్లంలో ఏదో ప్రసంగించారు. రెండు చేతులూ చాచి— ఆయనవి పొడుగాటి చేతులు— జనసందోహాన్ని చూస్తూ ఏదో కోరారు. వెంటనే కరతాళ ధ్వనులతో తోసుకువచ్చారు. ఆడవాళ్లు; చేతులలోని బంగారు గాజులు ఊడదీసేవారు. మెడలలోని బంగారు దండలు వేస్తున్నవారు; చెవుల కమ్మల మరలు విప్పుతున్నారు— కనిపించారు. ఏదో నాటకం చూస్తున్నట్టు చూస్తున్నాను. వాళ్లంతా వెళ్లి వేదికముందు తమ వస్తువులు ఉంచారు; దేవాలయంలో దేవతకు సమర్పించినట్టు. గాంధీజీ వాటిలోని ఒక నగను తీసుకొని ఏదో ప్రసంగించారు. దాని సారాంశం మా తాతగారు చెప్పారు. ప్రతి వస్తువూ స్వాతంత్ర్య సాధనకు వినియోగ పడుతుందని ఆయన చెప్పినదానికి నాకు కొంత అర్థమయింది. కొంత అర్థం కాలేదు; మా ఊరు విజయనగర శిథిలాల శివారు గ్రామం గనుక, తరచు ఆ పాడు పట్నాన్ని హంపీ విజయనగర శిథిలాలకు పాడుపట్నం—హాళుపట్న—అని స్థానిక వ్యవహారనామం. చూడడానికి వచ్చే యాత్రికులను చూస్తుండేవాడిని గనుక, చిన్ననాటినుంచే రాట్నాల ఝుంకారాలు, స్వాతంత్ర్య సమర గాథలు వింటున్నవాడిని గనుక మా తాతగారు చెప్పిన దానిలో కొంతకు కొంత అర్థం చేసుకొన్నాను. అలా నగలు ఊడ్చినిలువు దోపిడి ఇచ్చినవారిలో మా బందుగురాలు, వరుసకు దూరపు పినతల్లి ఎర్రగుడి కమలమ్మ స్వరూపం నాకింకా జ్ఞాపకం ఉంది. బక్క పలచని ఎర్రనికోమల శరీరం, తెల్లవంగ పండు ఖద్దరు ‘మడిశారు’ చీరలో ధగధగలాడేది ఆమె. భర్త వకీలు ఎర్రగుడి శ్రీనివాసాచార్యులు. ఇద్దరూ కాంగ్రెసు భక్తులే. ఎర్రగుడి కమలమ్మ త్యాగాన్ని మా బంధువులలో పలువురు పలువిధాలుగా చిత్రించారు—కొందరు మహాగొప్పఅన్నారు కొందరు వట్టి ఆవేశమన్నారు; అడక్కుండా చేయకుంటా అధిక ప్రసంగమన్నారు. కొందరు. ఏమైతేనేం? కమలమ్మ, అలాటి మరి కొందరు మా బంధువులలో అగ్రస్థానంలోనే వుండిపోయారు.

తర్వాత నేను గాంధీజీని దర్శించింది హరిజనోద్యమ సమయంలో. అప్పటికే నేను చదువుమాని సత్యాగ్రహంలో చేరి ‘కారాగారానికి వెళ్లడం’ మద్రాసు కుట్ర కేసులో ముద్దాయి కావడం, పోలీ

(తరువాయి 42వ పేజీలో)





సీరియల్ :

# నిరాశలో నిండు గుండె

## —సి. ఆనందారామం

### జరిగిన కథ

శ్యామ్ తండ్రి జనార్దన్ వద్ద పెరిగిన సి. ఐ. డి. అధికారి మోహన్ లోటస్ హోటల్ యజమాని సాంబశివం చేస్తున్న దొంగ నోట్ల వ్యాపారం పట్టుకోవడానికి ప్రయత్నిస్తున్నాడు. ప్రసూన, చిరంజీవి మోహన్‌కు సహాయం చేస్తున్నారు. పరమేశ్వరి సహృదయుల సాయంతో కూలిపేటలో అనాథ సేవ చేస్తూంది.

శ్యామ్ దొంగతనం చేస్తుండగా తీసిన ఫోటోలను తనకిచ్చి అతన్ని వదిలివేయమని ప్రాధేయపడి మోహన్‌ను అక్రమ ప్రవర్తనకు గురిచేస్తాడు జనార్దన్. సుశీలను, శేఖర్‌ను ఎవరో హత్య చేస్తారు. లలిత ఆ శోకం భరించలేక స్మృతితప్పి పడిపోతుంది. ప్రసూన సాంబశివం యింటిని అంటి పెట్టుకుని వుండి సేవ చేసేందుకు అంగీకరిస్తుంది. లలిత సాంబశివాన్ని విడచి యిల్లు వదిలి పోతుంది. సాంబశివం ప్రసూనపై అభిమానం పెంచుకుంటాడు. ప్రసూన సాంబశివంపై వత్తిడి తెచ్చి అతడి దొంగనోట్ల ముద్రణ ఆచూకీ తెల్సుకోగల్గుతుంది. ఆధారాలు సంపాదిస్తుంది.

**27**

సంభాషణలన్నీ రికార్డ్ చేసిన వాచ్, ఫిల్మ్‌తో లోడయి ఉన్న కెమెరా మోహన్ ముందు పెట్టింది ప్రసూన....

అవి చూసి "ఓ!" అన్నాడు ఆశ్చర్యంగా....

"ఇవి చిరంజీవి కిచ్చి మీకు పంపించాలని అనుకున్నాను— కానీ చిరంజీవి కలవలేదు....నా దగ్గర ఇవి ఉంచుకొంటే ఆలస్యమైన కొద్దీ ప్రమాదం. ఆ కారణంగా నేనే తీసుకొచ్చాను...."

"థేంక్యూ వెరీమచ్! ఆ తాళం పెట్టిన మహా నాయకుడి ఇంట్లో దొంగ నోట్ల ముద్రణ జరుగుతోందనటానికి ఆధారాలు దొరికాయి. వెంటనే.........ఈ ఫిల్మ్ వెరిఫై చెయ్యగానే.. రేపే రైడ్ చేస్తాను .."

"నాకు మీరు థేంక్స్ చెప్పక్కర్లేదు — మీకు సహాయం చెయ్యాలని నేనేమీ చెయ్యలేదు. నా డ్యూటీ నేను చేసాను అంతే!"

ఎక్కడో మనసులో గుచ్చుకుంది మోహన్‌కి

"నాలో ఒకే ఒక్క బలహీనత ఉండేది-కృతజ్ఞతా బంధం నుండి విముక్తుణ్ని కాలేకపోయాను నా నిజాయితీ మీకు నిరూపించు కోగలిగే అవకాశం దొరికితే అదృష్టవంతుణ్ని......" అనుకున్నాడు మనసులో మోహన్....నవ్వి ఊరుకున్నాడు.

ప్రసూన కొంచెం సందేహిస్తూనే "సాంబశివం గారు పట్టుబడితే కఠిన శిక్ష పడుతుంది కాబోలు!" అంది...

"అతడు చేసిన, చేస్తోన్న నేరం సామాన్యమైనది కాదు. కాబట్టి శిక్ష కూడా సామాన్యంగా ఉండదు."

ప్రసూన వెక్కి వెక్కి ఏడ్చేసింది—నిర్ఘాంత పోయాడు మోహన్...... అతని మనసు కేదో చేదుగా తోచింది.

"నన్ను క్షమించండి! మీరు సాంబశివం గారిని ఇంతగా ..నిజంగా.. ప్రేమిస్తున్నారా?"

ప్రసూన కళ్ళు తుడుచుకుంది.

"ఏమో! నాకేమీ తెలియదు. లలిత గారు అన్నారు, నావి కాని తప్పులకు కూడా నేను బాధ్యత వహించవలసిందేనని ... వస్తాను."

నమస్కారం చేసి వెళ్ళిపోయింది ప్రసూన....

తన మనసులో వెన్నెలలు నింపే ప్రసూన ...... తను కనపడగానే చిరునవ్వుతో ముఖమంతా వెలిగించుకునే ప్రసూన ... ఎవరినీ లక్ష్య పెట్టకుండా సాంబశివం ఇంట్లో ఉండిపోయిన ప్రసూన ప్రాణాలను కూడా లక్ష్యపెట్టకుండా ఈ దొంగనోట్లకు సంబంధించిన ఆధారాలు సంపాదించిన ప్రసూన... సాంబశివానికి శిక్ష పడుతుందనగానే విలవిలలాడిపోయిన ప్రసూన... వెళ్ళిపోయింది.

వెళ్లి పోతున్న ప్రసూనను ఆపుచేసి ఎన్నెన్నో చెప్పాలనిపించింది. కానీ తనకే ఏదీ, ఎటూ అర్థం కావటం లేదు. ప్రసూనతో ఏమని చెప్పగలడు? చెప్పదలచు కున్నది-మాటలకు అతీతమైనది... ఈ పాటికి ప్రసూనకు అర్థంకాకుండా ఉంటుందా?

రైడ్‌కు అన్ని ఏర్పాట్లు చేసుకున్నాడు మోహన్.... ఫోన్ మోగింది ....

అవతలి వైపునుండి అతిసన్నగా ఊపిరిలేనట్లు "మోహన్!" అని వినిపించింది...





"ఎవరు ?"

"గుర్తు పట్టలేదా ? ఏడ్చి ఏడ్చి గొంతుకూడా పూడుకు పోయింది. చావు బ్రతుకులలో వున్నాను-ఒక్కసారి-చివరిసారి.... నాకు కనిపించవా ?"

"ఎవరు మీరు ?"

"ప్రసూనను ఒక్కసారి మిమ్మల్ని చూడాలి!....మీరు తలచు కుంటే నన్ను రక్షించగలరేమో : కానీ వద్దు : నాకు కనిపించి వెళ్ళి పోండి. చాలు !"

వెక్కి వెక్కి ఏడుపు ....

మోహన్‌కు మతి పోయినట్లనిపించింది.—ప్రసూన కంఠం వింటోంటే అప్పటికి ఎంత సేపటి నుండో ఏడుస్తున్నట్లని పించింది- అందుకే వెంటనే గుర్తు పట్టలేక పోయాడు.

"ఎక్కడున్నారు మీరు ?"

"ఎక్కడుంటాను ? సాంబశివం గారింట్లో ...."

"ఆల్ రైట్ : ఇప్పుడే వస్తున్నాను .. "

ఫోన్‌లో "వెంటనే వస్తున్నాను." అనేశాడు కాని వెంటనే కదల లేక పోయాడు మోహన్-కొద్ది క్షణాలలో రైడ్ చెయ్య బోతున్నాడు-ఇలాంటి పరిస్థితుల్లో సాంబశివం ఇంటికి వెళ్ళటం మంచిది కాదు. కానీ, ప్రసూన ఏ పరిస్థితుల్లో ఉందో ? అసలు మాట్లాడ లేక పోతోంది. కంఠం ఎక్కడో నూతిలోంచి విన పడుతున్నట్లుగా ఉంది. ఇంక ఆలోచించ లేక పోయాడు మోహన్....జేబులో పిస్టల్స్ పెట్టుకొని వెంటనే బయలు దేరాడు.

పనిమనిషిని 'ప్రసూన గది ఎక్కడ ?' అని అడిగాడు.... అది చూపించింది.

అతి జాగ్రత్తగా పరిసరాలు గమనిస్తూ లోపలికి అడుగు పెట్టాడు....ప్రసూన మంచంమీద పడుకుని ఉంది. వెక్కి వెక్కి ఏడుస్తున్న శబ్దం .... అది చూడలేక మంచం దగ్గరగా వచ్చి ముందుకు వంగి " ప్రసూనా !" అన్నాడు....

సరిగ్గా ఆక్షణంలో ఎక్కడినుండో పదిమంది మోహన్‌ను చుట్టుముట్టి కదలకుండా పట్టుకున్నారు.

ప్రసూన మంచంమీద పడుకున్న వ్యక్తి పూర్తిగా మోహన్ వైపు తిరిగింది. అది ప్రసూన కాదు.

జరిగిన మోసం అర్థమయింది మోహన్‌కు—ఈ మోసంలో ప్రసూనకుకూడా భాగం ఉందా ?

శత్రువుల చేతిలో చిక్కిన బాధకంటే ఎక్కువ బాధకలి గిస్తోంది ప్రసూన తనను మోసగించింది అనుకోవటం....

మోహన్‌ను ఒకకుర్చీలో పెట్టి కదలకుండా కట్టేసారు. అప్పుడు వచ్చాడు సాంబశివం .... మోహన్‌ను చూసి చిరునవ్వు నవ్వాడు.

" సారీ : మిస్టర్ మోహన్ : ఇంటికి వచ్చిన అతిథిని ఇలా సత్కరించ వలసి వచ్చింది .... మనకు టైంలేదు. త్వరగా తేల్చుకోవాలి : నాకు మీరంటే అభిమానమే కాని ఏ కోపమూ లేదు. మనం అందరమూ బ్రతికి బట్ట కట్టవలసిన వాళ్ళం — మీరీ రైడ్ ఆపెయ్యండి-ఇప్పుడు క్షణాలలో నేనేమి చెయ్యలేను — ఇందుకు ప్రతిఫలంగా మీరు కోరిన బహుమానమిస్తాను...."

" సారీ : నాకే బహుమానమూ అక్కర్లేదు — ఏపరిస్థి తుల్లోనూ ఈ రైడ్ ఆగదు — ఈ రాకెట్ విచ్ఛిన్నం కావలసిందే!"

"మరొకసారి ఆలోచించుకోండి : ప్రసూనను మీకిచ్చి పెళ్ళి చేస్తాను "

భగ్గున మండింది మోహన్‌కు.

"థేంక్స్: ఒకఆడదానికోసండ్యూటీ మానుకునేవ్యక్తినికాను"

సాంబశివం అదొక రకంగా నవ్వాడు.

" ఇప్పుడు ఈ పరిస్థితుల్లో చిక్కుకున్నది ఎవరి కోసమో!"

" అవును వచ్చాను. కానీ కేవలం ఒక ఆడదానికోసం కాదు."

" మరి........"

" చెప్పినా అది మీకు అర్థం కాదు...."

"పోనీయండి — ఇప్పుడు మమ్మల్ని కాదని మీరు తప్పించు కోలేరు. మీ ప్రాణాలు మాచేతుల్లో ఉన్నాయి...."

" నాప్రాణాలు పోయినా లక్ష్యం లేదు .... రైడ్ కొంచెం అలస్య మవుతుంది .... ఆధారాలు డిపార్టుమెంటుకు అందాయి. నేను కాక పోయినా మరొకరు రైడ్ చేస్తారు.... "

" ఆధారాలు : ఏమిటా ఆధారాలు ? దొంగనోట్లు ముద్రిస్తు న్నట్లుగా సంభాషణలు : వాని ఫోటోలు.... ఎవరో ఏమిటి ఎలా తెలుస్తుంది ? ఇక్కడ మీ ప్రాణాలు పోతాయి. రైడ్ ఆలస్యమవు తుంది. మాకు కాస్తా టైం దొరుకుతుంది. ఎక్కడి వాళ్ళు అక్కడ చెల్లా చెదరై పోతారు .... మీరు చెయ్యగల్గింది ఏమీ ఉండదు. మీ మీద అభిమానంతోనే ఇంతగా చెపుతున్నాను...."

" థేంక్స్ : నేను మీతో చేతులు కలపటం అసంభవం !"

" అయితే మీ ప్రాణాలు దక్కవు ! "

" దేనికైనా సిద్ధమే : "

" ఒ. కే. వన్, టూ, .... "

" సాంబశివంగారు : "

ఎక్కడి నుండో గావుకేక : మరుక్షణంలో ప్రసూన నడుస్తూ వచ్చి సాంబశివం కాళ్ళముందు పడిపోయింది.

పోలీసు డిపార్టుమెంటులో సాంబశివం తాలూకు వాళ్ళు ఉన్నారు. ఏలా అందాయో తెలియక పోయినా మోహన్‌కు ఆధా రాలు దొరికాయని సాంబశివానికి తెలిసిపోయింది.







రేఖ ద్వారా ప్రసూన చేసినట్లు మోహన్‌కు ఫోన్ చేయించాడు. సాంబశివం మాటకాదనలేక....ప్రసూన మోహన్‌ల మీద సహజంగా ఉన్న ఈర్ష్య కొద్దీ....'మోహన్ నిజంగా వస్తాడా' కుతూహలంచేత ... రేఖ ఫోన్ చేసింది. తీరా మోహన్ పట్టుబడి పోయేసరికి భరించలేక ప్రసూనకు చెప్పేసింది.

ఆ సమయంలో ప్రసూన వచ్చేసరికి షాక్ తగిలినట్లయింది సాంబశివానికి .... అయినా చలించలేదు.

"ప్రసూనా! లే ! ఇదినీకు సంబంధించిన విషయంకాదు.... నువ్వు కలిపించుకోకు !"

"నేను లేవను—మోహన్‌ను ఏమీచేయకండి-నా ప్రాణాలు తీయండి.... మోహన్‌కు ఎదైనా అపకారం జరిగితే నేను సహించను"

"లే" కఠినంగా అన్నాడు సాంబశివం....

"సాంబశివం గారూ ! మోహన్ కోసం నేను ఏమి చెయ్యడానికైనా సిద్ధంగా వున్నాను.... బ్రతికి ఉన్నంతకాలం మీకు బానిసగా, మీ ఉంపుడు కత్తెగా ఉండిపోతాను. మోహన్‌ను వదలండి...." సాంబశివం చేతిలోనుండి పిస్తోలు జారిపోయింధి.

"ఏమన్నావు?"

"మనసారా అంటున్నాను. మీకు ఉంపుడు కత్తెగా ఉండిపోతాను. మీకు అన్ని విధాలా ఆనందాన్ని...."

తనచేత్తో ప్రసూన నోరు గట్టిగా మూశాడు సాంబశివం.... కంపిస్తోన్న స్వరంతో అన్నాడు....

"సూనా ఇంక మాట్లాడకు! నువ్వు నాబిడ్డవు తల్లీ! నాకన్న బిడ్డవు... నేను నీకు తండ్రిని ! నీచేత నోరార 'నాన్నా' అని పిలుచుకోలేని స్థితిలో నన్ను నేను పెట్టుకున్న దౌర్భాగ్యుడిని."

## 28

సాంబశివం కూలి పేటలో మామూలు కూలినాలి చేసుకునే వాళ్ళలో ఒకరిబిడ్డ . ఎలాగో వీధిబడి చేరి అలా ఇలా చదువుకుని హైస్కూల్‌కి కూడా వచ్చాడు . అక్కడే అతనికి రామనాథం తోటి స్నేహమయింది. రామనాథం కుటుంబానికి దర్జా లెక్కువ. డబ్బు తక్కువ, ఆశలెక్కువ...రామనాథం ఎప్పుడూ పగటి కలలు కంటూ బ్రతికేవాడు. ఆ కలలన్నీ డబ్బుచుట్టూ ఉండేవి—పెద్దపెద్ద మేడలు కార్లు . విమానాలు....కులాసా జీవితం...రామనాథం స్నేహంతో సాంబశివానికి కూడా ఈ కలలు వంట బట్టాయి . దారిన పోయే కార్లవంక ఆశగా అసూయగా చూసేవాడు ..తనూ ఎలాంటి కారుకొనుక్కోవాలో పథకాలు వేసేవాడు పెద్ద మేడలను చూచినప్పుడల్లా అతనిలో రకరకాల భావాలు కలిగేవి....ఒక్కొక్కసారి ఆ మేడలు నిల్వునా కూల్చి వెయ్యాలనిపించేది. మరికొన్ని సార్లు ఆ మేడల్లో వాళ్ళందరినీ పీక నులిమి చంపేసి తను ఆ మేడలన్నీ ఆక్రమించుకోవాలనిపించేది. కొన్నిసార్లు తనకు ఆ అదృష్టం ఈ జన్మలో పట్టదని కృంగిపోయేవాడు మరికొన్ని సార్లు ఆమేడల్లో వాళ్ళని తలచుకుని అసూయతో దహించుకు పోయేవాడు .. ఇదంతా భరించలేనప్పుడు, తను అలాంటి మేడలో అందమైన దర్జా అయిన భార్యతో విహరిస్తున్నట్లు కలలు కనేవాడు, కటికనేల మీద పడుకుని...

రామనాథం కాపీలు కొట్టి పదో క్లాసు పాసయి కాలేజీలో చేరాడు. సాంబశివం కాపీలు కొట్టినా పదో క్లాసు దాటలేక పోయాడు. అప్పుడప్పుడు రామనాథం సాంబశివం కలుసు కొనేవారు....సాంబశివం ఏ కూలి పని దొరికితే అది చేసుకునేవాడు. పిడకలమ్ముకునే రాధమ్మకు సాంబశివానికి స్నేహం కలిసింది..... రాధమ్మ చక్కనిది. సాంబశివానికి రాధమ్మ అంటే ఇష్టమే, ఆ మాటల్లో కట్నాల సమస్య లేదు. ఇద్దరు పెళ్ళాడాలనే అనుకున్నారు.

రామనాథం ఎంత ప్రయత్నించినా ఇంటర్ దాటలేక పోయాడు — తరిగిపోతున్న ఆస్తి తరగని ఆశలూ, అతనిలో అశాంతిని కలిగించాయి. ఎలాగైనా తను గొప్పవాడయిపోవాలి. ఎలా ? ఏదైనా వ్యాపారం ప్రారంభించాలి ! అన్ని వ్యాపారాలలోనూ లాభసాటి వ్యాపారం రాజకీయాలని తోచింది. రాజకీయాలలోకి దిగాడు. అన్ని వ్యాపారాలకిలాగానే ఈ రాజకీయ వ్యాపారానికి కూడా పెట్టుబడి కావాలి.. అంతపెట్టుబడి రామనాథం దగ్గిరకూడా లేదు. ఆ సందర్భంలో కొందరు మిత్రులు డబ్బు సంపాదించటానికి రకరకాల సలహాలు చెప్పారు. అన్నింటిలో దొంగ నోట్ల ముద్రణ బాగా నచ్చింది. అంచేత ప్రారంభించటానికి కావలసినంత పెట్టుబడి రామనాథం దగ్గిర ఉంది. కానీ ఇలాంటివి ఒకళ్ళవల్ల అయ్యేవి కావు. సాంబశివాన్ని చేరదీశాడు-సాంబశివం సంతోషంతో ఒప్పుకున్నాడు-దొంగనోట్లు తయారయ్యాయి. అవి విరజిమ్మి ఇండ్లు కొన్నారు. రాజకీయరంగంలో రామనాథం పలుకుబడి సంపాదించుకున్నాడు. తను డైరెక్టుగా ఏ పదవికీ పోటీ చేయ్యకుండా నేపథ్యంలో ఉండి తనకు అన్ని విధాలా అనుకూలంగా ఉన్న కొందరిని పదవులలో నిలబెట్టాడు. ఇదే అతనికి ఎక్కువ లాభదాయకంగా తోచింది. అధికారంలో ఉన్నవారి అండదండలతో తన దొంగ నోట్ల వ్యాపారం నిర్విఘ్నంగా కొనసాగించుకుంటున్నాడు. ఆ నోట్ల సహాయంతో అధికారవర్గంలో పలుకుబడి సంపాదించుకుంటున్నాడు. ఆ దొంగ నోట్ల ముద్రణ జరుగుతోన్న ఇల్లు ఒక ప్రముఖ నాయకుడిది. నడిపిస్తున్నవాడు రామనాథం. అక్కడ ఉండి నిర్వహిస్తున్నది సాంబశివం. సాంబశివం చిన్నప్పటినుండే కలలు కంటోన్న జీవితం, అసంభవం అని ఆశలు వదులుకున్న జీవితం, అతనికి అందుబాటులోకి వచ్చింది. మేడ, కారు అన్నీ వచ్చాయి. మారిన ఈ దశలో అతడు రాధమ్మను భార్యగా చేసుకోలేకపోయాడు. రాధమ్మ ఘొల్లుమంది. అప్పటికే ఆవిడ గర్భవతి. సాంబశివం ఆలోచించాడు. ఆ ప్రాంతాలలో ఎవరికీ తెలియని హరిని తీసుకొచ్చాడు. అటు రాధమ్మకు కష్టం కలగకుండా, తన పరువు ప్రతిష్టలకు భంగంరాకుండా హరిని రాధమ్మకు నామమాత్రపు భర్తను చేశాడు. చీరలు, నగలు, డబ్బు ఇవన్నీ చూసి రాధమ్మ ఎక్కువగా గొడవ చెయ్యకుండా సర్దుకుంది. సాంబశివంలాంటివారు గొడవచేసినా లొంగిరు సరికదా, కోపగించుకుంటారు. సాంబశివం "నీ సంగతి నాకు తెలియదు పో !" అంటే తన గతేం కావాలి ? కూలిపేటలో ఏం ఉన్నా, ఏం లేకపోయినా, ఆచారాలకు, కట్టుబాట్లకు కొదవ లేదు. తనకు ఎక్కడా నిలవడానికి నీడకూడా ఉండదు....

సాంబశివం తరువాతి కోరిక దర్జాగా పదిమందిలో నా భార్య అని చెప్పుకోవటానికి చదువుకున్న అందమైన భార్య... లలిత





మనసును స్వాధీనం చేసుకోలేకపోయినా, తన డబ్బు సహాయంతో లలితకు భర్త కాగలిగాడు. ఇక సుశీల అతని కలలన్నీ ఫలించిన సజీవ ప్రతిమ.

రాధమ్మకు, ప్రసూనకు అతడు ఏవిధంగానూ తక్కువ చెయ్యలేదు. కానీ తమ రహస్యం బయటపడటానికి మాత్రం ఏ పరిస్థితుల్లోనూ ఒప్పుకునేవాడు కాదు. హరికోసం అన్నట్లు తనే రాధమ్మ దగ్గరకు వచ్చేవాడు, కాని రాధమ్మను ఏ పరిస్థితుల్లోనూ తన దగ్గరకు రానిచ్చేవాడు కాదు. ప్రసూనమీదకూడా అతనికి ప్రేమ తక్కువలేదు. కానీ అతనికి గర్వకారణం మాత్రం సుశీల. నలుగురిలో తన కూతురిగా పరిచయం చేసుకోగలిగినది, గర్వంగా తన కూతురు అనుకోగలిగినది, సుశీలనే గదా !

రాధమ్మను ఏనాడూ తన ఇంటికి రానీయకపోయినా లలితకు రాధమ్మ రహస్యం తెలిసిపోయింది. సాంబశివం తప్ప తాగి రాధమ్మను కలవరించేవాడు. అదిగాక హరి సాంబశివం లేని సమయంలో సూచనగా రాధమ్మ విషయం అందించాడు. ఎవరినో ప్రేమించడం-తనను పెళ్ళిచేసుకోవడం-తను ప్రేమించిన వ్యక్తికి తానే మరెవరినో భర్తగా చెయ్యడం ఈ నైచ్యమంతా లలిత భరించలేక పోయింది....

ప్రసూనను చూడగానే లలిత మనసులో రాధమ్మ కూతురనే భావంతో ఒక చికాకు కలిగేది. సుశీల ప్రసూనతో స్నేహంగా ఉండటం సహించలేకపోయింది. కానీ ఆ పసిమనసుల నిర్మలమైన స్నేహాన్ని తను తెంపలేకపోయింది. సుశీలకు తండ్రి గురించిన కథలు చెప్పలేకపోయింది. అడుగడుగునా లలితకు ఆవిడ సంస్కారమే అడ్డు తగిలింది.

ఆనాటివరకు అత్యంత రహస్యంగా ఉంచిన విషయాలన్నీ అప్పుడు తెలిశాయి ప్రసూనకు....అప్పటివరకు అయోమయంగా తోచిన విషయాలన్నీ అప్పుడు అర్థం కాసాగాయి ప్రసూనకు.... హరి ప్రవర్తన...తనను మరొకరికి తార్చగలిగే హరి నైచ్యం.... తనమీద సాంబశివం చూపించే ప్రేమ .... తన ఇష్టానిష్టాలతో నిమిత్తం లేకుండా సాంబశివంకోసం తన మనసును ప్రతిస్పందింపచేసే ప్రకృతి శక్తి....వీటన్నింటికీ మూలమేదో స్పష్టమయింది.

సాంబశివం తన కన్నతండ్రి! ఈ విషయం రహస్యంగా ఉంచటం వలన తను ఎన్ని నిందలపాలు కావలసి వచ్చింది ? బయటపెడితే మాత్రం, అది తనకు గౌరవప్రదమా ? అప్పుడు మాత్రం అవహేళనలను ఎదుర్కొనవలసినదే కదా !

'' నీ తలిదండ్రుల దోషానికి నువ్వు బాధ్యత వహించక తప్పదు'' అంది లలిత-ఇందుకేనా ?

పెళ్ళిలో ఏముంది ? అంటారు-అది కేవలం ఆచారం అంటారు...కాదు-ఎంతమాత్రం కాదు. సుఖసంతోషాలు వ్యక్తిగతమైనవే కావచ్చును. కానీ వాటికి ఫలితంగా లభించే సంతానం మాత్రం సమాజంలో ఒక భాగం-సంఘసమ్మతమైన వివాహ వ్యవస్థలో ఇమడని సంతానం సమాజంలో గౌరవప్రదమైన స్థానాన్ని పొందలేదు.

సాంబశివం తనే మోహన్ కట్లు విప్పాడు. "నాకీలోకంలో మిగిలినదంతా ప్రసూన మాత్రమే ! ప్రసూన కోసం నేను సరెండర్ అయిపోతున్నాను. అయినా, చివరిసారిగా మిమ్మల్ని హెచ్చరిస్తున్నాను. ఈ రాకెట్ విచ్ఛిన్నం చెయ్యగలిగారు కాని అసలు దొంగని పట్టుకోలేరు. ఆ ప్రయత్నం చెయ్యకండి-ఎంతమాత్రం లాభంలేదు" సాంబశివం పిస్టల్ అతని నుదట మీద పేలింది-కుప్ప కూలిపోయాడు....

రక్తపు మడుగులో పడిఉన్న సాంబశివం చివరిసారిగా ''సూనా! సుఖంగా ఉండు తల్లీ!'' అని కళ్ళుమూశాడు.

''నాకు బ్రతకటానికి ఆధారం కావాలి! నీ కోసం బ్రతుకుదామనుకుంటున్నాను-నన్ను బ్రతకనియ్యి '' అంటున్న సాంబశివం ఆర్తస్వరం ప్రసూన మనసులో మార్మోగింది.

బ్రతికి ఉండగా ఏనాడు సాంబశివాన్ని ''నాన్నా!'' అని పిలవలేకపోయింది. ఆ శవం పయిన ''నాన్నా''! అని ఆక్రోశిస్తూ వాలిపోయింది.

సాంబశివం మరణంతో ఆస్తి అంతా లలితకు వచ్చింది.

* * * *

సాంబశివం ఎన్నెన్నో అనుభవించాలనుకున్నాడు. అందుకోసం భగీరథ ప్రయత్నం చేశాడు. చివరకు సాధించాడు. కానీ అతడు అనుభవించినదేమిటి? జీవితానికి విలువ ఇంతేనా ?

జీవితం అశాశ్వతం అంటారు, కావచ్చు....కానీ అనంతంలోకి కరిగిపోయే ప్రతి క్షణమూ శాశ్వతమైన విలువను సాధించుకొనేదే ! ఏదీ శాశ్వతం కాదనటం ఎంత నిజమో, ఏదీ వ్యర్థం కాదనటంకూడా అంతే నిజం !

* * * *

ఎంత నిండుగా బ్రతుకుతోంది పరమేశ్వరి ! సుఖాలు అనుభవించింది. కష్టాలను ఎదుర్కొంది. కానీ ఏ క్షణంలోనూ తనసుతాను వంచించుకోలేదు. తన మనసుకు తాను విరుద్ధంగా ప్రవర్తించలేదు. అదృష్టవంతురాలు! అలాంటి అదృష్టం ఎంత గొప్పదో అందరూ అర్థంచేసుకోలేక పోవచ్చును కానీ, తను అర్థంచేసుకోగలదు.

తన డబ్బంతా పరమేశ్వరికి అప్పగించింది. ''ఇదంతా సమాజాన్ని దోచి సంపాదించినది. దీనిని సమాజంకోసమే వినియోగించు! మనుష్యులకు ఆత్మలుందేమాట నిజమయితే, సాంబశివం ఆత్మకు ముక్తి కలుగుతుంది!'' అంది.

''నువ్వేమయిపోతావ్ ?'' అంది పరమేశ్వరి.

''నేను నీతోనే ఉండిపోతాను. ఈ డబ్బుఉన్నా లేకపోయినా నువ్వు నన్ను వెళ్ళగొట్టవని నాకు తెలుసు !''

కన్నీళ్ళతో లలిత భుజంచుట్టూ చెయ్యివేసి దగ్గిరగా తీసుకుంది పరమేశ్వరి.

* * * *

దొంగనోట్లకు సంబంధించిన రాకెట్ విచ్ఛిన్నం కావటంతో మనాథం మరొక రాజకీయ నాయకుడి అండదండలతో మరొక రాకెట్ ఏర్పాటుచేసే ప్రయత్నంలో ఉన్నాడు.







అతడు ఎవరికీ దొరకడు—పోలీసులు విశ్వప్రయత్నంమీద పట్టుకుంటే అతనిక్రింద పనిచేసే సాంబశివంలాటి వాళ్ళను మాత్రమే పట్టుకోగలరు.

కొన్నికొన్ని రాజకీయ పరిస్థితులను సహించలేక విద్యార్థులు ఆందోళన లేవదీశారు —విద్యార్థినాయకుడు చిరంజీవి అరెస్టయ్యాడు

ఒకవైపు రామనాధానికి ఘనస్వాగతాలు....

మరోవైపు చిరంజీవి అరెస్టు....

రేఖకు మరొక హోటలులో ఉద్యోగం దొరికింది. శ్యామ్‌తో కలిసి ఆ ఊరికి బయలుదేరింది. ఏరోడ్రమ్‌లో అందరూ రేఖకు ఘనమయిన వీడ్కోలు ఇచ్చారు. జర్నలిస్టులు రకరకాల ఏంగిల్స్‌లో ఫోటోలు తీసుకున్నారు. అన్ని ఫోటోల్లోనూ రేఖ ప్రక్కన చిరునవ్వుతో శ్యామ్ నించున్నాడు.

*　*　*　*

మాలకు అందమూ ఆరోగ్యమూ అన్నీ హరించుకుపోయాయి. అయినా తిండి గడవక ఎవడో ఒకడు దొరక్కపోతాడా అని ఆకలి కళ్ళతో సినిమా హాలుదగ్గిర తచ్చాడుతూఉంటే పోలీసులు వ్యభిచార నేరంక్రింద పట్టుకున్నారు. విరగబడి నవ్వే మాలను చూసి దొంగ .... ! సిగ్గులేదు ! అని తిట్టుకున్నారు జనం.

ఒక్కసారి తన చుట్టూ కలయ జూసుకొని నిరాశతో క్రుంగిపోయాడు మోహన్.

''ఏం సాధించాను నేను? ఏం సాధించగలను? నేనొక్కడిని ఏం చెయ్యగలను ?''

ప్రసూన ధైర్యం చెపుతున్నట్లుగా మోహన్ భుజంమీద చెయ్యి వేసింది.

''పరమేశ్వరిగారి మాటలు గుర్తుచేసుకోండి ! మనం ఒక్కళ్ళమూ ఏం సాధించగలం, అని క్రుంగిపోకండి, ఎవరి మటుకు వారు చేయవలసింది చేయగలిగినంత చేస్తే చాలు ! లేవండి నడవండి !''

(అయిపోయింది)

---

(37వ పేజీ తరువాయి)

## నేను సైతం గాంధీ దేవుని...

సులు వెంటాడగా ఊరూరూ తిరగడం జరిగాయి. ఆ దేశదిమ్మరి దశలో హరిజనోద్యమంలో దూరాను పోలీసుల బారినుంచి రక్షణ కోసం. అప్పుడు గాంధీజీని దర్శించడమే కాదు, ఆయనతో పాటు దాదాపు రెండు మూడు వందలమైళ్లు పయనించే భాగ్యమూ లభించింది.

అదొక లక్కీ-ఛాన్స్: గాంధీజీ కోస్తాజిల్లాలు పర్యటిస్తున్నారు. బంకుపల్లి మల్లయ్య శాస్త్రిగారు ప్రసంగాలతో, మంగిపూడి వేంకట శర్మగారు తమ రచనతో శ్రోతలను హరిజనోద్యమం వైపు ఆకరిస్తున్న కాలమది. గాంధీజీ పర్యటన బృందంలో ఎవరి సిఫార్సుతోనో జ్ఞాపకంలేదు-బహుశా వావిలాల గోపాలకృష్ణయ్యగారి ద్వారా విశ్వదాత సిఫార్సుతోనో ఏమో-దూరాను. గాంధీజీ ప్రత్యేకమైన కారును ఇష్టపడలేదు. ఏదో పెద్ద వ్యానువంటి దానిలో పయనిస్తున్నాడు బృందంతో. అటునుంచి మద్రాసువైపు పయనం. రాత్రి పన్నెండు లోపుగా మద్రాసు చేరాలని ప్రయత్నం. దారిలో ఎన్నో సభలు సమావేశాలు. చాలవరకు అన్ని సంగ్రహంగానే. అయినా సమయం చాలడంలేదు. సూళ్లూరుపేట చేరాము. గాంధీజీ అడిగాడు ''మద్రాసు ఇంక ఎన్నిమైళ్లుంటుంది?'' అని. ''దాదాపు నలభై'' అని ఎవరో చెప్పారు. ''ఎంత సేపటిలో చేరగలము ?'' అని మరొక ప్రశ్న వేశారు గాంధీజీ. "ఎక్కువయితే గంట" అన్నారు ఎవరో. "అయితే నేను గంటసేపు నిద్రపోతాను." అన్నారు గాంధీజీ. అన్నారో లేదో కళ్లు మూసుకున్నారు రెండో నిమిషానికే గురకలు వినిపించాయి. అందరితో పాటు నాకు ఆశ్చర్యం కలిగింది. మద్రాసు పొలిమేర సమీపిస్తుండగా గాంధీజీ కనులు విప్పారు. "మద్రాసు చేరామా?" అని అడిగారు. మా ఆశ్చర్యం ఇనుమడించింది.

అవును. గాంధీజీ కర్మయోగి. కృష్ణభగవానుడు కర్మయోగంలో

తస్మాత్త్వ మింద్రియా ణ్యాదౌ
నియమ్య భరతర్షభ,
పాప్మానం ప్రజహిహ్యేనం
జ్ఞానవిజ్ఞాన నాశనం.

(మొదట ఇంద్రియాలను అదుపులో పెట్టుకొని, జ్ఞానాన్ని, ఆత్మీయతను చంపునట్టి కామక్రోధాలనే పాపసముదాయాన్ని మొట్టమొదటే మొదలంట నరికివేయి) అన్నట్టు బహిశ్శత్రువులను అంత శ్శత్రువులను జయించి, ఇంద్రియాలకంటె పరమైన మనస్సును, మనస్సు కంటె పరమైన బుద్ధిని, ఆ బుద్ధికన్నా పరమైన తత్త్వాన్ని గ్రహించిన జితేంద్రియుడు. కనుక ఆయనకు నిద్ర, జాగృతి చెప్పు చేతలలో ఉండక ఏమిచేస్తాయి-అనుకుని సంతృప్తి పడ్డాను.

మరి రెండేళ్లకు గాంధీజీ మద్రాసుకు వచ్చారు. అప్పుడు దాదాపు నెలరోజులు విడిశారు. ఆయన ప్రార్థనలలో ప్రార్థనానంతర సమావేశాలలో పాల్గొనే మహద్భాగ్యం కలిగింది. ఆ ఉపదేశాలు ఎంతవరకు నా మనస్సులో దూరాయి, హృదయంపై ఎంతవరకు నాటాయి అన్న సంగతివేరు. అధికారి తారతమ్యాన్ని బట్టి జ్ఞానదీధితులు వెలుగుతాయి. నీటిబిందువే ముత్యపు చిప్పలోపడితే ముత్యమవుతుందంటారు. మరినేను ముత్యపు చిప్పకానుగదా ! నా బోటి వాళ్లను గురించి భర్తృహరి చెప్పనే చెప్పాడు-కూపేపశ్య పయోనిధా వపిఘటో గృహ్ణాతి తుల్యం జలం అని.

ఏమైనా ఆ మహాయోగిని, మహానాయకుని, పురుషోత్తముని, లోకారాధ్యుని దర్శించి, అమృతవాక్కులువిని, సహచరించే భాగధేయం నాకూ కలిగింది. ఈ మూడు సన్నివేశాలను-మూడు రత్నాల లాగ, బౌద్ధుల త్రిరత్నాల లాగ మనఃపేటికలో భక్తితో దాచుకున్నాను ఇన్నాళ్లు. నేడు మీకు అర్పిస్తున్నాను. నాలాగే చిన్ననాడు గాంధీజీని దర్శించే మహారాజయోగం పొందిన సహృదయులు ఆనందించండి, దివ్యస్మృతులను మననంచేసుకోండి.





# శ్రీ అయ్యంకి వెంకటరమణయ్య సేవా నిరతి

—శ్రీ వెలగా వెంకటప్పయ్య

(గతసంచిక తరువాయి)

గ్రంథాలయ కార్యకర్తల కృషి క్రమబద్ధంగా ఉండవలెనంటే వారికి చక్కని శిక్షణ అవసరం. తొలిరోజులలోనే వెంకటరమణయ్యగారు యీ అవసరాన్ని గుర్తించి ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం పంతులుగారి ఆర్థిక సహాయంతో 1920 లో విజయవాడ, రామమోహన గ్రంథాలయంలో 20 మంది కార్యకర్తలకు మాసం రోజులు శిక్షణ శిబిరం నిర్మించారు గ్రామీణులకు, గ్రామీణ గ్రంథాలయాలకు సంబంధించిన పలు విషయాలు యిందు బోధించబడినవి. ఆనాడు ప్రసిద్ధులైన వేమవరపు రామదాసు పంతులు, కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు. ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్య, ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం పంతులు, నరసింహదేవర సత్యనారాయణ, ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, చెరుకువాడ నరసింహం పంతులు—వంటి ఉద్దండులు ఉపన్యాసకులు. ఈ శిక్షణతోబాటు ఆర్థికశాస్త్రం, రాజనీతి, ప్రపంచ చరిత్ర, వ్యవసాయం, సహకారం, శాస్త్రవిజ్ఞానం మొదలైన అనేక విషయాలు బోధించేవారు. దీని వలన గ్రంథాలయ కార్యకర్తలకు అనేక విషయాలపై ఒక అవగాహన ఏర్పడేది. మరికొన్ని విషయాలు చదివి తెలుసుకుందామనే ఉత్సుకత కలిగేది. గాడిద గంధపు చెక్కలు మోసినట్లు గ్రంథాలయ కార్యకర్త పరిస్థితి దిగజారకూడదు. చందనం అలదేవాడు తన రెండువ్రేళ్ళను గిన్నెలో ముంచి యితర్లకు వ్రాసినట్లు గ్రంథాలయ కార్యకర్త తాను అనేక విషయాలు తెలుసుకుంటేనే అడిగే వారికి కొన్నైనా చెప్పగలడు. ఈ దృక్పథం ప్రధానాశయంగా నాడు శిక్షణ జరిగేది. ఆ తర్వాత ఆంధ్ర దేశంలోని అనేక ప్రాంతాలలో శిక్షణ శిబిరాలు నిర్వహింపబడ్డాయి. వందలాది కార్యకర్తలు శిక్షణ పొందారు. ఉద్యమానికి అండగా నిలిచారు.

## గ్రంథాలయ శాసనం

గత శతాబ్ది తుదిపాదం నుంచీ తెలుగుదేశంలో గ్రంథాలయాలు పని చేస్తున్నప్పటికీ ప్రభుత్వం వీటి విషయం పట్టించుకోలేదు. గుర్తించలేదు. ఎట్టకేలకు దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులుగారి కృషి ఫలితంగా యీ గ్రంథాలయాలను గుర్తించి 1920లో కొంత గ్రాంటు మంజూరు చేసింది. చాలీ చాలని యీ గ్రాంట్లు గ్రంథాలయోద్యమ ప్రగతికి ఏ మాత్రం దోహదం చేయలేదు. గ్రంథాలయాభివృద్ధికి ఒక క్రమబద్ధమైన విధానం అవసరమని తొలినాటి నుంచీ అయ్యంకివారు ఆందోళన చేస్తూవచ్చారు. దీనికి అనుగుణంగా బ్రిటన్ గ్రంథాలయ శాసన ప్రగతిని ప్రత్యక్షంగా చూచివచ్చిన డాక్టరు రంగనాథన్‌గారు తయారుచేసిన గ్రంథాలయ చట్టాన్ని 1933 లో మద్రాసు శాసన సభలో ప్రవేశపెట్టబడి, కారణాంతరాల వలన శాసనంగా రూపొందలేదు. అప్పట్నుంచీ వెంకటరమణయ్యగారు సమగ్రమైన గ్రంథాలయ శాసనం కోసం కృషి చేస్తూ వచ్చారు. సౌత్ ఇండియన్ లైబ్రరీ ఫెడరేషన్ తరఫున పది మంది సభ్యులతో ఒక కమిటీని వేసినప్పుడు అయ్యంకివారు ప్రత్యేక శ్రద్ధ తీసుకుని కమిటీ తరఫున ముసాయిదా బిల్లు సిద్ధం చేయించి ప్రభుత్వానికి సమర్పించారు. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘం తరఫున పలుసార్లు విజ్ఞప్తులు పంపించారు. అనేక సభలలో తీర్మానాలు చేయించి ప్రభుత్వ దృష్టికి తీసుకువచ్చారు. ప్రజల ఆందోళనను గమనించి మద్రాసు ప్రభుత్వం 1948 లో మద్రాసు పౌర గ్రంథాలయ చట్టాన్ని రూపొందించింది. భారత గ్రంథాలయ చరిత్రలో నవ శకానికి అంకురార్పణ చేసింది.

## విప్లవ సాహిత్య ప్రచారం

చైనా రచయిత కిమ్ ఇల్ సుంగ్ అన్నట్లు "చదవందే ఎవరూ విప్లవ వాది కాలేరు. విప్లవ భావాలను ప్రచారం చేయలేరు." మన దేశంలో స్వాతంత్ర్యోద్యమ భావాలు ప్రజానీకంలో పాదుకొనాలంటే విప్లవ సాహిత్య ప్రచారం అవసరమని అయ్యంకి భావించి వాటి ప్రచురణ, ప్రచార భారం తమపై వేసుకున్నారు. ముట్నూరి కృష్ణారావు, ముదిగంటి జగ్గన్నశాస్త్రి గారలు దానిని అనువాదం చేసే బాధ్యత స్వీకరించారు. ఇందుకు వినాయక్‌రావు దామోదర్ సావర్కార్ రచన "ఇండియన్ వార్ ఆఫ్ ఇండిపెండెన్స్"ను "భారత స్వాతంత్ర్య సమరం" పేర తెలుగులోకి తేవడానికి నిర్ణయించబడింది. అయితే అది నిషిద్ధ గ్రంథం. ప్రజల్లో జాతీయభావాలు రేకెత్తిస్తున్నదని ఆ గ్రంథాన్ని ప్రభుత్వం నిషేధించింది. ఒక ప్రతికూడ లభించడం కష్టం. ఎలాగైతేనేం— వెంకటరమణయ్యగారు అతికష్టం మీద రాజమండ్రిలో గోటేటి శివరాం గారి వద్దనుంచి ఒక ప్రతి సంపాదించి మచిలీపట్నం చేర్చారు. ముట్నూరివారు డాక్టర్ పట్టాభిగారి సలహాతో తెలుగు చేశారు. దాన్ని వెంకటరమణయ్యగారు సైక్లోస్టయిల్ చేయించి, ఆరు భాగాలుగా కుట్టించి, రామమోహన గ్రంథాలయంలో భద్రపరచి రహస్యంగా కార్యకర్తలకు అందించేవారు. కొన్ని ముఖ్యమైన భాగాలను గొల్లభామ పాలడబ్బాలలో పెట్టి ఖైదీలకూ కూడా అందజేశారు. ఈ విధంగా ఎందరో సామాన్యులను ధీమాన్యులుగా, కార్యకర్తలను విప్లవ వీరులుగా తీర్చిదిద్దారు.

ఆంధ్రపితామహ మాడపాటి హనుమంతరావు గారు చెబుతూ ఉండేవారు, "ఏ వూళ్లో అయితే గ్రంథాలయం ఉందో అచట దేశం కోసం పరితపించే వ్యక్తి ఒకడున్నాడని." ఆ విధంగానే స్వాతంత్ర్యోద్యమ కాలంలో ప్రతి గ్రంథాలయం ఒక విప్లవ కేంద్రంగా పని







చేసింది. జాతీయోద్యమ దినాలలో అయ్యంకివారు రామమోహన గ్రంథాలయంలో "ఫూల్స్ క్లబ్" పేర ఒక విద్యాలయాన్ని స్థాపించారు. దీనికి నాయకుడు నోరి వెంకటేశ్వర్లుగారు. క్లబ్ సభ్యులందరు రాత్రిపూట సమావేశమయ్యేవారు. విప్లవ సాహిత్యం చదివేవారు. చర్చించేవారు. చర్చలు ఏర్పాటు చేసేవారు. పోలీసువారు వస్తే పిచ్చాపాటీలో ఉన్నట్లు నటించేవారు. కాని లోలోపల పరాయి ప్రభుత్వంపై క్రోధాగ్ని జ్వాలలు ప్రజ్వలిస్తూ విప్లవాగ్నికి ఆజ్యంపోస్తూ ఉండేవారు. నాటి సి. ఐ. డి. పోలీసులు సహితం వీరిని పిచ్చి వారి క్రింద జమకట్టారు. కొంత కాలానికి యీ క్లబ్ తరపున కౌరడా అనే పక్ష పత్రిక, ఎన్ని కరపత్రాలు ప్రచురింపబడ్డాయి. ప్రజలను స్వాతంత్ర్య సమరానికి సమాయత్తం చేశాయి.

## ఇతర ఉద్యమాలు

జాతీయోద్యమంలో ప్రత్యక్షంగా పాల్గొంటూ, పరోక్షంగా దానికి దోహదం చేస్తూ, సాంఘిక ప్రగతికి తోడ్పడే అనేక ఉద్యమాలకు చేయూతనిచ్చారు. 1922 నుంచి నేటి వరకు కాంగ్రెసుపార్టీ ఆదేశాన్ని అనుసరించి ఖద్దరునే ధరిస్తున్నారు. 1919లో శ్రీమతి అనిబీసెంట్ అఖిలభారత బాలభటోద్యమాన్ని ప్రారంభించినపుడు వెంకటరమణయ్యగారు ఆంధ్రదేశ విభాగానికి నాయకులుగా నియమితులైనారు. వీరి ఆధ్వర్యంలో సర్కారు, రాయలసీమ ప్రాంతాలలో 20 దళాలకు శిక్షణ ఇవ్వబడింది. వెంకటరమణయ్యగారు యీ శిక్షణలో కొత్త పద్ధతులు ప్రవేశపెట్టారు. వార్తలు పంపే సంజ్ఞలకు తెలుగు పదాలుపయోగించారు. కవాతు సంజ్ఞలకు హిందీ పదాలను ఉపయోగించి జాతీయ భాషా ప్రచారానికి మార్గదర్శకులయ్యారు. క్షత్రియ విధానంలో దుస్తులను ధరించారు. కృష్ణా, గోదావరి పుష్కరాల సందర్భంలో, కాంగ్రెస్ మహాసభల సందర్భంలో స్కౌట్ దళాల కృషి అపారమైనది.

కలసి బ్రతకడాన్ని సహకారం అంటారు. ఈ విధాన ప్రచార నిమిత్తం వెంకటరమణయ్యగారు 1928 లో విజయవాడలో గాంధీ కో-అపరేటివ్ అర్బన్ బ్యాంకు స్థాపించి దానికి తొలి అధ్యక్షులై దాని ప్రగతికి తోడ్పడ్డారు. అలాగే శ్రీరామా కో-ఆపరేటివ్ బిల్డింగ్ సొసైటీని తన చేతుల మీదుగా స్థాపించి, తొలి అధ్యక్షులై అనేక భవనాల నిర్మాణానికి తోడ్పడ్డారు.

1917లో విజయవాడలో ప్రథమ ఆయుర్వేద మహా సభలు జరిగినపుడు అయ్యంకివారు వాలెంటీర్ కెప్టెన్‌గా పనిజేశారు. ఆ తర్వాత ఆయుర్వేదంపై మోజుగలిగి దానిని అభ్యసించి 1937 లో ఆయుర్వేద వైద్యులుగా రిజిస్టరు చేయించుకున్నారు. 1945 లో జరిగిన ఆంధ్ర ఆయుర్వేద మహాసభలకు ఆహ్వాన సంఘ అధ్యక్షులుగా ఉన్నారు.

ప్రకృతి వైద్య విధానాన్ని తెలుగు దేశంలో వ్యాప్తి చేసేందుకు 1931 లో ప్రకృతి కార్యాలయ ట్రస్టు స్థాపించిన వారిలో అయ్యంకిగారు ప్రముఖులు. ఆ సంస్థలో దాదాపు 25సం. కార్యదర్శిగా ఉన్నారు. ఆంధ్ర ప్రకృతి ధర్మ పరిషత్ అను విద్యా సంస్థను స్థాపించి సాగర సీమ, రాయలసీమలో గల వారికి ప్రకృతి జీవనంలో శిక్షణ యిచ్చారు. అంతేగాక అయ్యంకి వారు అఖిల భారత ప్రకృతి సంఘానికి 20 సం. ప్రచార కార్యదర్శిగాను, పటమట లంకలోని సీతరామవధూత గారి ఆరోగ్య సదనానికి ట్రస్టీగాను కృషి చేశారు. నేటికీ వారికి ప్రకృతి జీవనం అంటే ఎంతో ఆదరం, అభిమానం.

ఆంధ్రప్రదేశ్‌లో గుంటూరు వెంకటసుబ్బా రావు గారితో బాటు అనేక గ్రామాలు పర్యటించి దివ్యజ్ఞాన ప్రచారానికి ఎంతగానో సహకరించారు. 1947లో డాక్టరు అనిబిసెంట్ శతజయంతి జరిగినపుడు నాలుగు మాసాలపాటు కార్యక్రమాన్ని ఏర్పాటు చేసి సభలు సమావేశాలు ముమ్మరంగా నిర్వహించి దివ్యజ్ఞాన వాణిని దశ దిశలా మారుమ్రోగించారు.

## నడిపిన పత్రికలు

నాడూ-నేడూ పత్రికా నిర్వహణ ఎంతో కష్టసాధ్యమైనపని. ఆర్థిక వనరులతో బాటు ఎంతో దీక్ష, ఓర్పు, శక్తి, సాహసం పత్రికా నిర్వాహకు కావాలి. ఇవన్నీ వెంకట రమణయ్యగారికి పుట్టుకతో వచ్చిన విద్యలు. పట్టుమని పాతికేళ్లయినా వయసు లేనిదే 1910లో ఆంధ్రభారతి పత్రిక స్థాపించారు. ఇది మూడు సంపుటాల్లో ప్రచురింప బడింది. 1915లో స్థాపించబడిన గ్రంథాలయ సర్వస్వము నేటికీ నడుస్తున్నది. ఫూల్స్‌క్లబ్ కార్యకలాపాల నిమిత్తం 1927లో 'కౌరడా' పక్ష పత్రిక స్థాపించారు. 1924 లో ఇండియన్ లైబ్రరీ జర్నల్ స్థాపించి 1936 వరకు నిర్వహించారు. సహకార సమ్మేళనం-పత్రికకు రెండేళ్లు సంపాదకులుగా ఉన్నారు. ఇవిగాక ఇండియన్ నాచురోపత్, ప్రకృతి పత్రికలను అనేక వ్యయ ప్రయాసల కోర్చి నిర్వహించారు.

పత్రికల నిర్వహణతో బాటు ఆయా పత్రికల్లో తాము నిర్వహించే ఉద్యమాలపై అనేక వ్యాసాలు ప్రచురణ చేశారు. గ్రంథాలయోద్యమానికి సంబంధించినవి మాత్రం 1910-1966 సం. లో ముఖ్య వ్యాసాలు, ఉపన్యాసాలు 1967 లో "గ్రంథాలయ జ్యోతి" పేరున వెలువడింది. దీనిని వి. వి. గిరిగారు ఆవిష్కరించారు. వీటితోబాటు వెంకట రమణయ్యగారు తమ డెబ్బయి సంవత్సరాల ప్రజా జీవితంలో అనేక మహాసభల నివేదికలను, చిరుపొత్తాలను, కర పత్రాలను ప్రచురించి ఉచితంగా పంచిపెట్టారు. జ్ఞాన యజ్ఞ సోమయాజు లనిపించుకున్నారు.

## బిరుదులు-గౌరవాలు

వెంకట రమణయ్యగారు సరదా అయిన మనిషి. వారికి బిరుదులు యివ్వడమన్నా, తీసుకోవడమన్నా ఆనందం. బరోడా మహారాజా శాయాజీరావు గియక్వాడుగారికి 1936 లో వజ్రోత్సవం జరిగినపుడు వెంకటరమణయ్యగారు బరోడా వెళ్ళి వారికి "సరస్వతీ సామ్రాజ్య రమారమణ" బిరుదునిచ్చి సత్కరించారు. గ్రంథాలయ సేవక మహాసభల సందర్భంలో సేవా వ్రతులకు బిరుదులనిచ్చి చందన తాంబూలాలతో సన్మానించారు.

ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ మహాసభ 1934 లో కాకినాడలో జరిగినప్పుడు వారి సేవకు గుర్తింపుగా 'గ్రంథాలయోద్ధారక' బిరుదు




నొందారు. తెలుగు దేశంలో గ్రంథాలయోద్యమ ప్రచారానికి వారి కృషికి గుర్తింపుగా "ఆంధ్ర భారత తీర్థ" పరిశోధక విశ్వవిద్యాలయం వారు ప్రత్యేకంగా జరిపిన స్నాతకోత్సవంలో 1935 లో జయపురం రాజా విక్రమ దేవ వర్మచే ప్రసాదించారు. 1942 లో ఆంధ్రదేశ గ్రంథాలయ సేవక సంఘం వారికి 'గ్రంథాలయ పితామహ' బిరుదు ప్రదానం చేయడమేగాక 700 పుటల బృహత్తర అభినందన గ్రంథం సమర్పించింది. గుడివాడలో వారి సప్తతి మహోత్సవం జరిగినపుడు 'సరస్వతీ సామ్రాజ్య ప్రతిష్ఠాపనాచార్య' ప్రదానం చేయబడింది. వీటన్నిటికీ తలమానికమైనదిగా భారత ప్రభుత్వం వారి గ్రంథాలయ సేవను గుర్తించి 1972 లో వారిని "పద్మశ్రీ" గౌరవంతో సన్మానించింది. ప్రజా జీవితంలో తలపడిన కార్యకర్తలకు ఇంతకంటే ఏం కావాలి. వారు ధన్యజీవులు. ఇది నిజంగా గ్రంథాలయోద్యమానికి గుర్తింపు.

## సన్మానాలు-అభినందనలు

దశాబ్దాల తరబడి కృషిచేసిన కొందరు ఏమాత్రం గుర్తింపు లేకుండానే తనువు చాలిస్తారు కాని వెంకటరమణయ్య గారి అదృష్టమేమో మరి వందల సంఖ్యలో సన్మానాలు పొందారు. 1942 లో గుంటూరులో సేవకసంఘం తరపున జయపురం రాజా విక్రమ దేవ వర్మ ఆంధ్ర విశ్వవిద్యాలయ (నాటి) వైస్ ఛాన్సలర్ డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డి ఆచార్య మామిడిపూడి వెంకట రంగయ్య గార్ల సమక్షంలో వైభవోపేతంగా సన్మానం జరిగింది 1950 లో వారికి విజయవాడలో షష్టిపూర్తి మహోత్సవం అత్యంత వైభవంగా జరిగింది. సప్తతి మహోత్సవం గుడివాడలో జరిగింది. ఆ తర్వాత 75వ జన్మదినోత్సవం గుంటూరులో ఇంకా అనేక ప్రాంతాలలో జరిగింది. 85, 86వ జన్మదినోత్సవాలు విజయవాడలో జరిగాయి. వారు యవ్వనంలో స్థాపించిన గ్రంథాలయ సంఘానికి వారి సమక్షంలోనే రజతోత్సవం, స్వర్ణోత్సవం జరుపుకున్నది. త్వరలో వజ్రోత్సవం జరుపుకోవడానికి సిద్ధంగా ఉంది. తాను నాటిన బీజం మహావృక్షమై శాఖోపశాఖలుగా విస్తరించి ఫలపుష్పభరితమై సుమసౌరభాలు వెలువెదజల్లుతూ విస్తరించటం చూడటంకంటే మహదానందం ఏముంది. ఆ మహదానందమే అయ్యంకి వారిని యిన్నేళ్లు జీవించేట్లు చేసింది. భారత గ్రంథాలయ రంగంలో అయ్యంకి వారి కృషిని ప్రశంసించనివారు, అభినందించనివారు లేరు. ప్రపంచంలో ఎక్కడా అరవై సంవత్సరముల పాటు గ్రంథాలయ రంగంలో అయ్యంకి మినహా కృషి చేసిన వారు మరొకరు లేరని ప్రఖ్యాత గ్రంథాలయ శాస్త్రవేత్త యస్. ఆర్. రంగనాథన్ అన్నారు. భారతీయ గ్రంథాలయ సేవకులలో అయ్యంకి వారు అగ్రగాములని సుతీరాం భాటియా సెలవిచ్చారు. ఇలా పలువురు ఉద్యమాభిమానులు, కవులు, పండితులు వారి కృషిని వేనోళ్ళ ప్రశంసించారు.

## సరస్వతీ సామ్రాజ్యమే

ప్రపంచ ప్రఖ్యాత గ్రంథాలయ విజ్ఞాన వేత్త మెల్విన్ డ్యూయీని గురించి హెర్బర్ట్ పుట్మన్ ఇలా అన్నారు. "డ్యూయీ తింటున్నా, త్రాగుతున్నా, నిద్రిస్తున్నా, మాట్లాడుతున్నా, గ్రంథాలయ విషయాలే మాట్లాడుతారు, ఆలోచిస్తారు, ఆచరిస్తారు. అది ఒకరోజు కాదు, వారం కాదు, నెలకాదు, సంవత్సరాల తరబడి అంతే. అదే జీవితం." అలాగే వెంకటరమణయ్య గారి రక్తంలోని ప్రతి కణం గ్రంథాలయాన్నే సూచిస్తుంది. ప్రతి నాడి గ్రంథాలయాన్నే స్పందిస్తూ ఉంటుంది. వారి షష్టిపూర్తి సందర్భంలో "సరస్వతీ సామ్రాజ్యమ్" అనే నూతన సంస్థ స్థాపించబడింది. దాని స్థాపన పరమార్థం యీ విధంగా చెప్పబడింది. "సరస్వతీదేవి విద్యాస్వరూపిణి, విద్యా ప్రదాయిని, విద్యా ప్రవృత్తిచే అవిద్యా నివృత్తియగును. విద్యా స్వరూపము, వాగ్రూపము, బీజము, నాద బిందువు కళీతము, ఆద్యజ్యోతిస్సులో నుండి జనించిన వాఙ్మయమ్ సరస్వతీ స్వరూపము, అదియే సారస్వతమ్, సార్వస్వతమ్ మానవజాతికి ధర్మార్థ కామ మోక్ష చతుర్విధ పురుషార్థ సాధనమున కేకైక మార్గము, ఇదిగాక వేరొక మార్గములేదు. ఈ మార్గమునందు మానవుని విచారణ శక్తి పెంపొందించినపుడే మానవ జన్మోద్దేశము సఫలమగును. అదియే సరస్వతీ సామ్రాజ్యము. సరస్వతీ సామ్రాజ్యమే మానవ జాతికి అభ్యుదయమునకు నిశ్శ్రేయ ప్రయోజనమార్గము. అదియే ఉత్తమ మానవ సేవ." ఈ విధంగా వెంకటరమణయ్యగారు ఊహించిన సరస్వతీ సామ్రాజ్య భావనా ప్రచారాన్ని జీవితాంతం చేయడానికి పూనుకున్నారు, అలాగే చేస్తున్నారు. తాను స్థాపించిన సంఘాలు, సంస్థలు, తీర్చిదిద్దిన వ్యక్తులు వివిధ రంగాలలో ప్రజాసేవ చేస్తూఉండగా తాము నిర్లిప్తంగ విశ్రాంతి తీసుకుంటూ, 88వ పడిలో పడుతున్నా- వయసు మళ్ళినా- మనస్సు మంచితనం వాడని స్థితిలో ఆనందమయ జీవితం గడుపుతున్నారు.

## పరిపూర్ణ మానవుడు

ఒక సామాన్య వ్యక్తి పెద్దగా చదువు సంధ్యలులేక కేవలం స్వయం కృషితో, స్వయం శక్తితో ఏడు దశాబ్దాలపాటు గ్రంథాలయోద్యమానికి యితర ప్రజా ఉద్యమాలకు సేవ చేశారంటే, ముందుతరాల వాళ్లు నమ్మడం కష్టం. కేవలం ఉత్సాహమే శక్తిగా, త్యాగమే దీక్షగా కలిగిన వ్యక్తి ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘాన్ని, మద్రాసు గ్రంథాలయ సంఘాన్ని, పంచాయితీ గ్రంథాలయ సంఘాన్ని, బెంగాలు గ్రంథాలయ సంఘాన్ని, అఖిలభారత పౌర గ్రంథాలయ సంఘాన్ని యింకా అనేక సంఘాలను యీ శతాబ్ది తొలి పాదంలో స్థాపించాడంటే- అవన్నీ నేడు వర్ధిల్లుతున్నాయంటే అభూత కల్పన గానే తోస్తుంది. ఒక సామాన్య సేవకుడు ఇంగ్లీషు, తెలుగు భాషలలో దాదాపు 8 పత్రికలు వివిధ కాలాల్లో నిర్వహించాడంటే ఆశ్చర్యం కలుగకమానదు. అయినా ఎన్నో ఆటుపోటులకు యీర్ష్యాద్వేషాలకు తట్టుకొని మన మధ్య ఉన్న వెంకటరమణయ్యగారు ధన్యులు. ధన్యులు అనుటనే వారి సేవా భాగ్యానికి ప్రతిఫలంగా జీవితాన్ని పూర్తిగా అనుభవించారు. పరిపూర్ణ మానవుడు అనిపించుకున్నారు. మాధవుడే మానవుడై నిండైన సేవా జీవితం గడుపుతున్నారు. అంతటి అదృష్టం ఎందరికి లభిస్తుంది!

—o o—







# నగరంలో వార్తా చిత్రాలు



గవర్నరు శ్రీమతి శారదాముఖర్జీ ఆగస్టు 18న జూబిలీహాలులో జిల్లా విద్యాశాఖాధికారుల సమ్మేళనానికి ప్రారంభోత్సవం చేశారు.



ఆగస్టు 20న భారతీయ రెడ్‌క్రాస్ సర్వసభ్యసంఘం వార్షికసమావేశం సందర్భంగా రాజ్‌భవన్‌లో బహుమతులను అందజేశారు.

మహిళా కళాశాల వద్ద ఆగస్టు 19న జనతా అన్నంపొట్లాల అమ్మకం కేంద్రానికి గవర్నరు ప్రారంభోత్సవం చేశారు.






సెప్టెంబరు 2న గవర్నరు విద్యావారోత్సవాలను ప్రారంభిస్తున్నదృశ్యం. విద్యాశాఖ మంత్రి శ్రీ ఎం. వి. కృష్ణారావు అధ్యక్షత వహించారు.

ఆగస్టు 27న ఆంధ్రప్రదేశ్ వర్కింగ్ జర్నలిస్టుల యూనియన్ రజతోత్సవాలను ప్రారంభించి, గవర్నరు ఉపన్యసించారు. కార్మిక శాఖ మంత్రి శ్రీ టి. అంజయ్య మన రాష్ట్రంలోని ప్రముఖ జర్నలిస్టులను సన్మానించారు.



# నగరంలో వార్తా చిత్రాలు



ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు ఆగస్టు 29న ఆంధ్రప్రదేశ్ చక్కెర మిల్లుల సంఘ భవన సముదాయానికి శంకు స్థాపన చేశారు.



ఆగస్టు 15న ముఖ్యమంత్రి నిలోఫర్ ఆసుపత్రిలో 700 ఎం.ఎ. ఎక్స్‌రే ప్లాంటుకు ప్రారంభోత్సవం చేశారు.





సెప్టెంబరు 2న ముఖ్యమంత్రి పారిశ్రామికాభివృద్ధి మహాసభకు ప్రారంభోత్సవం చేశారు.

సెప్టెంబరు 1న సచివాలయంలో కార్మిక, ఉద్యోగ ఉపాధి కల్పన శాఖామంత్రి శ్రీ టి. అంజయ్య ఉపాధి కల్పనాధికారుల సమావేశాన్నుద్దేశించి ప్రసంగించారు.



<— సెప్టెంబరు 2న ముఖ్యమంత్రి రామనగర్‌లో పార్సీగుట్ట ఇండ్ల నిర్మాణ పథకానికి ప్రారంభోత్సవం చేశారు. మున్సిపల్ పరిపాలన శాఖామంత్రి శ్రీ చల్లా సుబ్బారాయుడుగారు అధ్యక్షత వహించారు కార్మికశాఖమంత్రి శ్రీ టి. అంజయ్య కార్యక్రమంలో పాల్గొన్నారు.

## రాజధాని విశేషాలు

### సాహిత్య అకాడమీ ద్విదశాబ్ది ఉత్సవాలు

ఆంధ్రసాహిత్య అకాడమీ పుట్టి ఇరవై సంవత్సరాలు అయింది. అందుచే ద్విదశాబ్ది ఉత్సవం జరుపుకొంది. ఒక సంస్థ అందులోనూ సాహిత్య సంస్థ రెండు దశాబ్దాలపాటు నిలబడి ఒక మహత్తర కృషి చేయడం గర్వకారణం.

ఇటీవల హైదరాబాదులో రెండురోజులపాటు జరిగిన ఈ సాహితీ సమారాధనంలో గడచిన దశాబ్దపు తెలుగు సాహిత్యాన్ని (1966–1977) సమీక్షించే ఉపన్యాసాలు ఏర్పాటు చేశారు.

ఈ సందర్భంగా జరిగిన (ఆగస్టు 6) సభకు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అధ్యక్షులు డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి అధ్యక్షత వహించారు.

అకాడమీ ద్విదశాబ్ది సేవలకు చిహ్నంగా ప్రచురించిన ప్రచురణలను గవర్నర్ శ్రీమతి శారదా ముఖర్జీ ఆవిష్కరించి, అకాడమీ కృషిని అభినందించారు.

మరునాడు జరిగిన సభకు విద్యా. సాంస్కృతికశాఖా మంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావు ముఖ్య అతిథిగా వచ్చారు.

### కళాభవన్ అంతస్తు

ఆంధ్ర సాహిత్య అకాడమీ మరింతగా తమ కార్యకలాపాలను జరుపుకోవడానికి వీలుగా కళాభవన్‌కు మరో అంతస్తు నిర్మించుకోడానికి ఆంధ్ర ప్రభుత్వం పక్షాన విద్యా. సాంస్కృతిక శాఖా మంత్రి శ్రీ ఎం. వి. కృష్ణారావు లక్ష రూపాయల విరాళం ప్రకటించారు.

ఆంధ్రసాహిత్య అకాడమీ ద్విదశాబ్ది ఉత్సవాల ముగింపు సభలో మంత్రి శ్రీ కృష్ణారావు ప్రసంగిస్తూ సాహిత్య అకాడమీ తన సేవలను విస్తృత పరుచుకోవడానికి వీలుగా ప్రతి సంవత్సరం ఇచ్చే గ్రాంటును పెంచడానికి వాగ్దానం చేశారు. అకాడమీ అధ్యక్షులు డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి సభకు అధ్యక్షత వహిస్తూ ప్రభుత్వం ఇస్తున్న సాలీనా 3 లక్షల గ్రాంటు సరిపోవడం లేదనీ, అకాడమీ మరింత దీక్షతో సాహిత్య సేవ చేయడానికి గ్రాంటును పెంచాలనీ ప్రభుత్వంలో విజ్ఞప్తిచేశారు.

సాహిత్య అకాడమీ ప్రధాన కార్యదర్శి శ్రీ దేవులపల్లి రామానుజరావు స్వాగతం పలికారు.

ఈ రెండురోజుల సాహిత్య సమారాధనలో మొదటిరోజున ఆధునిక కవితగురించి శ్రీ ఇంద్రగంటి శ్రీకాంతశర్మ వ్యాసం చదివారు.

రెండవరోజున జరిగిన సాహిత్య ప్రసంగాలు చాలా ఉపయుక్తంగా జరిగాయి.

కథానిక గురించి డాక్టర్ పోరంకి దక్షిణామూర్తి సోదాహరణ వ్యాసంలో ఇలా వివరించారు.

"తెలుగుదేశంలో తరతరాలుగా వస్తున్న జానపద కథా సంప్రదాయానికి, ఆధునిక పాశ్చాత్య సాహిత్య పరిచయంతో తెలుగులో కథానిక ఆవిర్భవించింది. దీనికి నారు పోసినవారు గురజాడ అప్పారావు. ఆయన మొదటి కథపేరు 'దిద్దుబాటు'. ఇది మొలకెత్తింది 1910లోనే అయినా, అంతకుముందు దాదాపు రెండు దశాబ్దాలనుంచే దానికి రంగం సిద్ధం చేసుకున్నారాయన. తరవాతి తరం రచయితలు ఆయన కథా సూత్రాన్ని అందుకున్నంత చొరవగా ఆయన భాషా సూత్రాన్ని అందుకోలేక పోయారు. 1920లో సాహితీ సమితి స్థాపించిన తరవాత ఆనాటి యువకవులు అనేక మంది కథారచనకు పూనుకున్నారు. మొదట్లో కావ్య భాషా శృంఖలాల్ని వదిలించుకోలేని వాళ్లు చాలామంది. క్రమంగా వ్యావహారిక భాషలో రచనలు చేయడం ప్రారంభించారు. కథావస్తువుల ఎంపికలో వైవిధ్యం పెరిగింది: కల్పనా శిల్పంలో నైశిత్యం రాణించింది: భాషాశైలిలో సహజత్వం ఉట్టిపడింది. తెలుగు సంస్కృతి సంప్రదాయము, వివాహ సమస్యలు, దాంపత్య జీవనం, కుటుంబ స్థితిగతులు, వృత్తిజీవనం, ఉద్యోగజీవనం, నిరుద్యోగం, సాంఘిక నేరాలు, దురాచారాలు, రాజకీయ ప్రభావాలు అనేక రచనలకు కథావస్తువుల నందించాయి. అట్టడుగున ఉన్న నిరుపేద మొదలు, అత్యున్నత స్థితి నందుకున్న ఆగర్భ శ్రీమంతుడి వరకు ఏయే స్థాయిల్లో, ఏ యే పరిస్థితులు, ఏయేబాధలు, ఏయే భయాలు, ఎన్ని ఆరాటాలు ఎదురవుతున్నాయో అన్నీ తెలుగు కథలో ప్రతిబింబించాయి. రచనా శిల్పంలో రకరకాల ప్రయోగాలు సాగాయి. కథానికా శిల్పం మంచి ఒక మూసలో పోసినట్టు కాక, ఎన్నుకొన్న వస్తువును బట్టి, రచయిత దృక్కోణాన్ని బట్టి రూపుదిద్దుకోవాలన్న స్పృహ ప్రబలింది. భాషాశైలిలో ఒకప్పుడున్న ఆంక్షలు ఇప్పుడు లేవు. శిష్టవ్యావహారికం మొదలు శిష్టేతర జానపద ప్రాంతీయ మాండలికం వరకు ఏ శైలినైనా రచయిత స్వేచ్ఛగా అనుసరిస్తున్నాడు. ఒక తెలుగువాడి సాహిత్యకృషికి అంతర్జాతీయ ప్రతిష్ఠ చేకూర్చిన సాహిత్య ప్రక్రియ ఏదైనా ఉందీ అంటే, అది మన కవిత్వమూ కాదు, నవలా కాదు, నాటకమూ కాదు,—సినిమా అంతకంటే కాదు— కథానిక ఒక్కటే. దాని ప్రగతిని ఎప్పటికప్పుడు పరిశీలించుకొంటూ, సమీక్షించు కొంటూ కథానికా సాహిత్యశాస్త్రాన్ని రూపొందించుకో వలసిన బాధ్యత మన మీదే ఉంది."

సాహిత్య విమర్శను గురించి తులనాత్మక పరిశీలన చేస్తూ డాక్టర్ కొలకలూరి ఇనాక్ ఇలా వివరించారు.

"ఆధునికాంధ్ర సాహిత్య లో పరిశోధన విమర్శన కలిసిపోయాయి. పరిశోధనం విమర్శనను ప్రభావితం చేస్తే అది గిడసబారి పోతుంది. విమర్శన పరిశోధనను ప్రభావితం చేస్తే ఇది పలచబడి పోతుంది.





కవి చరిత్ర, కావ్యచరిత్ర, వాఙ్మయ చరిత్ర, భాషా ప్రక్రియాది చరిత్రలు అచ్చంగా విమర్శనంలో చేరే అంశాలు కావు.

విమర్శన రచనం సృజనంగా లేక పోతే ఉత్తమ ఫలితాలు సాధి చలేదు మరీ సృజనమయితే విమర్శన నీరసమవుతుంది. మరీ పరిశోధనంగా మారితే ఫలితం సాధించలేము."

అనంతరం "నాటకము—నాటికలు" గురించి వివరణాత్మక వ్యాసంలో శ్రీ డి. రామలింగం ఇలా పేర్కొన్నారు.

"పదేళ్ళ కాలం నాటకానికి కానీ నాటికకు కానీ ఒక విధంగా ఒక హద్దు వంటిది. ఒక నాటకం అది నవ్యత కలదైతే పదేళ్ళపాటు రంగస్థలంపై రాజ్యం చేస్తుంది. నాటిక కూడా పదేళ్లు దాటి మనగలగాలంటే అందులో సార్వజనీనమైన, సార్వకాలికమైన విశేషం ఏదో ఉండాలి. ఆంధ్ర నాటక రంగానికి చాలా శక్తివంతమైన పునాది ఉంది. మొదటి తరం పౌరాణిక నాటకాల యుగంతోనూ, ఆ తరువాత రెండవ తరమైన ఆధునిక సాంఘిక యుగంలోనూ దిగ్గజములవంటి వారు నాటక సాహిత్యాన్ని సుసంపన్నం చేశారు. మన సమీక్షా కాలంలో పౌరాణిక ఇతి వృత్తాలను తీసుకొని తమ భావాలకు అనుగుణంగా వ్యాఖ్యానించిన నాటకాలలో నార్ల వెంకటేశ్వరరావుగారి 'జాబాలి బోయి భీమన్న గారి 'ఆదికవి వాల్మీకి' పేర్కొనదగ్గవి. ఆంధ్రుల చరిత్రకు సంబంధించినంత వరకూ డా. పి.వి. రాజమన్నార్‌గారి 'సర్దార్ పాపడు' కీ॥శే॥ నార్ల చిరంజీవి గారి 'భాగ్యనగరం' ఉత్తమ రచనలు. ఈ కాలంలో అవినీతిపై కేంద్రీకరించిన నాటకాలలో సుంకర సత్యనారాయణగారి 'నూరు కౌరుల్లో' అనేది, డా. కొర్రపాటి గంగాధరరావు గారి 'యథా ప్రజా తథా రాజా' అనిసెట్టి సుబ్బారావు, పాలగుమ్మి పద్మరాజు, పినిసెట్టి శ్రీరామమూర్తి, గొల్లపూడి మారుతీ రావు గారులు కలిసి రచించిన 'అవినీతీ నీవెక్కడ ?' అనే నాటకాలు పేర్కొనదగ్గవి. ఈ దశాబ్దంలో మానవీయత యొక్క ప్రకర్షను చాటిన నాటకాలు కొన్ని వెలువడ్డాయి. వాటిలో కళారాధకుడు జీవితంలో కరిగిపోవడాన్ని చిత్రించిన మోదుకూరి జాన్సన్ రచన 'నటనాలయం,' సోమంచి యజ్ఞన్న శాస్త్రి గారి 'హద్దులు—సరిహద్దులు' అనే రెండు నాటికలు, యన్. ఆర్. నంది గారి 'మరో మొహంజోదారో', ఆర్. వి. యస్. రామస్వామిగారి 'సుడిగాలి' ఒక్కొక్కటి ఒక్కొక్క విధమైన ప్రత్యేకత కలిగి ఉన్నాయి. ముఖ్యంగా సోమంచి వారి 'సత్యానికి సరిహద్దులున్నాయి' అనే నాటిక అవాన్‌గార్డే—అంటే ఒక క్రొత్త పోకడను, ఒక నవీన సందేశాన్ని ఇచ్చిన రచన. ఇక ఈ దశాబ్ది ఆంధ్ర నాటక రంగానికి ఇచ్చిన నాటకకర్తలలో గణేశ్ పాత్రో ఆవిర్భావం ఒక అద్భుత విశేషం. ఈయన అచ్చంగా నాటక రచయిత. ముఖ్యంగా 'తరంగాలు' అనే అతని నాటకం, 'దేశం కొంచెం ముందు పుచ్చుకుంది,' 'తెరచి రాజు', 'పావలా', 'లాభం' వంటి అతని నాటికలు కొత్త పోకడకు మచ్చుతునకల వంటివి. ఇక తెలుగు నాటక రంగం ఏ స్థితిలో ఉంది అన్న ప్రశ్నకు సమాధానం చెప్పడం విషయంలో ఈ నాటక రంగంలో ఉన్న వారికే రెండు రకాల అభిప్రాయాలున్నాయి. ఒక వర్గం చెప్పుకోదగ్గ రచనలు అరుదుగా వస్తున్నాయి, ఎక్కడో ఒకటీ అరా మంచివి అన్న అభిప్రాయం వెలిబుచ్చితే, రెండవ వర్గం వారు మన రచనలు ఏ భాషవారికీ తీసిపోనివిగా ఉంటున్నాయని ఆశాభావం వ్యక్తం చేస్తున్నారు."

## వేద వైశిష్ట్యం

జీవిత విలువల ప్రాధాన్యం గురించి మానవతా వైశిష్ట్య ప్రాముఖ్యం గురించి సదవగాహనకు వేదాలు ప్రాధాన్యం చాలా ఉందనీ విశ్వహృదయం ఆనందమయం కావడానికి వేదాలు మార్గదర్శకం కాలని శ్రీ మహేశ్ యోగి ఇటీవల హైదరాబాదులో "వేద విజ్ఞానం సైన్స్" అనేవిషయంపై అఖిలభారత స్థాయిలో జరిగిన సదస్సులో ప్రబోధించారు.

ఆధునికయుగంలో నివశిస్తున్న విజ్ఞాన వేత్తలు వేదాలలో నూ, ఆ సంస్కృతిలోను ఉన్న ప్రత్యేకతను అవగతం కావించుకోడానికి ప్రయత్నించాలని సూచించారు.

రాష్ట్రగవర్నర్ శ్రీమతి శారదా ముఖర్జీ సదస్సుకు ప్రారంభోత్సవం చేశారు.

ప్రొఫెసర్ డాక్టర్ రాబర్ట్ కీత్‌వాలెస్, డాక్టర్ పురాణిక్, డాక్టర్ రావాడ సత్యనారాయణ, డాక్టర్ సంజీవరావు, డాక్టర్ సుదర్శన్ ప్రభృతులు ప్రసంగించారు.

—"ఎల్లోరా"

## ఆత్మవిశ్వాసం

ఆత్మ విశ్వాసం, ధైర్యం, పట్టుదల ప్రదర్శించిన వారే చరిత్రలో మహాపురుషులైనారు.

మనిషి తాను ఏది కావాలనుకుంటే అది అవుతాడు. ఫలానా పని నేను చేయలేను అనుకుంటే, వాడా పని చేయలేక పోతాడు. అలాకాక నేను ఆ పని చేయగలననే విశ్వాసంతో వుంటే, మొదట్లోకాక పోయినా చివరకు దాన్ని సాధించగలుగుతాడు.

—గాంధీజీ









ఆగస్టు 26న ఇండియన్ ఫెడరేషన్ ఆఫ్ వర్కింగ్ జర్నలిస్టుల 18వ ప్లీనరీ సెషన్ ప్రారంభిస్తున్న ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు. కేంద్ర పరిశ్రమలశాఖమంత్రి శ్రీ జార్జి ఫెర్నాండెజ్ ప్రధాన అతిథిగా పాల్గొన్నారు. ఆర్థిక మంత్రి శ్రీ పి. రంగారెడ్డి కార్యక్రమంలో పాల్గొన్నారు.



ఆగస్టు 29న జూబిలీహాలులో ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు ప్రధాన న్యాయమూర్తిగా పదవీ విరమణచేసిన జస్టిస్ బి.జె. దివాన్ మొమెంటోను అందజేశారు. జస్టిస్ శ్రీ ఎస్. ఓబుల్‌రెడ్డి చిత్రంలో వున్నారు.

గవర్నరు శ్రీమతి శారదా ముఖర్జీ ఆగస్టు 19న ఆంధ్ర ప్రదేశ్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిగా శ్రీ ఎస్. ఓబుల్‌రెడ్డిచేత ప్రమాణ స్వీకారం చేయించారు.





ఆగస్టు 22న గవర్నరు రాజ్‌భవన్‌లో ప్రధాన న్యాయమూర్తిగా పదవీ విరమణ చేసిన జస్టిస్ శ్రీ బి. జె. దివాన్‌కు ఒక మొమెంటోను అందజేశారు.

## నగరంలో...

ఆగస్టు 30న పరిశ్రమ భవనంలో భారత ప్రభుత్వ వాణిజ్యశాఖ ఎడిషనల్ సెక్రటరీ శ్రీ పి. కె. కౌల్ అధ్యక్షతన జరిగిన ఒక సమావేశంలో "ఇంటిగ్రేటెడ్ ఎయిర్ కార్గోకాంప్లెక్స్" నెలకొల్పేందుకు చర్చ జరిగింది.






## కస్తూరీబాయి

సూర్యకాంతి సహజకాంతి—చంద్రకాంతి ప్రతి బింబితమైన కాంతి. సూర్యకాంతిలాగా సహజమైన కాంతి కాకుండా, చంద్ర కాంతి లాగా ప్రతి బింబితమైన కీర్తి ప్రతిష్టలు మోయడం సులభం కాదు. అలాంటి దారిన పడి సాగిపోవడం చాలా కష్టం. ఆ దారి పొడుగునా బలిదానాలు తప్పవు. కస్తూరీబాయికి తొలినుండి తుదిదాకా ఈ పథమే తప్ప వేరే పథం కనపడనే లేదు. జీవిత కాలంలో ఇటువంటి కష్టపథాన పయనిస్తూ గాంధీజీ కూడా గర్వపడేటట్లుగా, మానసికంగా ఏ మాత్రం కృంగి పోకుండా ఉన్నత శిఖరాన నిలువ కల్గింది కస్తూరీబాయి.

కస్తూరీబాయి వ్యక్తిత్వం చాలా గొప్పది అనడానికి నిదర్శనాలు అనేకం. కాని ఆమె ఎప్పుడూ, భర్తకు ప్రతిబింబంగా వుండడంవల్ల తన ఉన్నతాశయాలు కించపడ్డాయని గాని, ఆత్మ గౌరవం తగ్గిందని కాని భావించలేదు. గాంధీ ఆశయ సిద్ధే తన ఆశయాలకి సిద్ధి అని తలపోసిన మహావ్యక్తి కస్తూరీబాయి. "నా సవతులు వేరే లేరు. నా భర్త ప్రారంభించే కార్యక్రమాలే" అని ఆమె భావించేది. కాని రాణివాసపు పట్టమహిషి లాగా యితర కళత్రాలని హృదయ పూర్వకంగా ఆహ్వానించి తీసుకువచ్చేట్టు, కస్తూరీబాయి తన భర్త కార్యక్రమాలని, కొత్త పథకాలని ఆత్రంగా ఆహ్వానించేది. హిందూ ధర్మ శాస్త్రాలు చెప్తున్న విధంగా భర్త గుణ గణాలూ, అనుభూతులూ, ఆశయాలూ, ఆదర్శాలూ తనవిగా చేసుకొని గాంధీకి నిజమైన 'సహధర్మిణి', 'సహకర్మిణి'గా రూపొంది ఆనందించింది కస్తూరీబాయి.

## తన యిల్లు తనది కాదు !

తను ప్రేమించే వ్యక్తి తనకు స్వంతం కావాలని కోరుకోవడం మానవ సహజమైన స్వార్థం కదా. తనకు సన్నిహితులైన వారి మధ్య ప్రశాంతంగా కాలం గడపాలని కోరడం కూడా అలాంటి సహజమైన కోరికే. పగలంతా పడిన శ్రమ, కష్టం, నిష్ఠూరం అన్నీ మరచిపోయి, తన భర్తతో ఏకాంతంలో హాయిగా గడపాలని ప్రతి స్త్రీ కోరుకుంటుంది. కాని గాంధీజీ జీవితంలో వారి వైవాహిక జీవితంలోని కనపటి నలభై సంవత్సరాలకి పైగా ఏకాంతానికి తావు లేకుండా పోయింది! ఒక అర్ధ శతాబ్దిపాటు కస్తూరీబాయి తన యింటిని తనదిగా చెప్పుకోలేక పోయింది. ఆ యిల్లు నిత్యం అసంఖ్యాకులైన అపరిచితులకి ఆశ్రయం అయింది. స్త్రీ సహజమైన కోర్కెలకీ, అవసరాలకీ ఆ యింటో అవకాశం లేకుండా పోయింది.

కాని వీటన్నిటినీ మించిన ఆనందం ఆమెకు కల్గేది. ఇంత మందికి ఆరాధ్య దైవంగా, ఆదర్శమూర్తిగా, పితృ సమానుడిగా కనిపించే—గాంధీని అందరితోనూ తనూ పంచుకొని ఆనందం పొందేది. తన భర్తపట్ల యింత హుందాగా వుండ కల్గడం ఆమెకు గర్వకారణంగా తోచేది కొన్నాళ్ళ విసుగుదల, అసంతృప్తి, కోప తాపాల తరువాత ఆమె ఒక నగ్నసత్యాన్ని ఆమె గ్రహించింది. తన భర్త ఔన్నత్యాన్ని ఘనతని 'వ్యక్తిగత జీవితం' అనే గిరిలో బంధించడం అన్నది—అసహజమే కాదు; అనుచితమైనదని ఆమె గ్రహించింది. అందుకే కస్తూరీబాయి వ్యక్తిగత జీవితం విస్తరించి బాపూజీ జీవిత పరిధిలో లీనమై పోయిందని చెప్పవచ్చు. అంతేకాదు, వారి జీవితం బాహ్యప్రపంచపు ప్రజా జీవిత వృత్తాలలో మిళితమై పోయిందన్నా—సత్యదూరం కాదు. గాంధీజీకి వ్యక్తిగతమైనదంటూ ఏం మిగలలేదు. వారి జీవితాలకీ పరుల జీవితాలకీ మధ్య అడ్డుగోడలే లేవు. అందుకే, కొత్తవారికీ పాతవారికీ— ఒకే రకమైన ఆహ్వానం ఆ ఇంట లభించేది. గాంధీజీ అందరికీ తండ్రి అయితే కస్తూరీబాయి అందరికీ తల్లి అయింది.

కొందరంటూ వుంటారు—ఏ స్త్రీ అయినా ఇంత త్యాగం చేసి యింత శాంతంగా వుండకుండా మానసికంగా సంక్షోభపడి వుండదా ? అని. నిజమే. మానవజన్మ ఎత్తిన ఏ జాతికైనా స్వార్థం అనే దాన్ని తుడిచి వేయడం అన్నది కష్టసాధ్యమైన పని. స్వార్థం తుడిచి వేసుకొని, సర్వహక్కులనీ సర్వ ఆశలనీ ఆశయాలనీ ఒకే వ్యక్తికి అర్పణం చేసేసి బ్రతకడం అన్న అనితర సాధ్యమైన విషయం కావచ్చు—గాని కస్తూరీబాయి అది సాధించింది. అది ఎలా అన్నదే ఆమె జీవితం నేర్పే పాఠం. ఆమె మానసికంగా పడ్డ సంక్షోభం చిహ్నాలు ఆమె ఛాయలు వదిలాయి. ఆమె ఆత్మలో చెలరేగిన సంక్షోభం దానిని రాచిరాచి, రంపానపెట్టి చివరికి స్వార్థం అనే దానిని సేవగా మార్చి వేసిందని చెప్పాలి. ఆమె ముఖంపై ఏర్పడ్డ అనేకానేక ముడుతలు అంతర్యపు లోతులలో జరిగిన మానసికారాటపు చిహ్నాలే నన్నా సత్యదూరం కాదు. నిజానికి కస్తూరీబాయి నెవ్వరూ మధ్య వయస్కురాలిగా, ప్రౌఢగా,





వూహించుకోడానికి అస్కారం లేకుండా ఈ ముడుతలే ఆమె లోని ఔన్నత్యాన్నీ సౌందర్యాన్నీ చాటుతాయి.

## కత్తిమీద సాము

గాంధీజీ, కస్తూరీబాయి—ఇద్దరూ సమవయస్కులు. మన దేశ చరిత్రలో బాల్య వివాహాలు, పరదా, వర్ణ భేదాలు దారుణంగా అమలులో ఉన్న రోజులకు చెందినవారే—ఉభయులూ. పదమూడవ సంవత్సరంలో పెళ్లి అయింది వారికి. వివాహం అంటే ఒక రకం సాహస యాత్రగా; అజమాయిషీగా భావించే గాంధీ ఆ చిన్న వయస్సులోనే భర్తగా ఆమె మీద అధికారం చెలాయించడం ప్రారంభించాడు. గాంధీజీ దృష్టిలో ఏక పత్నీవ్రతం—అత్యుత్తమైన సద్గుణం, అదొక 'పీడ'గా అతన్ని పట్టి వేధించేది. ఉట్టి అనుమానపు మనిషిగా అతన్ని మార్చి వేసింది సద్గుణం. అనుమానంతో పాటు అసూయ, చేయి కల్పి—రెండూ కలిసి కస్తూరీబాయి జీవితం—కత్తి మీద సాము చేయించాయి. ఎన్నో సందర్భాలలో—ఆత్మౌన్నత్యం అందమైన ఆకృతి కల కస్తూరీబాయికి—ఈ గాంధీతత్వం బాధగా పరిణమించేది: పట్టుదలలు పెరిగేవి. ఒక్కొక్కసారి పుట్టింటికి వెళ్లనిచ్చేవాడు కాదు. దాంతో వెళ్లి తీరాలన్న పట్టుదల ప్రబలి కస్తూరీబాయి వెళ్లి తీరేది. ఇలాగే ఒకసారి పుట్టింటికి వెళ్లి కస్తూరీబాయి తన కోర్కెలు మన్నిస్తే తప్పించి యింటికి తిరిగి రానని పట్టుపట్టి కూర్చుంది. అన్ని విధాలా అడిగి చూసి చివరికి గాంధీ ఆమె కోర్కెను మన్నిస్తానని మాట యిచ్చి తీసుకు వచ్చాడట. అదేమిటో తెలుసా? తన కిష్టమైనప్పుడు—స్వేచ్ఛగా తన వాళ్లను వెళ్లి చూసి వచ్చే హక్కు. బహుశ గాంధీజీకి సత్యాగ్రహ స్వరూపాన్ని శక్తిని తొలి రోజులలో బోధించిన గట్టి గుణపాఠం యిదే అయివుంటుంది! తరువాత జీవితంలో సత్యాగ్రహాన్ని గాంధీజీ ఒక ఆయుధంగా మార్చివేసిన సత్యం సర్వజన విదితమే. కాని దానికి నాంది కస్తూరీబాయి మొండి పట్టుదల లోంచి, పుట్టుకొచ్చినదే.

తాను ఏ పని చేసినా తన భార్య కూడా అందులో పాలు పంచుకోవాలని యువ గాంధీ కోరిక. వయస్సులో వున్న భర్త కది సహజమైన కోరికే, అందుకే పెళ్లైయిన కొత్తలో కస్తూరీబాయికి అక్షరాలు నేర్పాలని, పూనుకున్నాడు గాంధీ. మొదట్లో 'హాయిగా వుండక ఎందుకీబాధ అని విముఖురాలుగా వుండేది కస్తూరీబాయి. గాంధీకి పంతం హెచ్చిన కొద్దీ కస్తూరీబాయికీ మొండితనం హెచ్చేది. తన భార్యని ఒక ఆదర్శ మహిళగా రూపొందించాలన్న తాపత్రయమే తప్ప గాంధీకి ఆమె ఓ వ్యక్తి అన్న దృష్టి వుండేది కాదు. పైగా ఉమ్మడి కుటుంబంలో భార్యను విధేయురాలిగా చేసుకోవాలనీ, తన ప్రత్యేకత చాటుకోవాలనే తప్ప వేరే ధ్యాస వుండేది కాదు. గాంధీయే ఒకచోట "మా యౌవన కాలంలో బా కి చదువు నేర్పాలన్న నా ప్రయత్నం పూర్తిగా పరాజయం పొందిందనాలి" అని. అయిష్టం మొండితనం సాధించలేని ఘన విజయాన్ని కాలం సాధించింది. గాంధీ జీవితం దేశ మొత్తంమీద విస్తరించను, విస్తరించను కస్తూరిబాయి—తనకు తానుగానే మహాత్మునికి "తగిన సతిగా" రూపాంతరం చెందింది. ఈ రూపాంతరం చెందడంలో ఆమె దిగమింగిన అవమానాలు, పడ్డపాట్లు—వూహింపరానివి. సామాన్యమైన ఏ మహిళ విజయవంతంగా సాధించలేనివి.

ఎన్నో సందర్భాలలో గాంధీజీ ఓర్పు కోల్పోవడమే కాదు. చేయిచేసుకునేవాడు. కోపం భరింపరానిదైతే పుట్టింటికి పంపించేసేవాడు. ఎన్నో రోజులకుగాని తిరిగి పిలుచుకొని వచ్చే వాడు కాదు. "కాని ఇదంతా నా అవివేకానికి నిదర్శనే అని తరవాత తెలిసింది" అంటాడు గాంధీ. భారత నారీలోకంలో — తెలిసో తెలియకో, ఆలోచించో, అనాలోచితంగానో భర్త అడుగుజాడలో నడవాలన్న ఒక గుణం పాదుకొని పోయింది. అందుకే కస్తూరీబాయి గాంధీజీ తీసుకున్న 'నియమాల' వల్ల విపరీతంగా బాధపడేది కాదు. బ్రహ్మచర్య వ్రతం అవలంబించినా, నిరశనవ్రతం ప్రారంభించినా, తినే పదార్థాలలో రుచీపచీ తీసి పారేసినా—ఏదీ ఆమెను ఖంగారు పెట్టేది కాదు. ఒకసారి స్వీట్ బ్రెడ్ చేస్తాను బాపూ కూడా తింటారేమో కనుక్కోమందట కస్తూరీబాయి. తక్షణం బాపూ చెప్పారట 'బా తినకపోతే నేను తింటానని!' ఇది వినడానికి కటువుగా హృదయంలేని వారి మాటలాగా తోస్తుంది. కాని కస్తూరీబాయి ఆరోగ్యం దృష్టిలో పెట్టుకుని బాపూ అలా సెలవిచ్చారని కొన్నాళ్లకి ఆమె గ్రహించిందట. ఇలాగే ఉప్పు, పప్పులూ తినకూడదని డాక్టర్లు చెప్తే "యివేం తినకుండా వుండడం ఎవరికైనా సాధ్యమా?" అని అడిగిందట బా. ఆరోగ్యానికి అవసరం అని చెప్తే ఏవైనా మానేయ కల్లాలని వాదిస్తూ 'ఈ రోజు మొదలు ఓ సంవత్సరంపాటు నేను అవేమి తినను' అని శపథం చేశాడట బాపూ. 'నేను మానేస్తానుగాని మీ రా ఒట్టు తీయండని' బా ఎంత బ్రతిమాలినా బాపూ తన పట్టుదల వదల లేదట. ఇలాగే ఎన్నో సందర్భాలున్నాయి—వీరిజీవితంలో—కస్తూరీబాయి కంట తడిపెట్టకుండా గుండెల్లో సంద్రాన్ని దాచుకొని బాపూ మాట పాలించిన సందర్భాలు.

## క్రూరమైన కనికరం

దక్షిణాఫ్రికాలో కస్తూరీబాయి పడిన కష్టాలు సాధారణ గృహిణికి అనూహ్యం. సదాచార పరాయిణుల యింటపుట్టి—సర్వం వదిలి భర్త వెంట వెళ్లి అతని ధోరణికి అనుగుణంగా మారడానికి ఆమెపడ్డపాట్లు యిన్నీ అన్నీ కావు. ఒకసారి ఒక క్రైస్తవుని కమోడు కడగ వలసివచ్చి ముఖం ముడుచుకుని ఆపని చేయ ప్రారంభించిన కస్తూరీబాయి మీద బాపూ విరుచుకుపడ్డ కథ చెప్తూంటారు. గాంధీ తమ స్వీయ చరిత్రలో రాస్తూ 'నేను క్రూరమైన కనికరం గల భర్తని' అని చెప్పుకున్నాడు. అంతేకాదు. 'నా గుడ్డి ప్రేమతో ఆమెను చాలా బాధ పెట్టాను' అంటాడు. కమోడు కడగడం కాదు ప్రధానం. అది యిష్టంగా చేయడం ముఖ్యం అని బాపూ కోపగించాడు. 'నాయింటో యిలాంటి పిచ్చి





వేషాలు కుదరవు' అని కేకలు వేశాట్ట. దాని కామె 'నీ యింటికో దండం. నువ్వే అట్టే పెట్టుకో. నేను పోతాను' అందట గట్టిగా. అంతే బాపు ఒళ్లు మరిచి, చేయి పట్టి లాగి వీధి గేటు దగ్గిర వదిలా డట—పొమ్మని! దానికి కస్తూరీబాయి మరీ మండి పడి, ఓ పక్క కన్నీరు. కారి పోతుండగానే 'మీకు సిగ్గు లేదా? నా కెవరున్నారని ఎక్కడికి పోను? మీ భార్యగా తన్నినా తిట్టినా పడక తప్పదు అనే కదా మీ ధైర్యం. కాస్త ఆలోచించి ప్రవర్తించడి. ముందా గేటు మూయండి. ఇలా మనం కొట్లాడు కోవడం ఎవరేనా చూస్తారు!' అని అరిచిం దట. నిజానికి గాంధీ సిగ్గుతో ముఖం చాటు చేసుకుని గేటుమూసి చక్కావచ్చాట్ట. కస్తూరీబాయి ఎలా గాంధీని విడిచి వుండ లేదో—గాంధీజీ అంతే—ఆమె లేకుండా—వుండలేడు వయస్సుతో పాటు వారిద్దరి మధ్య స్నేహం పెరిగింది.

## కట్టుడి, ముట్టుడి, ఒత్తిడి...

భర్త వల్ల వయస్సులో కట్టడి, నడి వయస్సులో ముట్టడి, జీవితాంతం ఒత్తిడి అనుభవించిన కస్తూరీబాయి—తన పిల్లలవల్ల కూడా సుఖ శాంతులు పొందలేదు. ముఖ్యంగా హరిలాల్ ఆమె హృదయాన్ని చాలా గాయ పరిచాడు. తల్లి తండ్రుల పేరు రోడ్డుకి లాగడమే కాదు, తన జీవితాన్ని దుఃఖ భాజనం చేసు కున్నాడు. కస్తూరీబాయికి, నిరాసక్తి విలువ ఇతని విషయంలో పూర్తిగా తెలిసి వచ్చింది.

ప్రశాంతతలేని కష్ట కాలంగా కాలం గడుస్తున్నప్పుడు—గాంధీ అంతరాత్మ ఒక రకమైన పరిణామావస్థలో వుంది. గొంగళి పురుగు గూడు కట్టుకొని, సీతాకోక చిలుకగా మారి బయటికి వస్తుంది. గాంధీ వ్యక్తిత్వం యిలాగే గూడుకట్టుకుని పరిణామ దశలో వున్నప్పుడు—భర్తకి కావలసిన మనశ్శాంతి కస్తూరీబాయి యివ్వకల్గింది. దక్షిణాఫ్రికాలో భారతీయుల బాధలు తనవిగా చేసుకొంటున్న గాంధీ గృహంలో ఏ మాత్రం తుఫాను లేకుండా కస్తూరీబాయి చూసుకొంది. నిందలనూ జైలు శిక్షలనూ కొని తెచ్చుకొన్నప్పుడూ ప్రజల బాధ తనదిగా బాధపడు తున్నప్పుడూ కస్తూరీబాయి అతనికి అండగా నిలిచింది. అహింసా సూత్రపు ఆవశ్యకతను గాంధీ గ్రహించడానికి కారణమే కస్తూరీబాయి వ్యక్తిత్వం. గాంధీ తన జీవిత గమ్యాన్ని తెలుసుకున్న క్షణాన్నే కస్తూరీబాయి అతన్ని కోల్పోయిందని చెప్పాలి. గాంధీ మహాత్ము డయ్యాడు. జాతి పిత అయ్యాడు. దేశానికి తనని తానుగా ధారపోసుకున్నాడు.

కీర్తివంతుని పెళ్ళాడ్డం తాజ్‌మహల్‌ని పెళ్ళాడ్డం లాంటిదంటే హాస్యంగా వుంటుందేమోగాని దానో నిజం లేక పోలేదు. కస్తూరీబాయి యీ నిజాన్ని గుర్తించిన మహిళ. గాంధీ ఏమన్నా ఏం చేసినా అందరి దానసీ తనది తన పిల్లలదీ అంటూ ఏమి లేదని ఆమె గ్రహించింది. కాని గాంధీ కూడా ఆమెకి ఏమీ భర్తా ఏ భార్యకూ యివ్వనంత గౌరవ స్థానం యిచ్చాడు. 'నా భార్య నన్ను ఆకర్షించినట్లు యింకే యితర స్త్రీ నన్నాకర్షింప లేదు. భర్తగా ఆమె విశ్వాసాన్ని నేనెప్పుడూ కోల్పోలేదు' అన్నాడు గాంధీ 1906 లో తను బ్రహ్మచర్య వ్రతం అవలంబించిన సంధర్భంలో

## అద్భుతమైన ఆత్మశక్తి

దరిదాపు అరవై సంవత్సరాల జీవన ప్రవాహంలో అక్కడ క్కడ అడ్డు తగిలే జ్ఞాపకాంశాలలలో కస్తూరీబాయి తన స్వీయ వ్యక్తిత్వాన్ని రూపుమాపుతూ గడిపివేసింది. లోలోపల ఎన్ని తుఫానులు రేగినా పైకి మాత్రం అద్భుతమైన ఆత్మశక్తితో అందరినీ ఆదరిస్తూ గడిపేసింది. కస్తూరీబాయిని గురించి మనం వినేది తక్కువ. రాసినదీ తక్కువే. కారణం ఒక్కటే. గాంధీ గురించి ఏ మాత్రం రాసివున్నా దాంట్లో కస్తూరీబాయి భాగం వుండి తీరుతుంది—బా లేక బాపూ లేడుకనుక!

1942 లో జైలులో వుండగా జబ్బు చేసింది కస్తూరీబాయికి. 1943 లో ఎక్కువైంది. తను భర్త కంటే ముందే చచ్చిపోతానని అదీ అతగాని వడిలో మరణిస్తాననీ ఆమె గట్టి నమ్మకం. ఆమె కోరుకున్నట్టే జరిగింది. సుశీలా నయ్యర్ బాపూతో 'నేను కాస్త పని మీద వెడుతున్నా బా దగ్గిర కూర్చోండి' అని చెప్పిందట. 'నేనిక్కడ నుంచే చూస్తూంటాను—చాలా మంది వున్నారు. పిలుస్తే వెడతాను' అని మాట యిచ్చాడట. అలాగ్గానే, కస్తూరీబాయి బాధతో బాపూ అని పిలవగానే వెళ్లి ఆమె తల తన వడిలో పెట్టుకూర్చు న్నాడట బాపూజీ. అదే ఈ భూమ్మీద కస్తూరీబాయి ఆఖరున ఉచ్చరించిన మాటగా మిగిలి పోయింది. అది ఫిబ్రవరి 22, 1944. ఈనాడు దేశం మొత్తం మీద ఆమె పేర అనేక సేవాసంస్థలు వున్నాయి. అటువంటి అంతర్వాహినికి యింతకు మించిన స్మృతి చిహ్నాలు వుండవు కదా? కస్తూరీబాయి చని పోయినప్పుడు చందనం కర్ర వాడదామన్నారట. "నేను పేదని, పేదవానిభార్య కస్తూరీబాయి. ఏ పేదవాడు చందనంకర్ర తేగలడు" అన్నాడట బాపూ. ఎర్రవాడ జైలు అధికారి ప్రభుత్వం ఆబాధ్యత వహించాలని అదే ఒకమహనీయురాలికి తాను చేయకల్గిన చివరి గౌరవం అని ఆ బాధ్యత తనపై వేసుకున్నాడు.

కస్తూరీబాయిది ప్రతిబింబితమైన కీర్తి కాంతే. కాని దానిలో వున్న బలం, సహజ కాంతి అయిన గాంధీజీకి కూడా ఆధార భూతమైన—తేజస్సని—అందరికీ తెలుసు. అందరికీ తెలిసి పైకి అనలేనిదే—నిజమైన ఆరాధన, అది 'బా' కి దక్కింది.

---







# పాఠకుల లేఖలు



"ఆంధ్రప్రదేశ్" తెలుగు మాసపత్రిక స్వాతంత్ర్య దినోత్సవ సంచికను సర్వాంగ సుందరంగా వెలువరించి నందుకు మిమ్మల నభినందిస్తున్నాను. మీరు ఎంపిక చేసిన అంశాలు నా కెంతో నచ్చాయి. వాస్తవానికి యిది సాహితీ సంకలనం అనవచ్చు. ఎంతో ఉత్తేజకరమైన వ్యాసాలు ఉన్నాయి.

మన స్వాతంత్ర్య సమరానికి చేయూత నిచ్చిన కొత్తవరం, అనంతవరం, చేబ్రోలు. భీమవరం వంటి గ్రామాలు, ప్రాంతాలు, కనకమ్మ, చిక్కమ్మ, భారతీదేవి, దుర్గాబాయి, లక్ష్మీబాయమ్మ, దివ్వూరు సుబ్బమ్మవంటి ప్రముఖమహిళల గూర్చి వ్రాయడానికి మీరు రచయితలను ప్రోత్సహించడం చక్కని ఆలోచనగా పేర్కొనవచ్చు. అదే విధంగా తుమ్మల, గరిమెళ్ల, నెల్లూరువి. రామానాయుడు వంటి రచయితలు ఉత్తేజకర మైన రచనలు చేశారు. దయచేసి ఇటువంటి వ్యక్తులు విషయాలను గూర్చి యిదేవిధంగా వ్యాసాలు సేకరించి ప్రచురించండి. వి. ఎ. యల్. సుందర రావు తనవ్యాసం ద్వారా గణనీయమైన ఉత్తమ సేవచేశాను.

ఎన్. జి. రంగా
రాజ్యసభ సభ్యులు

15వ ఆగస్టు స్వాతంత్ర్య దినోత్సవ సంచిక ఈసారి చాలా ముచ్చటగా వుంది. ముఖ్యంగా చెప్పుకోదగ్గవి కవితలు, వ్యాసాలు, గేయాలు బ్రహ్మాండంగా వున్నవి. ప్రఖ్యాత విమర్శకుడు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి గారి జీవిత చరిత్ర క్షుణ్ణంగా తెల్పిన రచయిత తిరునగరిగారికి ధన్యవాదములు.

ప్రతినెల ఒక ప్రఖ్యాతకవి గూర్చి విశదపరచగలరని ఆశిస్తా. అలాగే అల్లూరి సీతారామరాజుగారి సంక్షిప్త జీవితచరిత్ర, వారి దేశ భక్తి అనన్యము. గొప్ప యోధుడుగా, వీరుడుగా వారి సేవలను ప్రాణాలతో అంకితం చేసిన చరిత్రను వి. యల్. సుందరరావుగారు రచించినది ఎంతో బాగుంది.

—వి. సాంబశివరావు
(సర్పంచ్) గుండేడు

మీరు ప్రచురించిన స్వాతంత్ర్య దినోత్సవ ప్రత్యేక సంచిక కడురమ్యంగా వున్నది. మర్రిచెట్టు కథానిక చాలా బాగుంది. స్వర్ణయోగి సీరియల్ చాలా బాగావుంది. తెలుగువారు స్థాపించిన కొన్ని ఇంగ్లీషు పత్రికలు గూర్చి శ్రీ కంచి వాసుదేవరావుగారు వ్రాసిన వ్యాసం బాగుంది. ఆగస్టు నెల "ఆంధ్రప్రదేశ్" చాలా బాగుంది. ఉప్పు సత్యాగ్రహం నాటి పాటలు సేకరించిన శ్రీ మారెళ్ళపూడి మహేశ్వరశర్మగారికి నా ధన్యవాదాలు.

వుప్పల లక్ష్మణరావుగారు వ్రాసిన యువత కథానిక బాగో లేదు. భాగ్యనగరం జ్యూలోని వింతపక్షులు, మరియు మృగముల ఫోటోలు బాగున్నాయి. పత్రికను ఇంకా అభివృద్ధి చేస్తారని ఆశిస్తాను.

—మలకపల్లి సాంబశివకుమార్.
సీలంపేట, శ్రీకాకుళం జిల్లా

ఆగస్టు నెల ఆంధ్రప్రదేశ్ చేరినది. అది చాలా బరువుగా 31వ స్వాతంత్ర్య దినోత్సవ ప్రత్యేక సంచికగా, పత్రిక చదివినంత సేపూ 1947కు పూర్వపు రోజుల్లోకి మమ్ములను తీసుకొనిపోయినది. కైటిలు 1,4లు చాలా బాగున్నాయి. కైటిలు పేజీ త్రిప్పగానే వచన కవితా చక్రవర్తి ఆంధ్రమాత ముద్దు కవితా కుమారుడు, నవయుగ వైతాళికుడైన గురజాడవారి దర్శనభాగ్యం దేశమును ప్రేమించమంటో ప్రబోధించింది. తదుపరి ఉత్పలవారి ఛందోబద్ధ కవిత్వం, కవుతరం గ్రామ స్వాతంత్ర్యోద్యమ విశేషాలు, వెనువెంటనే రాయప్రోలువారిని గూర్చి, గణపతిముని, విప్లవ వీరునిసైదోడు పండుపడాలు, రామలింగారెడ్డిగారి నిస్వార్ధ సాహితీ సేవ, పురిపండవారి జీవిత విశేషాలు. ఏమిటో ఒక్కటీ తనివి తీరని వ్యాసాలే. ప్రతీదీ ఇంకా రెండుపేజీలుంటే బాగుండును అనిపించాయి. మంచి విషయాలు ఎంత చదివినా విన్నా తనివి తీరదుకదా! అవీ వ్యాసం ఒకటిరెండుసార్లు చదివి భద్రపరచుకొన వలసినవే. సంపాదకులుగా మీరు సమర్థవంతముగా గూర్చినారు. మా ద్వారా రచయితలకు అభినందనములు.

ఈనాటికి దుగ్గిరాల, గురజాడ, కందుకూరి వంటి మహానుభావుల కవితావేశపు స్వాతంత్ర్యసమర సాహిత్యము వెల్వడి నాల్గు దశాబ్దులైనా ఈ రోజుకీ వారి భావచిత్రీకరణ ప్రతి తెలుగుబిడ్డ హృదయాన్ని ఉత్తేజపరుస్తున్నదంటే వారు మనలనాదుకొన జన్మించిన ఋషులేనేమో!

ఇక జానపద సాహిత్యము—పల్లెపదాలు, కందాళం కుప్పుస్వామిగారి రచన, జానపద సాహిత్యము జానపద కళలు మగనిచే విడవబడిన మగనాలివలె ఉన్నవి కదా! కొంత వరకు ఈమధ్యన మన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారు ప్రోత్సాహమిచ్చి కొంత ఊరట కల్గించారు.

—శ్రీ పి. వి ఎస్. సుబ్రహ్మణ్యం
మంచిలి





# చిట్టి చిట్టి పాపల చిరునవ్వుల నిధి

బొమ్మల ప్రభావం చిన్నారి పాపలపై, ముఖ్యంగా జబ్బుతో ఉన్నవారిపై అమితంగా ఉంటుంది. దీనిని గురించిన ఒక ప్రయోగం మొదటగా డెన్మార్క్‌లో ప్రారంభమయింది. నార్వేలో కొనసాగుతోంది. అదే ప్రయోగం ఇప్పుడు విజయవాడలో రుజువయింది.



అమ్మ తర్వాత బొమ్మే !



డెన్మార్క్ దేశంలో మున్సిపల్ కాన్సర్ ఆసుపత్రి ఒకటుంది. 1936 వ సంవత్సరంలో ప్రొఫెసర్ క్రెబ్స్ అనే ఆయన అక్కడ ఒక డాక్టర్‌గా ఉండేవారు. ఆ ఆసుపత్రికి ఒక రోజున ఒక ప్రచురణ శాఖాధిపతి వద్దనుంచి సుమారు వెయ్యి రూపాయల విరాళం వచ్చింది ఆ సొమ్ము పంపుతూ ఆయన ఇలా వ్రాశారు. "ఈ మొత్తాన్ని కాన్సర్ వ్యాధిగ్రస్తుల సౌఖ్యంకోసం మీ ఇష్టం వచ్చినట్లుగా ఖర్చుపెట్టండి. కాన్సర్ వ్యాధితో మరణించిన మా బంధువుల జ్ఞాపకార్థం ఇది పంపుతున్నాను." డాక్టర్ క్రెబ్స్ ఈ మొత్తం తీసుకున్నాడు. ఎలా వినియోగిద్దామా ! అనే ఆలోచనలో పడాడు. సరే ! మామూలు పద్ధతిలో రోగుల్ని చూస్తున్నాడు. ఒక చోట కాన్సర్ వ్యాధిగ్రస్తురాలైన ఒక అమ్మాయి చేతిలో ఒక చక్కటి బొమ్మ ఉంది. దాంతో ఆడుతోంది అమ్మాయి. ప్రక్క మంచంమీద ఉన్న మరో అమ్మాయి ఆ బొమ్మవంక వెర్రిగా చూస్తోంది. ఆ దృశ్యం చూశాడు క్రెబ్స్. ఆ చూపుల్లోకల దీనత్వం అతణ్ణి కలచివేసింది. వెంటనే బజారుకి వెళ్ళి ఒక బొమ్మని కొని తెచ్చాడు. ఆ బిడ్డ సంతోషానికి మేర లేదు. డాక్టర్ పొందిన తృప్తికి అంతులేదు. అప్పుడు నిశ్చయించుకున్నాడు క్రెబ్స్, తన వద్దకు వచ్చిన విరాళాలన్నీ కలిపి బహుమతులకోసం వినియోగించాలని, కొంత సొమ్ము తనుకూడా కలిపి "ఫండ్ ఫర్ స్మాల్ ప్లెజర్స్" అనే నిధిని ప్రారంభించి ఒక బ్యాంకులో వేశాడు. "బొమ్మల సాన్నిధ్యంలో బాలలు తమ బాధలను మరచిపోయి త్వరగా కోలుకుంటారు" అని కొన్ని రోజుల వ్యవధిలోనే క్రెబ్స్ తెలుసుకున్నాడు. ఆయన ప్రారంభించిన ఈ 'నిధి' తర్వాత నార్వేలో కూడ ప్రారంభమయింది.

డెన్మార్క్‌లోని ఈ సంస్థగురించి 'రీడర్స్ డైజస్ట్' లో 1967 ప్రాంతంలో ఒక వ్యాసం ప్రచురితమయింది. విజయవాడ వాస్తవ్యుడు శ్రీ చంద్రమౌళీశ్వరరావు అనే రైల్వే ఉద్యోగిని ఈ వ్యాసం ఆకర్షించింది, వెంటనే ఆయన క్రెబ్సుకి తన ఉద్దేశం తెలియపరిచాడు, 1971 ఏప్రియల్‌లో పసిపాపల చిరునవ్వులు మూటకట్టుకోవాలనే ఆసక్తి, శ్రీ చంద్రమౌళీశ్వర రావు, ఆయన







చిరునవ్వుల నిధి।

స్నేహితులకి కలిగి మనదేశంలో మొట్టమొదటిసారిగా విజయవాడ రైల్వే ఆసుపత్రిలో ఆ సంస్థను ప్రారంభించారు.

పసివారికి 'అమ్మ తర్వాత బొమ్మే' అనే శాస్త్రం ఉంది. బొమ్మల ప్రపంచంలో తమ్మ తామే మరచిపోతారు బాలలు. బొమ్మరిళ్ళు కట్టుకొని భవిష్యత్తుకు బాటలువేసుకుంటూ ఊహల ఉయ్యాల్లో ఊగిపోతుంటారు. హాస్పిటల్ వాతావరణంలో జబ్బుతో ఉండే అటువంటి బాలలు బొమ్మలను చూడగానే చిరునవ్వులు చిందిస్తారు. ఆ నవ్వులు వెలలేనివి, బొమ్మలు అందించినవారిని పులకితం చేస్తాయి. ముఖ్యంగా రుగ్మతలో ఉన్నవారికి ఆనందం కల్పించడంలో ఎంతో సంతృప్తి, శాంతి ఉన్నాయి. ఈ అనిర్వచనీయ అనుభూతిని "ఫండ్ ఫర్ స్మాల్ ప్లెజర్స్" సంస్థ సభ్యులు పొందగలుగుతున్నారు

ఈ సంస్థ ప్రధాన వ్యక్తి, కార్యదర్శి అయిన శ్రీ చంద్రమౌళీశ్వరరావు ప్రతిరోజు ఉదయం రైల్వే ఆసుపత్రికి వెళతారు. అస్వస్థులుగా ఉన్న బాలబాలికల పడకలవద్ద చిన్నచిన్న ఆట వస్తువులు పెడతారు. వాటిని తిరిగి తీసికోరు. ఆ పాపలందరికి చిన్న చిన్న ఆటబొమ్మలు, వారి వారి అభిరుచులనుకూడా సాధ్యమైనంతవరకు గుర్తుంచుకొని పంచిపెడుతుంటారు.

ఇది రైల్వే ఆసుపత్రి వారి ఖర్చుకాదు. సంస్థ సభ్యుల వద్దనుండి వసూలు చేసిన విరాళాలనుంచి బొమ్మలు కొంటుంటారు. ప్రతి నెలా ఈ ప్రణాళికకు 80 రూపాయలు ఖర్చవుతుంది. దీనికున్న నిధులు చిన్నవేగాని బ్యాంకులో వేసి వాటిని కాపాడటం, వడ్డీద్వారా పెంచడం చేస్తూ ఉంటాము. అని చంద్రమౌళీశ్వరరావు గారు చెప్పారు. ఆసుపత్రిలోనే ఒక బీరువా నిండా బొమ్మలు, ఆనాడున్న బాలరోగుల జాబితా ఏర్పాట్లు అన్నీ ఉన్నాయి. పిల్లల వార్డులో బొమ్మల పుస్తకాల గ్రంథాలయాన్ని కూడ ఏర్పాటు చేశారు. డెన్మార్క్ నుంచి క్రెట్స్ పంపిన కొన్ని ఆట వస్తువులు కూడ అక్కడ ఉన్నాయి.

వ్యాధినుండి ఏరోగైనా నివారణ పొందాలంటే అతనికి కేవలం మందులు ఇచ్చినంత మాత్రాన చాలదు. వ్యాధి నయంచేయడానికి చిరునవ్వుతో ఎల్లప్పుడూ రోగికి ధైర్యం చెబుతూ మంచి మనస్సుతో సేవ చేసే డాక్టర్లూ, నర్సులూ అవసరం. అందువల్లనే ఇటీవలి కాలంలో మందులు ఇవ్వడం కంటే ఎక్కువగా మనస్సును ఆహ్లాదపరిచే వైద్యం చేయాలని డాక్టర్లు అభిలాష పడుతున్నారు. పిల్లల వార్డులో ఒక డాక్టర్ చెప్పినట్లుగా జబ్బుతో ఉన్న బాలలపై బొమ్మల ప్రభావం అమితంగా ఉంటుంది, వాటి సాన్నిధ్యంలో బాలలు తమ బాధను మరచిపోవటమే కాకుండా త్వరగా ఆరోగ్యంతో కోలుకోటానికి కూడ వీలవుతుంది. ఆసుపత్రిలో చికిత్సకు చేరిన బాలబాలికలకి ఈ సంస్థ ఇచ్చే బొమ్మలు సంతోషం, వినోదం చేకూర్చడమే కాకుండా పిల్లల తల్లి తండ్రులకు కూడ ఆనందదాయకంగా ఉంటోంది. పైగా పిల్లలకి ఇంజక్షన్లు ఇచ్చేటప్పుడు, కట్లు కట్టేటప్పుడు డాక్టర్ల ప్రయాస కొంతవరకు తగ్గుతున్నదట. అన్నిటికి మించి, డాక్టర్లు ఇచ్చే మందు బాగా పనిచేస్తుందట. ఈ సంస్థ కార్యకలాపాలను ఇటీవల విజయవాడ ప్రభుత్వ ఆసుపత్రిలో కూడ ప్రవేశపెట్టారు.

జడివాన రోజు కావచ్చు—మండు వేసవి కావచ్చు—ఎముకలు కొరికే చలికావచ్చు—ఏరోజయినా సరే "ఫండ్ ఫర్ స్మాల్ ప్లెజర్" (చిట్టి చిట్టి పాపల చిరునవ్వుల నిధి) రైల్వే హాస్పిటల్‌లో ఉన్న పిల్లల వార్డులో బొమ్మలు పంచుతూనే ఉంటారు. ఆ బొమ్మలతో ఆడుకుంటున్న పాపల ముఖంలో ఆనందాన్ని చూస్తే, ఈ పథకం ఇతర ప్రాంతాలలో కూడ అనుసరణీయమని అనిపిస్తుంది.

—సూరి





నెల్లూరు జిల్లా గుమ్మలదిబ్బ గ్రామంలో ఆగస్టు 16న గవర్నరు శ్రీమతి శారదాముఖర్జీ బలహీన వర్గాల వారికిరుణాలు పంపిణీ చేశారు.



ఆగస్టు 16న గవర్నరు గారు నెల్లూరులో మహిళా సూపర్ బజార్‌కు ప్రారంభోత్సవం చేశారు.

# జిల్లాల్లో



సెప్టెంబరు 1వ తేదీన కర్నూలు సమీపంలోని దిన్నెదేవర పాడులో కాల్షియం కార్బయిడు ప్రాజెక్టుకు ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు శంకుస్థాపన చేశారు.

చీరాల వద్ద ఆగస్టు 7న సాంఘిక సంక్షేమ శాఖ కార్యదర్శి శ్రీ ఎస్. ఆర్. శంకరన్ వెనుకబడిన తరగతుల విద్యార్థుల ప్రభుత్వ వసతిగృహానికి శంకుస్థాపన చేశారు.



సెప్టెంబరు 1న ముఖ్యమంత్రి గాజుల దిన్నె ప్రాజెక్టుకు సేద్యపునీటిని విడుదల చేసినదృశ్యం.



సీరియల్ :



# సర్వజ్ఞయోగి

—శ్రీ పులిచెర్ల సాంబశివరావు

—ద్వాదశ యోగము—

"ఒసేయ్ ! ఇది నీకు న్యాయం కాదే ! నా సొమ్మంతా తిని నన్నే గెంటివేస్తున్నావటే !"

"ఓరిపోరా ! నీ చేతిలో ఇప్పుడు చిల్లి గవ్వ అయినా లేదు ! నీతో నాకేం పని ?"

"సీసిగదరగ ! సత్ బ్రాహ్మణ వంశంలో పుట్టి, సర్వశాస్త్రాలూ చదివి, కొండవీటి ప్రభువుల్నే మెప్పించిన పండిత వరేణ్యుణ్ణే నేను !"

"నువ్వా బ్రాహ్మణుడివి ! నవ్వుతారు ఎవరైనా విటే ! సర్వశాస్త్రాలూ చదువుకుంది వేశ్యల వెంట తిరగటానికేనా ! స్త్రీలను నిందించటానికా !?"

"నువ్వా స్త్రీవి ? రాక్షసీ ! బ్రాహ్మణులను ఇలా మోసగించ వచ్చునటే ?"

"నువ్వెవరివైతే నాకేం ? నాకు కావలసింది ధనం ! ఇప్పుడు నీ దగ్గరదిలేదు ! పోపో !"

"పాతకీ : నీ కోసం పరమ పతివ్రత అయిన నా భార్యను విడచి వచ్చానే : సంపాదించిన సొమ్మంతా నీమొగాన కొట్టాను ! పెళ్ళాం బిడ్డలక్కడ అల్లాడుతూంటే ఇక్కడ నువ్వే సర్వస్వమని నమ్మిన నన్ను అన్యాయం చేస్తావా ?"

"వేశ్యల్లో న్యాయం వెదికే నువ్వు ఒక పండితుడవా ?" అంటూ ఆ వేశ్య అతణ్ణి మెడబట్టి గెంటింది. వాడు గడప తట్టుకొని వీధిలో పడ్డాడు. కన్నుల్లో దుమ్ముపడింది.

అతడు కన్నులు నులుము కున్నాడు. కన్నులు దుమ్ముతో నిండటంవలన దృష్టి సరిగా ఆనటం లేదు. నిలుచున్నాడు.

"రామస్వామిశాస్త్రీ !"

ఆ పిలుపువిని అతడు కన్నులు విచ్చి ఎదురుగా ఉన్న మూర్తిని చూశాడు. దివ్యమంగళ విగ్రహం సాక్షాత్కరించింది.

"రామస్వామిశాస్త్రీ !"

ఆ సిద్ధమూర్తి తన దివ్యకంఠంతో మళ్ళీ పిలిచాడు !

'అవమానంతో దహించుకు పోతున్న తనను ఇంత దయతో పిలుస్తున్నాడితడు ఎవరబ్బా ! ఈ దిగంబర సన్యాసిని ఎప్పుడో చూచినట్లుందే !' అని శాస్త్రి తర్కించుకొంటున్నాడు. ఏదో గుర్తు వచ్చింది.

'కొండవీటిలో....! అవును ! పెద్దనగారి భవనంలో.... కోటప్పకొండ తిరణాళ్లలో.... ఆ కన్నుల్లో ఆకర్షణ, ఆ ముఖ వర్చస్సు.... వేమారెడ్డి అవును !'

"మీరా ప్రభూ! మీ వంటి ప్రభువులేమిటి ఈ వేషం ఏమిటి? రసికులైన ప్రభువులకీ దిగంబరత్వ మేమిటి ?"

"శాస్త్రీ ! నీ రాసిక్యం ఇప్పుడు పరాకాష్ఠత నందిన దనుకుంటాను !"

"ప్రభూ! నేను పూర్తిగా పతనమయ్యాను : ప్రభువులిచ్చిన ధనాన్ని చూచి, స్థితిని మరచి, వేశ్యవలలో చిక్కి నాశన మయ్యాను. మీరే రక్షించాలి!"

"అయ్యా! వీరిప్పుడు ప్రభువులు కాదు! యోగులు!" వేమన వెంట ఉన్న విశ్వదాభిరామయ్య అన్నాడు.

"యోగి! రసజ్ఞశేఖరుడైన వేమారెడ్డి యోగా!"





"వేమారెడ్డి కాదు! వేమన!"

"నాలాగే ఏవేశ్యో ఈయన్నీ మోసగించి ఉంటుంది! లేక పోతే ఈయన ఏమిటీ. ఈస్థితేమిటి!''

వేమన్న చిరునవ్వు నవ్వాడు.

శాస్త్రి! నేను వేశ్యను తగిలిన మాటనిజమే! ఆటవెలదికి కట్టుబడ్డాను. కామం వలన పతనం తథ్యం!

ఇంద్రుడాయె కాము హీనుడై పోయెను!
మారుడాయె కాము మడిసి పోయె!
బ్రహ్మ యయ్యె కాము బయిసి పోయె!
విశ్వదాభిరామ వినురవేమ!

ఇంటి యాలి విడచి యిలజార కాంతల
వెంట తిరుగు వాడు వెఱ్ఱివాడు!
పంట చేను విడిచి పరిగె లేరినయట్లు
విశ్వదాభిరామ వినురవేమ!

గయ్యాళి భార్యలు భర్తలను వేధిస్తుంటారు.

ఆలు మగని మాట కడ్డంబు వచ్చెనా
ఆలుగాదు నుదుటి వ్రాలుగాని
అట్టియాలు విడిచి యడవి నుండుటమేలు
విశ్వదాభిరామ వినురవేమ!

వాడ కురికి తిట్టు వలదన్న మొరబెట్టు
ముందు మగని దిట్టు ముసుగు బెట్టు
గడుసురాలు మగని గంప బెట్టమ్మురా
విశ్వదాభిరామ వినురవేమ!

చెప్పులోని రాయి చెవిలోని జోరీగ
కంటిలోని నలుసు కాలిముల్లు
ఇంటిలోని పోరు నింతింత గాదయా
విశ్వదాభిరామ వినురవేమ!

మానవుడు తనలోని పరమాత్మ కిరణ లేశాన్ని కనుగొనాలి. ఇల్లు మొదలైనవి కాలిముల్లు వంటి వని తెలిసి కొనాలి. ఈసంసార వైరాగ్యాలమధ్య పోరింతింతగాదు"

ఈ బోధవిని శాస్త్రి చెంపలు వేసుకున్నాడు.

"యుగపురుషా ఓమ్మల్ని చూచి శృంగారిని అయ్యాను. ఇప్పుడు మిరలాఓమ్మ గాంచి మనసు మార్చుకొంటున్నాను. నన్ను మీ శిష్యునిగా స్వీకరించండి. నేనూ మీ వెంట యోగినై సంచరిస్తుంటాను!"

"శాస్త్రి! నీ భార్యాపుత్రులు నీ కోసం ఎదురు చూస్తున్నారు వారి నానందపెట్టు. నీకు మోక్షం వస్తుంది పొమ్ము!" అని ఆశీర్వదించాడు. శాస్త్రి వేమన్న ఆజ్ఞను శిరసావహించి స్వగృహానికి కదిలాడు.

ఇంతలో ఆ మూలనుండి కొందరు పిల్లలు రాళ్లు విసురుతూ "అదుగో వెఱ్ఱి వేముడు! కొట్టండి కొట్టండి!" అని కేకలువేస్తూ వెఱ్ఱి వాళ్లలాగా ఆ వైపునకు వస్తున్నారు. వారిని చూచి విశ్వదాభిరాముడు భయభ్రాంతుడైనాడు. "స్వామీ వారిక్కడకే వస్తున్నారు! మీకు హాని కలుగుతుంది. నా వెంట రండి!'' అని వేమన్నను బ్రతిమిలాడాడు. వేమన్నతల అడ్డంగా ఆడించాడు.

"వద్దు!ఆ పిల్లల్ని వినోదించనీయి! నావలన వారికి సంతోషం కలిగితే ఇంకేంకావాలి?''

హటాత్తుగా వేమన్న దృష్టి వేరొకవైపు మళ్లింది. పిల్లల చూపులు గూడా అటువైపు మళ్ళాయి. బ్రహ్మాండం బ్రద్దలయ్యేట్లు రంకెలు వేస్తూ రెండు అంబోతులు ఒకదాని నొకటి కుమ్ముకొంటూ ఆవైపుకే వస్తున్నాయి. దాని పాద ఘట్టనానికి భూమి కంపించి పోతూంది. దాని కొమ్ములు శూలాల్లా పదునుదేలి ఉన్నాయి. కన్నులు నిప్పులు రాలుస్తున్నాయి.

ఊరి వాళ్లంతా ఆ యెద్దుల చుట్టూ మూగి హాహాకారాలు చేసి వాటి పోట్లాట మాన్పటానికి ప్రయత్నిస్తున్నారు. ఎవరెంత అదిలించినా అవి చలించడంలేదు. గ్రామస్థులు భయభ్రాంతులయ్యారు.

ఆ దృశ్యం వేమన్న కంట బడింది. ఆయన ఎద్దుల నడుమకు పోబోయాడు.

''స్వామీ! మీరటకు పోవద్దు! అవి పశువులు! కోపంతో ఉన్నాయి. వాటి మధ్య పడి మీరు నలిగిపోతారు" విశ్వదాభిరామయ్య వేమన్నను వారించజూచాడు.

వేమన్న తన శిష్యుని మాటలను లెక్కపెట్టక వృషభాల మధ్యకునడిచాడు. రెండు చేతులతో ఆ బసవళ్ళను తాకాడు. చూచే వాళ్లంతా చకితులయ్యారు.

ఆ అంబోతులు మోరలెత్తి వేమన్నకు సాష్టాంగపడి లేచాయి. నాలుకలతో ఆయన శరీరాన్ని ప్రేమతో నాకుతున్నాయి!

ఈ వింతనుజూచిన వారంతా వేమన దివ్యపురుషుడని గుర్తించారు. 'వెర్రి వేమన' అన్న వాళ్లంతా సిగ్గుపడ్డారు. వేమన్నను శతవిధాల కొనియాడారు. తమ ఆతిథ్యాన్ని స్వీకరింపుడని ప్రార్థించారు. వేమన్న ఎవరితోను పలుక లేదు.

"అయ్యా! మీరందరూ వేమనగారి నిలా చుట్టుముట్టితే ఫలితం ఉండదు. మీ కష్టాలేమైనా ఉంటే చెప్పండి. స్వామి మీకు నివారణోపాయం చెబుతారు!" విశ్వదాభిరామయ్య జనసమూహానికి చెప్పాడు.

ఒక గ్రామస్థుడు ముందుకు వచ్చాడు.

"స్వామీ! మీకు తెలియనిదేముంది! కాటకం వలన చచ్చిపోతున్నాం! చిల్లిగవ్వలేదు! మీ స్వాములు బంగారం చేస్తారంటనవా! అదే నిజమైతే మాకు బంగారం ఇవ్వమనండి! లేదా బంగారం చేసే పద్ధతిని చెప్పమనండి! మేమే బంగారం చేసుకుంటాం!"

( సశేషం )








## కందుకూరి రుద్రకవి

(రచయిత: డా. రేవూరి అనంతపద్మనాభరావు, ప్రొడ్యూసర్, ఆకాశవాణి, కడప, వెల: రు 30 లు ప్రతులకు: శ్రీ ఆర్. లక్ష్మీకాంతరావు, చెన్నూరు గ్రామం వయా దామవరం, నెల్లూరు)

పెద్దన వంటి వారితో పోల్చినపుడు కందుకూరి రుద్రకవి అప్రసిద్ధుడే. అతని కాలమే వివాదాస్పదం. కొందరు 16వ శతాబ్ది అనీ, మరి కొందరు 17వ శతాబ్ది అనీ వాదింతురు. కావ్యముల విషయంలో కూడా అంతే. సుగ్రీవ విజయము, జనార్దనాష్టకము– ఇవి యితని రచనలుగా ప్రసిద్ధములైనవి. కొందరు రాష్ట్రౌఢ వంశ మహాకావ్యమను సంస్కృత మహాకావ్యము సైతమీతనికంటించినారు. గువ్వల చెన్నని శతకము గూడ రుద్రకవియే వ్రాసినాడను వాదము కేవలము పరిహాసాస్పదమైనది. స్వరదీపిక, సరసజన మనోరంజనము, బలవదరి శతకము, జనార్దన గద్య– ఇవన్నియూ రుద్రకవి కృతులే యని కొందరి వాదము. అసలు రుద్రకవులు ముగ్గురు, నలుగురున్నారని మరికొందరి తీర్పు. నిరంకుశోపాఖ్యానము అన్ని కావ్యముల వలెనే ప్రబంధము. నిజమునకు జనార్దనాష్టకము రుద్రకవి అపూర్వ రచన. సుగ్రీవ విజయ యక్షగానము కూడ అట్టిదే.

రాయల అష్ట దిగ్గజములలో ఈశాన్య దిక్కున ఈతనికి సింహాసన ముండెడిదని ఒక వాదమున్నది. నిజమే కావచ్చును అసలు రాయల అష్టదిగ్గజము లెవరెవరో – వారందరూ తెలుగు వారో కాదో ఈనాటికినీ తేలని విషయము. మనం మాత్రం ఎనిమిది మంది పేర్లను పట్టీకట్టి సంతోషపడుతున్నాము. భువన విజయముతోనే అష్టదిగ్గజము లారంభమైనా యనుకొనుటయు పొరపాటు. భువన విజయము గజపతులను జయించిన తర్వాత కట్టిన భవనము. రాయలు సింహాసనమునకు వచ్చిన మూడేండ్లకే అష్టదిగ్గజ కవుల నేర్పరచినాడని ప్రసిద్ధి. మరి పెద్దన్నగారు గజపతి యాత్రకుముందే మనుచరిత్రను ముగించినాడుకదా: 'భువన విజయాఖ్య సంసద్భుపనస్థిత భద్రపీఠి' అని ఎట్లన్నారు? ఎట్లన్నారనగా ఆ కాలంలో కావ్యరచన పూర్తి అయిన తర్వాతనే పీఠికలు వ్రాసెడి [illegible]. కనుకనే అట్లన్నారు.

[illegible]చార్యులతో రుద్రకవి అనేక వివాదములు చేసినాడనుట పొరపాటేమో! వారికి పంచమత భంజనం తాతాచార్యులవారని పేరు. వారి [illegible] శాస్త్రములు. కవులు ఒకవేళ ఒకటి రెండు శాస్త్రములు సాహిత్యమునకు తోడుగా చదువుకొని యున్నను శాస్త్రములలోనే నిరంతర వ్యాసంగ మొనర్చు పండితుల నెదిరించినాడనుట దుస్సాహసము.

ఈ గ్రంథ రచయిత అనంతపద్మనాభరావు అనేక విషయములను ఈ గ్రంథములో క్రోడీకరించినాడు. చాలా కష్టపడి విషయ సేకరణ చేశాడు. కానీ, అభిప్రాయభేదములుండక తప్పదు. కారణమేమనగా ఈ కవియే అప్రసిద్ధుడు. ఈ కవిపై ఈపాటి రచనము సాహిత్యములో మొదటి ప్రయత్నము. మను, వసు చరిత్రలు నిరంకుశోపాఖ్యానమును అనుసరించినాడని గ్రంథకర్త విస్తరించి చెప్పుచు పోయినాడు. మరి వసుచరిత్రము ముందో– నిరంకుశోపాఖ్యానము ముందో నిర్ణయించుట కష్టము.

నిరంకుశునివంటి పాత్రలు నిగమశర్మ మొదలైనవారు సాహిత్యంలో పెక్కుమంది ఉన్నారు. వారినందరినీ గ్రంథకర్త ఒకచోచేర్చి సమగ్రంగా తులతూచినాడు. ఇంతకూ ఈ గ్రంథం చక్కని పరిశ్రమతో కూడినది. ఇకమీద రుద్రకవిపైన పనిచేయు వారికి ఈ గ్రంథము కరదీపిక కాగలదు.

—డాక్టర్ పుట్టపర్తి నారాయణాచార్యులు

## మునిమాణిక్యాలు

(హాస్యకథానికల సంపుటి. సంపాదకుడు: [illegible] విశ్వనాథశాస్త్రి, శ్రీనివాస సాహితీ సమితి, హైదరాబాద్-500020. వెల: 3 రూపాయలు.)

మునిమాణిక్యంవారి పేరన హాస్యకథలకు పోటీ నిర్వహించి అందుకు న్యాయనిర్ణేతగా శ్రీ [illegible] తురగా కృష్ణమోహన్‌రావుగారిని నియమించి వారు ప్రకటించిన [illegible] కథలకు బహుమతులు యిచ్చి గౌరవించినట్లు శ్రీనివాస సమితి కార్యదర్శిగా 'మామాట' లో తెలియజేస్తున్నారు. ఈ సంకలనంలో పదిహేడు చిన్నకథలు, స్కెచెస్ లాంటివి వున్నాయి. వీరంతా నవనవలాడే నవయువక రచయితలే. ఈ సంకలనంలో కలిగిన ప్రోత్సాహాన్ని పురస్కరించుకుని వారు ముందుముందు జాగ్రత్తగా ఆలోచించి చక్కని కథలు వ్రాయాలని ఆశ. ఈ రచయితలను ఆశీర్వదిస్తూ శ్రీ రావూరి వెంకట సత్యనారాయణరావుగారు ఈ సంకలనంలోని కథల విశిష్టతను గురించి సమీక్షిస్తూ, అందమైన పీఠిక వ్రాశారు. ఈ సంకలనాన్ని కీర్తిశేషులైన శ్రీ తురగా కృష్ణమోహన్‌రావుగారికి అంకితం యివ్వడం సందర్భోచితంగా వుంది.

ఈ సంకలనంలో చేర్చిన కథలన్నీ హాస్యస్ఫోరకాలుగా లేవు. నిజం చెప్పాలంటే ఇవన్నీ మంచి కథ రాయడానికి క్రొత్తవారుపడే తాపత్రయం చేసే ప్రయత్నాలుగా వున్నాయి. దేనికీ ఏ ఒక్క కథకూ కూడా స్వరూపం రాలేదు. (ఒక్క 'ఒకనాటి భారతం' అనే స్కెచ్‌కు తప్ప). 'ఋణానుబంధం' కథ చాలా అసహజంగా అసందర్భంగా వుంది. ఉన్నవాటిలో మంచివి ఎన్నుకోవలసివస్తే శ్రీధర 'మరీచిక' కొంత యోగ్యంగా వుంది.

ఈ కథానికలు హాస్యకథానికల పేరిట ఓ సంకలనంగా ప్రచురింపతగిన స్థాయిలో లేకపోవడం విచారకరం. రచయితలు అజ్ఞాన దశలో ఏమేమో రాస్తారు–అవన్నీ ప్రచురణ యోగ్యం కాకపోవచ్చు. ఈ యాంథాలజీస్థాయి 'వెరీపూర్' అని చెప్పక తప్పదు. మునిమాణిక్యాలు అన్నంత మంచి పేరు పెట్టుకున్న పుస్తకంలో ఎంతమంచి కథలుంటాయో అని ఆశించేవారికి ఆశాభంగం కలిగిస్తుందీ సంకలనం.

—పి.





